# మిసిమి

చింతనాత్మక సారస్వతం




మాసపత్రిక, జనవరి, 2016 ₹ 25

ISSN 2454–4329

# మిసిమి
మాసపత్రిక

**"All that we are is the product of what we have thought"**
***- Dammapada.***

**సంపుటి 27 జనవరి 2016 సంచిక 1**

*ప్రధాన సంపాదకుడు*
చెన్నూరు ఆంజనేయ రెడ్డి

*సంపాదకుడు*
వల్లభనేని అశ్వినీకుమార్

*సహాయ సంపాదకుడు*
కాండ్రేగుల నాగేశ్వరరావు

*సాంకేతిక సహాయకులు*
పడవల ఉమాశంకర్, చేపూరి రమేష్,
మహమ్మద్ కుర్రాముద్దీన్ జీ షాన్, వెల్దండ రమేష్,
వేముల రాణి, సారిక నిర్మల,
నీలకంఠం నరసరాజు

*సంస్థాపక సంపాదకులు*
**రవీంద్రనాథ్ ఆలపాటి**

<u>*Printed & Published by*</u>

**Bapanna Alapati**
at **Kala Jyothi Process Pvt. Ltd.,**
1-1-60/5, R.T.C. 'X' Roads,
Musheerabad, Hyderabad - 500 020.
Ph. 040-27645536. Cell: 994 951 6567
E-mail : misimi_monthly@yahoo.in
www.misimimonthly.com
e-magazine : www.kinige.com/misimi

| | |
|---|---|
| ప్రతి : ₹ 25 | సంవత్సరానికి : ₹300 |
| విదేశాలకు ప్రతి : $ 2.50 | సంవత్సరానికి : $ 25 |

LIBRARY OF CONGRESS **LCCN 91-903060**

INTERNATIONAL STANDARD SERIAL NUMBER INTERNATIONAL CENTRE
**ISSN 2454-4329**


# ఈ నెల...



| | | | |
|---|---|---|---|
| *ముఖచిత్రం* | : మినర్వా ఆఫ్ పీస్ | చిత్రకారుడు | : Elifu Vedder |
| *రెండవ అట్ట* | : కాలపురుషుడు | " | : " " |
| *మూడవ అట్ట* | : నిర్మాణం | " | : " " |
| *నాల్గవ అట్ట* | : Guinevere | చిత్రకారుడు | : W. Leftwich Dodge |

అట్టతో కలిపి 100 పుటలు

*వివరాలు : 50 వ పుటలో...*

"... పరిపాల యంతాం న్యాయ్యేన మార్గేణ మహీ మహేశాః.."

పాలకులు భూమిని (ప్రజలను) న్యాయమార్గాన పరిపాలింతురుగాక! ఇదేమీ కోరరాని కోరిక కాదు – కాని తరతరాలనుంచి ప్రజలకు ఏమి ప్రాప్తమవుతుందో తెలియని విషయమూ కాదు–

నానాటికి పరిపాలకుల స్వార్థం పెరిగిపోవటానికి కారణమేమిటి?

వాషింగ్టన్‌లో, జెఫర్సన్ భవనం – అది నేషనల్ లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్. అందులో ఒక కుడ్య చిత్రం ఉంది. ఒకటేమిటి చాలానే ఉన్నాయి. 'అవినీతి' ప్రభుత్వం ఎలా వుంటుంది – ప్రజలకు 'శాంతి – సంపద' ఎలా వుండాలి – చిత్రాలన్నీ కథలు చెపుతాయి.

మానవజాతికి అవినీతి జాడ్యం ఇప్పటిది కాకపోయినా, ఇప్పటి పాలకులను మనం ఏ విధంగా సమర్థించగలం?



లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్ వాషింగ్‌టన్ డి.సి.

వేదాలకు సాధికారిక వ్యాఖ్యానం తెలుగువాడైన సాయణాచార్యుడు చెప్పినట్లు విన్నాం –

'కీర్తిప్రతిష్ఠలు' లో షోపెన్‌హావర్ కూడా వాల్మీకి, వ్యాస కాళిదాసులను బ్రహ్మస్వరూపులన్నాడు.

వీరికి ఏ పీఠం పురస్కారం అందించలేదు – ఇప్పటి ఆచార్యుల పయనం కీర్తిప్రతిష్ఠల కోసం, పురస్కార పీఠాల కోసం – రాజకీయ ప్రాపకం కోసం ప్రాకులాడటం – ఎన్ని దక్కినా ఇంకా ఏమి కావాలో తెలియని అజ్ఞానంలో కొట్టుమిట్టాడటం చూస్తుంటే అర్హత లేనివారే – ఇలా అర్రులుజాస్తుంటారనుకోవాలి – మరిన్ని వివరాలు 'కీర్తిప్రతిష్ఠలు'లో చదవండి.

ఇంతకీ చెప్పవచ్చింది ఏమిటంటే భారతీయ 'సాహిత్యం' ప్రపంచానికి చెప్పింది "పరిపాలనా యంతాం.." అని కదా. మన ఇంటనే ఇది కరువైతే ఇంక వెలుపల ఏమి చూడగలం?

'వేదిక' ను అందరూ ఆహ్వానించారు – సత్యపీఠం ఎక్కటానికి కొందరు ముందుకూ వస్తున్నారు –

ఆ వివరాలు తప్పనిసరిగా తెలుసుకోవలసినవే – అభిప్రాయ భేదాలు ఎప్పుడూ వుంటాయి – ప్రజాస్వామ్యంలో – చర్చల్లో ఇవి భాగమే మరి.

దేశభక్తి గేయ రచనలో తనదంటూ ప్రత్యేక ముద్రను ఏర్పరచుకున్న కవి ప్రదీప్. ఆ పాటలు వింటూంటే మనసు ఉప్పొంగుతుంది, దేశం కోసం ఎంతటి త్యాగానికైనా సిద్ధపడేలా చేస్తుంది. సరళమైన హిందీ భాషలో కదం తొక్కుతాయి ఆయన పాటలు.

**మిసిమి** రచయితలకు, పాఠకులకు, శ్రేయోభిలాషులకు నూతన సంవత్సర శుభాకాంక్షలు.

**– సంపాదకులు**



# కమ్మతెమ్మెరలు

✶ "... మిసమిస సొగసుల సంగతేమో గాని, ***మిసిమి***ని చూస్తే చాలు మనస్సు సుమనోహరం, భావాంబర వీధులలో విహరింప జేసే సారస్వతం, నెల నెలా ప్రోది చేసుకొనే ***మిసిమి***కే సొంతం ... ముద్రణలోగాని, విషయాలకు గాని ఏ విధమైన రాజీ పడకుండా సకాలానికి పాఠకులకు పత్రికను అందిస్తున్న మీకు అభినందనలు. ఫీచర్లు విభిన్నంగా పాఠకుల అభిరుచుల మేరకు అందించటం మరో విశేషం...

... ఇక డిసెంబరు 2015 సంచిక గురించి ప్రస్తావించ వలసి వస్తే ముందుగా ఫలానా అని చెప్పే సాహసం చేయలేకపోతున్నా. అయినా వరుసక్రమాన్ని పరిగణనలోనికి తీసుకోకుండా చెప్పే ప్రయత్నం చేస్తా...

... *వేదిక* ఏర్పాటు చాలా సముచితంగా ఉంది. తెలియని విషయాలు, ఇంకా ఏదో చెప్పాలనుకొనేవాళ్ళకి అనుకూలంగా వుంటూ పత్రిక స్థాయిని మరింత పెంచేదిగానే వస్తుంది. అందునా దీన్నో సత్య పీఠం అన్నారు, కాబట్టి అందరూ ఎక్కే సాహసం చేయరు...

... గాన గంధర్వ ఘంటసాల గారిని వారి గీతాలను గుర్తు చేసుకొనే సందర్భం డిసెంబరు – అయితే డా॥ సరోజినీ నాయుడు గార్ని గూర్చి *జాతిరత్నం* ఫీచర్ వెంబడే *అమ్మా సరోజినీదేవి* పాటను, వివరణను ఇవ్వటం చాలా బాగుంది. అవంత్స అందించిన *కృష్ణశాస్త్రి*గారి కవిభావన అమృతప్రాయమే. *వైతాళికు*లలో *గూడవల్లి రామబ్రహ్మం* గార్ని గూర్చి కొసరాజు గారి రచన ఆద్యంతం ఆకట్టుకుంది. ఖలీల్‌కు సంబంధించిన కాళోజీగారి రచనలో చిన్న వయసులోనే *Prophet* మహాకావ్యాన్ని మొదటిసారిగా రాసి, తల్లికి వినిపించి తర్వాత సవరింపు చేసుకోవటం గురించి చక్కగా చెప్పారు. *పురస్కార సాహిత్యం*లో గడియారం వారి సాహిత్యం, *శతపత్రం* గూర్చి, రావినూతల గారి పరిచయం ప్రశంసించదగినది...



... చిట్టచివరగా *అట్టమీది బొమ్మల* గూర్చి ప్రస్తావించ వలసి వస్తే ఈ పత్రిక సాహితీ విలువలతోపాటు, కళాత్మక విలువలకూ ప్రాధాన్యం ఇస్తుందని చెప్పక తప్పదు. సాల్వీ, చాగంటి, స్రవంతిల చిత్రాలు అత్యంత అద్భుతంగా వున్నాయి. మగ్దలీనా శిల్ప చిత్రం సజీవంగా ఉంది...

... మీ సంపాదకీయం గురించి ఒక్కమాట చెప్పాలంటే ఆలోచనాత్మకంగా నవ్యతతో ఉంటుంది. పత్రిక ఆసాంతం సర్వదా అభినందనీయం. పాఠకునికి సంతృప్తికరంగా వుండేలా తీర్చి దిద్దబడుతుంది..."

– **డా॥ ఇమ్మిడిశెట్టి చక్రపాణి,** అనకాపల్లి.

✶ "... ***మిసిమి*** నన్ను యీ వృద్ధాప్యంలో చాలా చాలా కదిలిస్తున్నది. మీ చిత్రకళాభిరుచికి ఆనందిస్తున్నాను. 1, 2, 3, 4 అట్టల చిత్రాలు పరమాద్భుతం... దేవికారాణి చౌదరి గురించి గతంలో చదివాను. విన్నాను ఆనాటి పెద్దలు చెప్పగా – !

... సంజీవదేవ్ రోరిక్ గురించి గొప్పగా వ్రాసారు... దేవికారాణి చిత్రాన్ని శ్రీమతి శివరాజు సుబ్బులక్ష్మి గారు చిత్రించారంటే ఆశ్చర్య పోతున్నాను. కథారచయిత్రిగా – చిత్రకారిణిగా తెలుసు ప్రముఖ నవలా రచయితా – కథకుడు బుచ్చిబాబుగారి భార్యగా వూహించలేక పోయాను...

... ఆమె కను రెప్పలలో అనంతాంబరపు నీలినీడలు కలవు అన్నట్లుగా వుందాచిత్రం. చిత్రకారిణి ప్రతిభకు నమస్కరిస్తున్నాను. గురజాడ వారి గురించి – *మేముత్తివెధవాయలమే* వెల్చేరు వారి వ్యాసాన్ని ఎవరూ ఆమోదించరు. బాగా యెత్తుకు యెదిగిన తరవాత ఏం వ్రాసినా చెల్లుతుందనుకోవడం మంచిది కాదనుకుంటా!...

... *శ్రీరంగం గోపాలరత్నం*గారి గురించి శ్రీమతి జానకీబాల ఎంతో చక్కగా వ్రాసారు సుమా! ..."

– **చెరుకువాడ వెంకట్రామయ్య,** విస్సాకోడేరు

✶ “... నేను గత నాలుగు సంవత్సరముల నుండి ***మిసిమి*** పత్రిక చందాదారునిగా పత్రికను అందుకుని అనేక విలువైన సాహిత్య, చారిత్రక విషయములపై వ్యాసములు చదువుతూ, విలువైన విషయములు తెలుసుకుంటూ హృదయోల్లాసము పొందుతున్నాను. అనేకమంది పెద్దల జీవిత చరిత్రలు, ఆయా రంగాల్లో నిష్ణాతులైన వారి కృషి తెలుసు కొనుట ఎంతో ఆనందదాయకం. పరోక్షంగా అయినప్పటికీ వారితో పరిచయం మహాభాగ్యం. ముఖచిత్రాలేకాక మిగిలిన అట్టలపై చిత్రాలు కూడా ఎంతో ఆకర్షణీయంగా ఉంటున్నాయి. ఇవి సేకరించుట ఎంతో శ్రమతో కూడిన పని... ఇక స్వవిషయం చెప్పుకోవలసి యున్నది. నేను కడు వృద్ధుణ్ణి. 16-09- 2015 న 94వ సం॥లో అడుగు పెట్టాను. సెప్టెంబరు 3 ఉదయం నిద్రనుండి లేచిన 15 నిమిషాల్లోనే బెడ్ రూమ్‌లోనే పడిపోయా. కుడికాలు హిప్ ఫ్రాక్చర్ అయ్యింది. ఆ రోజు నుంచి నేను ఇన్ పేషెంటుగా హాస్పటల్‌లో డాక్టర్ల పర్యవేక్షణలో ఉన్నా. నా యీ ప్రస్తుత పరిస్థితిలో సాలు చందా రెన్యువల్ చేయలేనని మీకు తెలియజేయుటకు చింతించుచున్నాను. ఇంతకాలంగా ఆనందంగా, ఆరోగ్యంగా జీవించటానికి ముఖ్యకారణం నా సాహితీ మిత్రులు – ఆ పైన పుస్తకాలు... ***మిసిమి*** పత్రిక చందా 2015 సెప్టెంబరుతో ముగిసింది. అయినప్పటికీ అక్టోబరు – నవంబరు పత్రికలు పంపినారు. ధన్యవాదములు. ఒక విలువైన పత్రికకు చందా ముగింపు చెప్పడం బాధగానే యున్నది కాని ***మిసిమి*** పత్రిక పట్లగల అభిమానం వలన ఇంతగా ప్రస్తావన చేయడం జరిగింది...”




**– వెలమాటి సత్యనారాయణ,** రాజమండ్రి.

✶ “... నవంబరు సంచికలోని *శ్రీరంగం గోపాలరత్నం* గారి వ్యాసం చాలా బాగుంది. ఆవిడ *బికారి రాముడు*లో ఘంటసాలతో రెండు యుగళ గీతాలు కూడా పాడారని బాగా గుర్తు. – పాలగుమ్మి పద్మరాజుగారి రచనలు...”

**– డి.ఎస్. శంకర్,** వక్కలంక

✶ “... ***మిసిమి*** ప్రతి సంచికా సాహిత్య కళాభిమానులను అలరిస్తూనే ఉన్నది. డిసెంబరు సంచికలో *గూడవల్లి రామబ్రహ్మం* గురించి కొసరాజు వ్రాసిన వ్యాసం బాగుంది. మధుమేహ వ్యాధిగ్రస్తుడైన రామబ్రహ్మం అవసాన దశలో పక్షవాతంతో బాధపడి 1-10-1946న కాలధర్మం చెందారు. కొసరాజు అంతిమ శ్వాస విడిచింది 1977లో కాదు, 1986లో. ఆవంత్స సోమసుందర్, దాశరథి రంగాచార్య, సాయిపాపినేని, కాళోజీ, రావినూతల, శివనాగిరెడ్డి, యార్లగడ్డ, ప్రమోద్‌కుమార్ మొదలైన వారి రచనలు ఆకట్టుకున్నాయి....

“... *అమ్మా! సరోజినీదేవి* పాటను సంగీతపరంగా హృద్యంగా వివరించి పురుషోత్తమాచార్య అభినందనీయులు. వరవరరావుగారి *మా జాతి గులాబిరెమ్మా* వ్యాసం ఈ తరానికి అనేక విశేషాలను తెలిపింది.

“... *అమ్మా! సరోజినీదేవి* పాటను ఘంటసాల పాడిన రికార్డును మా చిన్నతనంలో విన్నాం. ఆ పాటను టంగుటూరి సూర్యకుమారి పాడలేదనుకుంటాను. పెద్దలు నిర్ధారణ చేయగోర్తాను...”

**– డా॥ పి. దక్షిణామూర్తి** తెనాలి.



|సాహిత్యం ఒక కళ|



ఆర్థర్ షోపెన్ హోవర్

# కీర్తి ప్రతిష్ఠలు

– ఆర్థర్ షోపెన్ హోవర్

'తోకచుక్కలు, గ్రహాలు, నక్షత్రాలు' అంటూ రచయితల్ని మూడు రకాలుగా విభజించవచ్చు. క్షణకాలం పాటు తళుక్కున మెరిసి, అందరి దృష్టినీ ఆకర్షించి అంతలోనే కనుమరుగైపోతాయి తోకచుక్కలు. కాని గ్రహాలు, నక్షత్రాలు చిరకాలంగా కొనసాగుతూనే ఉన్నాయి. కొన్ని నక్షత్రాలు ఎక్కువ ప్రకాశవంతంగా కనిపిస్తాయి. దీనికి కారణం అవి మనకు చేరువలో వుండటమే. సమకాలికుల దృష్టిలో మాత్రమే మహా రచయితలనిపించుకుంటారు కొందరు. కాని, తరువాతి తరాలవాళ్ళు, ఈ రచయిత వునికిని కూడా గుర్తించరు. కొన్ని నక్షత్రాలు గగన తలంలో అనంతంగా వెలుగుతూనే వున్నాయి. వాటికి మరణం లేదనిపిస్తుంది. ఇవి ఒకసారి తక్కువ, మరొకసారి ఎక్కువ ప్రకాశవంతంగా వుండవు. వేల ఏళ్ళుగా మనం కొందరు రచయితల్ని చదువుతూనే వున్నాం – ఈ మధ్యకాలంలో మరెందరు వచ్చి, నిష్క్రమించారో తెలియదు. అలనాటి రచయితలు, అనాదిగా కాంతిని ప్రసరిస్తున్న కాంతిపుంజాలు. సుదూర నక్షత్రాలు. దేశ కాల పరిస్థితులకు వాళ్ళు అతీతులు. సార్వకాలీనత, సార్వజనీనత వాళ్ళ లక్షణం. మానవజాతి సమస్తం వాళ్ళ వారసత్వమే. *నక్షత్రాల కాంతి మనను చేరటానికి చాలా కాలం పడుతుంది.*

అసమాన ప్రతిభగల రచయితలను, తక్షణ కీర్తిప్రతిష్ఠలు వరించవని యిప్పటికే తెలుసుకున్నాం (గత అధ్యాయంలో) – ఎందుకంటే సామాన్య ప్రజలకు వీళ్ళను బేరీజు వెయ్యగలిగిన సంస్కారం వుండదు. కాని, యింతకన్నా ముఖ్యకారణం మరొకటుంది. సమకాలీనుల అసూయ వీళ్ళకు గుర్తింపు రాకపోవటానికి పెద్ద అడ్డంకిగా మారుతుంది. ఒకరికి కీర్తి రావటానికి, సహ రచయితల అసూయకన్నా పెద్ద అడ్డుగోడ మరొకటుండదు. ఎంత మందిని, ఎన్ని రకాల యిది అనామకులుగా మార్చిందో ఊహకు కూడా అందదు.

ఒక వ్యక్తికి వచ్చే గుర్తింపును పురిట్లోనే గొంతు నులిమి చంపటానికి సమకాలికులు తరతరాలుగా ఉపయోగిస్తున్న రహస్యాయుధం అసూయ. తమకు రాని గుర్తింపు మరొకరికి రాకుండా చెయ్యటమే వీరి పని. వీళ్ళ దృష్టిలో ఎవరికీ స్వంత వ్యక్తిత్వముండకూడదు. ఇతర్లు వాళ్ళనుండి ఏమాశిస్తున్నారో ఆ పనులే చెయ్యాలి. ఎలా వుండాలనుకుంటున్నారో అలాగే వుండాలి. ఎవరైనా తమకన్నా భిన్నంగా వుండి గుర్తింపు తెచ్చుకోవటం వీళ్ళు సహించలేరు. అయితే, ఎంత ప్రయత్నించీ, కొందరి కీర్తిప్రతిష్ఠల్ని అడ్డుకోలేరు గాని, చివరి క్షణం దాకా అన్ని రకాల ప్రయత్నాలూ చెయ్యటం తమ కర్తవ్యమనుకుంటారు వీళ్ళు. జీనియస్‌ల పట్ల సెకండ్ రేట్ రచయితల కడుపుమంట ఈనాటివి కాదు.

ప్రతిభపట్ల రెండు రకాల దృక్పథాలు అలవర్చుకోవచ్చు. ఒకటి – మనం స్వయంగా ప్రతిభ సంపాదించుకోవటానికి ప్రయత్నించటం. రెండు – మరొకరి ప్రతిభను గుర్తించటానికి నిరాకరించటం. ఈ రెండవ పద్ధతిని ఆచరించటం సులభం. సమాజంలో అందరూ చేసే పని యిదే. అసూయ అనేది మన లోపాలకు, మనలోని బలహీనతలకు చిహ్నం. అందువల్ల మన లోపాలను అంగీకరించటం కన్న, ఎదుటి మనిషికి ప్రతిభ లేదని వాదించటం సులభం. స్పానిష్ రచయిత, తత్త్వవేత్త బాల్తజార్ గ్రేసియన్ (1601–1658), అసూయకూ, ప్రతిభకూ వున్న సంబంధం గురించి ఓ పిట్టకథ చెప్పారు. ఒకసారి అడవిలోని పక్షులన్నీ కలిసి నెమలికి వ్యతిరేకంగా ఓ కుట్ర చేశాయి. దాని అందం మిగతావాటికి లేదు మరి.

"దాని పొగరు చూడు దాని టెక్కు చూడు, దాని రెక్కల్ని పీకేస్తేగాని దానికి బుద్ధిరాదు. అందమంతా తనదే అనుకొని ఎంత నీల్గుతున్నది!" అంటూ తన అక్కసు వెళ్ళబోసుకుంది నల్లకాకి.

"ప్రతిభ లేకపోవటమే నిజమైన ప్రతిభ. అదే అందరికీ వుండవలసిన సుగుణం'' అనే వాదన అసూయకు మారుపేరు. ఇది నిజమని నమ్మిన కుళ్ళుబోతు వెధవలు ప్రతి కాలంలోనూ వున్నారు. ప్రతిభావంతులను కించపరచటానికి వాళ్ళ దగ్గర వున్న ఏకైక ఆయుధమిదే. ఇదే వాళ్ళ బ్రహ్మాస్త్రం. ప్రతిభ లేనివాళ్ళను ఆత్మన్యూనత నుండి రక్షించగలిగిన కవచకుండలలాంటిదిది. అందువల్ల కనీసం ఈ సుగుణమైనా తమకు పుష్కలంగా వుండాలని కోరుకుంటారు. నా ప్రధాన రచన World as will and Representation లో ఈ విషయాన్ని విస్తృతంగా చర్చించాను. "ప్రతిభ లేనివాళ్ళకు వినయమే భూషణము" అని తన Miscellaneous Writings లో ఒకచోట రాస్తాడు; లిక్టెన్‌బర్గ్ – గోతె మరింత దూకుడుగా "దొంగ వెధవలే అతి వినయం ప్రదర్శిస్తారు" అంటారు. అయితే, అంతకు ముందు సెర్వాంటెస్ కూడా యిలాంటి మాటలే చెప్పాడు. ఈయన తన Journey up Parnasus లో కవులకు యిలా సలహా యిస్తాడు : "కవులు తమ గురించి ఎప్పుడూ తక్కువ అంచనా వేసుకోకూడదు. ఎందుకంటే "అతి వినయం ధూర్తలక్షణం" అని ఒక నానుడి వుంది. ఇక, ఈ విషయంలో షేక్స్‌పియర్ కూడా తక్కువ తినలేదు. తన కవిత్వానికి మరణం లేదని పదేపదే చెప్పుకున్నారు (సానెట్స్‌లో). "ప్రాచీనుల్లోగాని, ఆధునికుల్లోగాని, స్వంత రచనల గురించి యింత ఆత్మవిశ్వాసం ప్రదర్శించిన రచయిత మరొకడు లేడు." అంటాడు కోలియేర్.

మంచి రచనల్ని, గొప్ప గ్రంథాల్ని ఎద్దేవా చెయ్యటం, వాటి విలువ తగ్గించి చూడడం అసూయాపరులకత్యంత యిష్టమైన పని. కాని అలా చెయ్యటం వాళ్ళకసాధ్యం. అందువల్ల చెత్త పుస్తకాలను ఆకాశానికెత్తుతారు. వాటినే అనర్ఘరత్నాలని కీర్తిస్తారు. అలా చెయ్యటంవల్ల మంచి పుస్తకాల నుండి ప్రజల దృష్టిని మళ్ళిస్తారు. కాని, అరచేతిని అడ్డుపెట్టి సూర్యకాంతినెవరాపగలరు? వాళ్ళు శతసహస్ర విధాల ప్రయత్నించినా, త్వరలోనే, మబ్బుతెరలను చీల్చుకుని జాజ్వల్యమానంగా ప్రకాశిస్తాడు సూర్యుడు. చెత్తపుస్తకాలు సంపాదించుకున్న కీర్తి మూణ్ణాళ్ళ ముచ్చటగా మిగిలిపోతుంది. అఖ్యాతి అనబడే దుమ్ము వాటిని కప్పేస్తుంది. ఇలాగ దుష్ప్రచారం చేసేవాళ్ళూ, శకున పక్షులూ అజ్ఞాతంలో వుండటానికిష్టపడతారు. తమ మొహాలకూ మసి అంటుతుందేమోనని.

అంతమాత్రాన, వీళ్ళు తమ కుటిల యత్నాలను మానేస్తారా? లేదు. ఒకటి కాకపోతే, మరొక తప్పుడు దారి వెతుక్కుంటారు. ప్రతిభావంతుడు రంగప్రవేశం చేసినప్పుడు, సమకాలికులందరూ పిడుగుపడినట్టుగా వులిక్కిపడతారు. నెమలి పింఛం యితర పక్షుల్లో అసూయ రగిలించిందే, అలా ప్రతిభాసూర్యుడి ముందు నిశ్చేష్టులవుతారు. నోళ్ళు పెగలవు. సామూహికంగా అందరికీ పక్షవాతం వచ్చిందా, కాళ్ళూ చేతులూ పడిపోయాయా అనిపిస్తుంది. అయితే, ఆ నిశ్శబ్దం ఒక కుట్ర. సెనెకా అన్నట్టుగా ఆ మౌనముద్రలో కాలనాగులు కాటెయ్యాటానికి అవకాశం కోసం వెదుక్కుంటాయి. 'సాంకేతికంగా' ఈ మౌనానికి మనం 'విస్మరించటం' అని పేరుపెట్టొచ్చు. మంచి పుస్తకానికి గుర్తింపు రాకుండా వుండటానికి యిది తాత్కాలికంగానైనా వుపయోగపడుతుంది. ఒక రచయితకున్న పాఠకులందరూ అతని ప్రత్యర్థులే అయినప్పుడు, అతనికి కీర్తి వచ్చే అవకాశమే లేదుగద! పుస్తకాన్ని గురించిన సద్విమర్శకే తావులేదు. అందరూ అందులోని లోపాల్ని ఎత్తిచూపేవాళ్ళే. లేదా దాని గురించి మాట్లాడగూడదని మూతి బిగించుకొని కూర్చున్నవాళ్ళే. ఒకవేళ, ఈ కుట్రదార్లు, మౌనం వీడి, దాన్ని పొగడాల్సి వచ్చినా, దాని వెనకా మరేదో రహస్య కారణముంటుంది. పుస్తకం "విదేశాలలో ప్రచురితమైతే తప్ప దానికి నిజమైన గుర్తింపు రాదు" అంటాడు గోతె.

"మనం చేస్తున్న పనే మరొకరు చేసినప్పుడు, వాణ్ణి పొగడమంటే మనల్ని మనం కించపరచుకోవటమే. మన స్వంత పనికివ్వని విలువ పరులకిస్తున్నామన్న మాట."
–గోతె.

అందువల్ల సమకాలీనులు ఒక వ్యక్తి ప్రతిభను గుర్తించకపోవటం సహజమే. అలాగే, లోపాలు వెదకటం, రంధ్రాన్వేషణ చెయ్యటం మరింత సహజం. ఇలా చెయ్యటంవల్ల మనం యితర్లకన్న గొప్పవాళ్లమని ప్రకటించుకుంటున్నాం. ఇన్ని అడ్డంకుల్ని అధిగమించి, ఎవరినైనా కీర్తి వరించిందంటే దానికి మరేదో బలమైన

కారణముండి వుండాలి. పరస్పరం పొగడ్తలలో ముంచెత్తుకొనే భజన బృందాల గురించి నేను మాట్లాడటంలేదు. ఒక గొప్ప పని స్వయంగా చెయ్యటంలో వచ్చినంత తృప్తి, మరొకరి కృషిని గుర్తించటంలోనూ వస్తుంది. మొదట హీసియడ్ (గ్రీక్ కవి – హోమర్ సమకాలికుడు), తరువాత మాకియవెల్లి యిలా శెలవిచ్చారు "కొందరు సత్యాన్ని స్వయంగా గ్రహించగలరు. కొందరు చెబితే తెలుసుకుంటారు. మరికొందరికి స్వయంగా తెలుసుకునే జ్ఞానమూ వుండదు, చెప్పినా గ్రహించలేరు". అందువల్ల, మొదటి రకానికి చెందలేని వ్యక్తి, కనీసం రెండో రకంగానైనా వుండాలనుకుంటాడు. ఎవరికైనా గుర్తింపు దొరికేది వీళ్ళవల్లే.

అయితే ఒకసారి గుర్తింపు లభించిన తర్వాత, ఆ పుస్తకాన్ని, లేదా ఆ పనిని ఆకాశానికెత్తటానికి జనం పోటీపడతారు. అలా పొగడకపోతే, తమ గౌరవం తగ్గిపోతుందేమోనని వాళ్ళ భయం. "జ్ఞానం ఎక్కడుందో గుర్తించినవాడే జ్ఞాని" అన్న జెనోఫోన్ సూక్తిని ఆచరణలో పెడతారు. ఒక పనిని స్వయంగా చెయ్యటంవల్ల సంపాదించలేని కీర్తిని, దాన్ని శ్లాఘించటం వల్లనైనా మూటగట్టుకోవాలనుకుంటారు. సైన్యం ఓటమి ముంగిట వున్నప్పుడు చేసే పని యిదే. మొదట సైనికులందరూ ముందు వరసలో వుండాలనుకొంటారు. కాని పరాజయం తప్పదనుకున్నప్పుడు పారిపోవటానికి పోటీపడతారు. తిరోగమనం చిత్తగించినవాళ్లు, తమలో అత్యంత సమర్థవంతమైన తిరోగమనదారుని ఆదర్శంగా తీసుకొని, అతడి మీద పొగడ్తల వర్షం కురిపిస్తారు. అంటే, ఏ అభిరుచి వున్నవాళ్ళు ఆ అభిరుచికి అనుకూలంగా వున్న రచయితలనే ఆదర్శంగా తీసుకుంటారు. వాళ్ళతోనే పోటీ పడాలనుకుంటారు.

ఈ చర్చతో మనకు స్పష్టమైనదొక్కటే. కీర్తి శిఖరాలనధిరోహించటం కష్టసాధ్యమే అయినప్పటికీ, సంపాదించిన కీర్తిప్రతిష్ఠల్ని నిలుపుకోవటం మరింత కష్టం. అంతేకాదు, అప్రయత్నంగా లేదా అతి సులభంగా వరించిన కీర్తి ఎక్కువ కాలం కొనసాగదు. అందరికీ సాధ్యమైన పనే మనమూ చేసి కీర్తి సంపాదించుకుంటే యితర్లూ అలాగే చేస్తారు. మనకు వచ్చిన కీర్తి అంత త్వరగానూ పలచనైపోతుంది. ఎందుకంటే, కీర్తిమంతుల్ని అనుకరించటానికే అందరూ కోరుకుంటారు. అంతేకాదు, ఎవరికైనా త్వరగా కీర్తి వరించిందంటే అది కాస్త అనుమానించవలసిన విషయమే. దీన్ని తమలాంటివాణ్ణి చూసి జనం చేసిన కరతాళ ధ్వనిగానే భావించాలి. ఒక ఉదాహరణ ద్వారా ఈ వింత పరిస్థితిని మనం అర్థం చేసుకోవచ్చు. ఎథీనియన్ రాజకీయ ప్రముఖుడు ఫోషియస్ అనర్గళంగా వుపన్యసిస్తున్నప్పుడు శ్రోతల కరతాళ ధ్వనులు మిన్నుముట్టాయట. వెంటనే తన ఉపన్యాసం ఆపి, "ఏమైనా తప్పుగా మాట్లాడానా? నా మాటలు మీకు అంత మూర్ఖంగా వినిపించాయా?" అని అడిగాడట ఫోషియస్.

చిరకాలం మనగలిగిన కీర్తి క్రమంగా, నెమ్మదిగా పరిపక్వతను సంపాదించుకుంటుంది. సమకాలికులు మాత్రమేకాదు, తరువాతి తరాలవాళ్ళు కూడా శ్లాఘించగలిగిన గుర్తింపు రావటానికి చాలా సమయం పడుతుంది. ఇది సాధించగలిగినవాడు కోటికొక్కడు. సమకాలికుల అసూయను తట్టుకుని శతాబ్దాలపాటు నిలిచిపోగలిగినవాళ్ళు అరుదు. కాని, కొద్దిపాటి ప్రతిభ వున్నా, తక్షణ కీర్తిని పొందటం అంత కష్టమేమీ కాదు. ఇలాంటివాళ్ళు, తమ జీవితకాలంలోనే, ఆ కీర్తి తొలి మంచులా కరిగిపోవటం కూడా చూస్తారు. అంటే యవ్వనంలో తమకంటూ ఓ గుర్తింపు సంపాదించుకున్న వాళ్ళు వృద్ధాప్యంలో అనామకులుగా జీవితం గడుపుతారు. కాని నిజమైన ప్రతిభావంతులు, అనేక సంవత్సరాలపాటు అజ్ఞాతంలో గడిపినా, చివరికి వాళ్ళ పేరు జాజ్వల్యమానంగా వెలుగుతుంది. కొన్నిసార్లు మరణానంతరమే యిది సంభవించవచ్చుగాక. అంటే మరణశయ్యే వాళ్ళ కీర్తి సింహాసనం (రోమన్ కాథలిక్కు సంప్రదాయంలో మహనీయులను మరణానంతరమే సెయింట్స్ గా గుర్తిస్తారు). జర్మన్ కవి, రచయిత, జర్నలిస్టు (1771–1826) సీగ్‌ఫ్రీడ్ ఆగస్ట్ మాల్‌మాన్, తన రచన Herodes లో చెప్పినట్టుగా, గొప్ప పని ఏదైనా జనసామాన్యానికి వెంటనే నచ్చదు. జనం ప్రతిష్ఠించిన దేవతా విగ్రహం ఎంతోకాలం పూజలు అందుకోదు.

ఈ ఉదాహరణ చిత్రకళకు బాగా వర్తిస్తుంది. మనకు తెలుసు. గొప్ప కళాఖండాలకు తొలిరోజుల్లో ఎటువంటి గుర్తింపు లభించలేదు. అనేక సంవత్సరాలపాటు, అనేకమంది కళాప్రియులు వాటి విలక్షణతను లోకానికి

చాటిన తర్వాత మాత్రమే జనసామాన్యం కూడా వారి గొప్పతనం గుర్తించారు.

అంతేగాక, ఒక రచనకు గుర్తింపు రావటం రెండు అంశాల మీద ఆధారపడి వుంటుంది. ఒకటి రచన స్వభావం. అది పండితపామర రంజకంగా వుందా లేక నారికేళ పాకంలో వుందా అన్నది రెండవది. అది ఎంతమందికి నచ్చుతుంది? కొద్దిమందికా లేక అత్యధికులకా? ప్రస్తుతం మనం, జనాన్ని విపరీతంగా ఆకర్షించేవాళ్ళను (ఎవర్ని చూడటానికి జనం పోటీ పడతారో) పరిశీలిద్దాం. ఈ వరుసలో మొదట నిల్చేది వీధిలో ఫీట్లు చేస్తూ ప్రదర్శనలిచ్చేవాళ్ళు. ఆ తర్వాత సర్కస్‌వాళ్ళు, నర్తకీమణులు, గారడీవాళ్ళు, నటీనటులు, గాయకులు, సంగీతకారులు, కవులు, ఆర్కిటెక్టులు, చిత్రకారులు, శిల్పులు, చివరగా తత్త్వవేత్తలు.

తాము రాసేదీ, చెప్పేదీ వినోదం కాదు గనక, సహజంగానే తత్త్వవేత్తలు అతి తక్కువమందిని ఆకర్షిస్తారు. వీళ్ళ పని బోధించటం. సరదా కబుర్లు చెప్పటం కాదు. వీళ్ళను చదవటానికి ముందే పాఠకులకు ఈ విషయాల్లో కొంత ప్రాథమిక జ్ఞానముండాలి. అర్థం చేసుకోవటానికి కృషిచెయ్యాలి. సహజంగానే, సమాజంలో యిలాంటివాళ్ళ సంఖ్య బహు స్వల్పం. వీళ్ళ కీర్తి అన్ని వర్గాలకూ వ్యాపించే అవకాశం లేదుగానీ, వచ్చిన గుర్తింపు చాలా కాలం వుంటుంది. అంటే సర్వజనామోదం పొందిన వ్యక్తి, కీర్తి శిఖరాన ఎక్కువకాలం కొనసాగలేడు. అతి నెమ్మదిగా, కొద్దిమందిలో మాత్రమే గుర్తింపు తెచ్చుకున్న వాడి పేరు తరతరాలపాటు నిలిచివుంటుంది. ఇంచుమించు తత్త్వవేత్తల సరసనే చేరతారు కవులు, సంగీతకారులు. ఎందుకంటే ఒకసారి అచ్చయిన పుస్తకానికి మరణంలేదు. అయినప్పటికీ, ఈ విషయంలో తత్త్వవేత్తలతో మరెవరూ పోటీపడలేరు. ఎందుకంటే మిగతా రంగాలలోకన్న తత్త్వశాస్త్రంలో వచ్చిన పుస్తకాల సంఖ్య చాలా స్వల్పం. మరో కారణం సాహిత్యంకన్నా తత్త్వశాస్త్రాన్ని యితర భాషల్లోకి అనువదించటం సులభం. కొన్నిసార్లు ఒక తత్త్వవేత్త కీర్తి అతని రచనలకన్న ఎక్కువ కాలం నిలుస్తుంది. థేల్స్, ఎంపిడాకల్స్, హెరాక్లిటస్, డెమొక్రిటస్, పార్మెనైడ్స్, ఎపిక్యూరస్ (అందరూ గ్రీకు తత్త్వవేత్తలే) వగైరాలే యిందుకు నిదర్శనం.

ఇప్పటిదాకా నేను చేసిన వ్యాఖ్యలన్నీ భౌతిక అవసరాలు తీర్చే కృషి గురించి కాదు. నిత్య జీవితంలో మనకుపయుక్తంగా వుండవలసిన, లేదా మనకు ఆనందమిచ్చే పనులకు ఈ వ్యాఖ్యానం వర్తించదు. అలాంటి పనులను మనమెప్పుడూ గౌరవిస్తాం. నిజానికి అవి లేకుండా జీవితం గడవదు. గొప్ప వంటవాడు లేదా షెఫ్ అజ్ఞాతంగా వుండటం సాధ్యమా? తరతరాలుగా అలాంటివాళ్ళ గురించి చెప్పుకోవటం మనం వినలేదా!

అయితే కృత్రిమంగా కీర్తి గడించాలనుకునే పేరాశగాళ్లు కూడా వుంటారు. వీళ్ళ సంఖ్యే ఎక్కువ. ఉదాహరణకు, ఒక పుస్తకాన్ని మిత్రుల, భజన బృందాల సహాయంతో ఆకాశానికెత్తేస్తారు. దొంగ విమర్శలు, సమీక్షలు రాయిస్తారు. ఇలా అందరూ కూడబలుక్కుని తాత్కాలికంగా ఓ వెలుగు వెలుగుతారు. ఇలా జరిగాక కృత్రిమ పబ్లిసిటీతో జనం కూడా అదంతా నిజమని భ్రమిస్తారు. గాలి నింపిన ట్యూబు నీటిలో తేలినట్టుగా, కొన్నాళ్లు ఆ పుస్తకం అందరి దృష్టినీ ఆకర్షిస్తుంది. గాలి వున్నంతసేపూ (ఎంతసేపన్నది అందులో వున్న గాలినిబట్టి వుంటుంది) ట్యూబు తేలుతూనే వుంటుంది. కాని ఎప్పుడో ఒకప్పుడు గాలి పోకా తప్పదు. అది నీటిలో మునగకా తప్పదు. పబ్లిసిటీమీద ఆధారపడిన అన్ని పుస్తకాలకూ యిది వర్తిస్తుంది. పబ్లిసిటీ అంటే ట్యూబులో నింపిన గాలిలాంటిది. త్వరలోనే "యిది అంత కీర్తికి అర్హమైన పుస్తకం కాదం"టారు విజ్ఞులు. ఆ తర్వాత జాడ లేకుండా కనుమరుగవుతుందా గ్రంథరాజం. దానిపట్ల విముఖత కూడా పెరుగుతుంది. కాని పబ్లిసిటీమీద ఆధారపడక, ప్రతిభ అనబడే యిటుకలతో కట్టబడిన మంచి పుస్తకం రోజురోజుకూ ప్రాచుర్యం పెంచుకుంటుంది. శుక్ల పక్ష చంద్రునిలా దినదిన ప్రవర్ధమానమవుతుంది. ఏళ్లు గడుస్తున్నకొద్దీ దాని కీర్తి పెరుగుతుంది. గురుత్వాకర్షణ శక్తిని ధిక్కరించిన వస్తువులాగ, సాహిత్యాకాశంలో వెలుగులు విరజిమ్ముతూ విహరిస్తుంది. కాలాతీత రచన అంటే అదే.

### కీర్తిప్రతిష్ఠలు - 2

జీనియస్సులు - కవులు, తత్త్వవేత్తలు, కళాకారులు లేదా మరేదైనా రంగంలో కృషిచేసిన వారైనా గానీ వీరాధివీరులవంటివాళ్లు అశేష శత్రుసైన్యాలను ఒంటరిగా ఎదుర్కొంటారు. అంతిమ విజయం కూడా వారిదే.

ఒకరకంగా శాపగ్రస్తమైన మానవ జాతి విషాదం యిది. మూర్ఖత్వం, రోజువారీ సమస్యలే తప్ప మరి దేని గురించీ ఆలోచించలేని తనం, తక్షణానందం కోసం అర్రులు చాచటం, ప్రతి చిన్న విషయంలోనూ అసూయా ద్వేషాలతో రగిలిపోవటం, కోపతాపాలు – యివే కదా అత్యధికుల్ని, జన సామాన్యాన్ని పట్టి పీడిస్తున్న జాడ్యాలు. జీనియస్సుకు రావలసిన గుర్తింపుకూ, అతని ఎదుగుదలకూ కూడా యివే అతి పెద్ద అడ్డంకి. అతడు ఏ రంగంలో కృషి చెయ్యనీ తొలి దశలో ఈ శత్రుమూకల ముందు తలవంచక తప్పదు. నూటికో, కోటికో అందరిమీదా యుద్ధం ప్రకటించే యోధుడొక్కడుండకపోడు. కాని అతనికి గుర్తింపు నెమ్మదిగా, అతి నెమ్మదిగా, తరచూ ఒక జీవితకాలం లేటుగా వస్తుంది. వచ్చినా, మీడియోకర్ల కాకిగోలలో కొడిగట్టిన దీపంలా వెలుగుతుంది. జీనియస్సుల రచనలకు వక్రభాష్యాలు చెబుతారు లేదా పనిగట్టుకుని పలచనచేసి సమీక్షలు రాస్తారు. నీలాపనిందలు వేస్తారు. వ్యక్తి దూషణలకు పాల్పడతారు. అసలు అతడికే అర్హతలూ లేవంటారు. ఇలాంటి చవకబారు, నీచ దుష్ప్రచారానికి తాత్కాలికంగా జనం మోదం కూడా లభిస్తుంది. ఎవరైనా సద్విమర్శకు, తల్లికి (తండ్రి) చిత్తరువులు చూపి "కళ్లు లేవా? చూడలేవా?" అని అడిగిన హామ్లెట్ లాగ – ఒక రచయిత గొప్పదనాన్ని, విలక్షణతను వివరిస్తూ వ్యాసాలు రాయవచ్చునుగాక. కాని, జనానికి కళ్లుంటే గద చూడటానికి! ఒక గొప్ప కళాఖండం ముందర నిల్చున్న జనసంద్రోహాల్ని చూసినప్పుడు నాకు కోతిమూకలే గుర్తుకు వస్తాయి. వాటి చేష్టలు మనుషులను పోలివుంటాయి. అయినా అప్పుడప్పుడూ అవి తమ స్వాభావిక లక్షణాలను దాచుకోలేవు. తెలివి తక్కువతనమో, తిక్కవేషాలో అవి మనుషుల రూపంలో వున్న కోతులేనని గుర్తుచేస్తాయి.

కొన్నిసార్లు, "అతడు కాలంకన్నా ముందున్నాడు" అని కొందరికి కితాబిస్తుంటారు. అంటే, సమకాలీన మానవాళికన్నా ముందున్నాడా అతడు? అందరూ తన వెంటపడాలని జీనియస్ అనుకోకపోవటానికిదే కారణం. తాను అతి కొద్దిమందికే నచ్చుతానని అతడికి తెలుసు. జన బాహుళ్యం ఎలాగూ తనను విస్మరిస్తుంది. తరతరాలుగా యిలాగే జరుగుతోంది. అదృష్టం కలిసివస్తే తప్ప అతణ్ణి ఎవరూ సరిగా అర్థం చేసుకోరు లేదా అపార్థం చేసుకుంటారు. గుర్తింపు రావటానికి కాలం కలిసిరావటానికి జీవితకాలం సరిపోకపోవచ్చు. అలాంటప్పుడే "ఆయన కాలంకన్నా ముందున్నాడు'' అనీ, తమ అజ్ఞానాన్ని సమర్థించుకుంటారు జనం. అయితే వాళ్ళ ఉద్దేశం ''కాలంకన్నా'' అని కాదు. 'సమకాలీనులకన్న' అని మాత్రమే. అలా తమ లోపాన్ని 'కాలంమీదికి' మానవాళి నెట్టేస్తారు.

*అందువల్ల జీనియస్, తన కాలంకన్న ముందున్నాడంటే, అన్ని కాలాలకన్న ముందున్నట్టే. ఏదో ఒక కాలంలో తనను అర్థం చేసుకోగలిగినవాళ్ళు పుడితే తప్ప (సమకాలికులకే ఈ సామర్థ్యం వుంటే, అతడు అదృష్టవంతుడే!). హైందవ పురాణాలలో చెప్పినట్టుగా, విష్ణువు అవతార పురుషుడైతే, బ్రహ్మ ఆయన లీలలను గానం చేస్తాడు. అంటే, వాల్మీకి, వ్యాసుడు, కాళిదాసులు కూడా బ్రహ్మస్వరూపులే.*

అంటే, ప్రతి యుగంలోనూ, సమకాలికులు గుర్తించినా, గుర్తించకపోయినా అత్యద్భుతమైన కార్యాలు జరుగుతూనే వుంటాయి. అన్ని కాలాలలోనూ వుంటారు 'ఫిలోమన్, బాసిస్‌లు (ఓవిడ్ కావ్యం, మెటమార్ఫసిస్‌లో ఫిలోమన్, బాసిస్ దంపతుల కథ వుంది. దేవతలు ఒక వూరికి వచ్చినప్పుడు, వాళ్ళ దైవత్వాన్ని గుర్తించలేని గ్రామీణులు వాళ్ళను యిళ్ళలోకి కూడా రానివ్వరు. అప్పుడు ఆ దేవతలకు ఫిలోమన్ బాసిస్ దంపతులు మాత్రమే ఆతిథ్యమిస్తాను). "ఇతర్లు తన ప్రతిభను గుర్తించేదాకా నిరీక్షిస్తారు" అనుకోడు జీనియస్. అతని ప్రతిభ సహజసిద్ధం. పరిస్థితులు అనుకూలంగా లేకపోయినా, ప్రతికూలించినా, తన పని చేసుకుంటూనే పోతాడతడు. జీనియస్ అయినవాడు దూషణభూషణాలకతీతం. జనం తనను శ్లాఘిస్తారా, తిరస్కరిస్తారా అని ఎప్పుడూ ఆలోచించడు. తన తదనంతరమైనా గుర్తింపు రాకపోతుందా అన్న ధ్యాస కించిత్తు కూడా వుండదు.

అత్యున్నత స్థాయికి చెందిన రచనలకు ఈ చివరి వాక్యం వర్తిస్తుంది. అసలు యిలాంటి కృషిని అర్థం చేసుకోగలిగినవాళ్ళు, ఆనందించేవాళ్ళు అతి స్వల్పం అనుకున్నప్పుడు కీర్తి గురించి ఆలోచించటం అర్థరహితం కదా. అయితే, కవులు యింత క్లిష్టపరిస్థితిని ఎదుర్కోవలసిన అవసరం లేదు. ఎందుకంటే కవిత్వాన్ని ఆనందించేవాళ్ళ

సంఖ్య మరీ అంత తక్కువేం కాదు. సర్ వాల్టర్ స్కాట్‌ను చదవగలిగిన పాఠకుల సంఖ్య కొన్ని వందలకే పరిమితమైతే, అతడి గురించి ప్రత్యేకంగా ప్రస్తావించవలసిన అవసరమే వుండేది కాదు. "అతడు కాలంకన్నా ముందున్నాడు" అని కూడా వ్యాఖ్యానించేవాళ్ళు, కాని, కొన్ని వందల మంది అభిప్రాయమే ఆ తరానికి చెందిన అధిక సంఖ్యాకుల అభిప్రాయంగా చలామణి అయితే పరిస్థితి పూర్తిగా మారిపోతుంది. "ఇతడు అవినీతిపరుడు" అని ఒకణ్ణి కోర్టులో నిలబెడితే, అతడు "సమాజమే అవినీతిమయం" అని వాదించినట్టుగా!

*సాహిత్య చరిత్రను పరిశీలిస్తే, అంతర్దృష్టి, జ్ఞానతృష్ణ వున్నవాళ్ళ వునికినే ఎవరూ గుర్తించలేదనీ, భేషజంలో, స్వంత డబ్బా కొట్టుకొన్నవాళ్ళనే కీర్తిప్రతిష్ఠలు వరించాయనీ తెలుస్తుంది.*

ఒక రచయితను ఎంత తక్కువమంది చదివితే, అతడంత ప్రముఖుడు అంటారు. కాని, రకరకాల అడ్డదారులు తొక్కినకొద్దీ వందలమంది అనాయాసంగా, అతి తక్కువ కాలంలోనే "అగ్రశ్రేణి రచయిత"లైపోతారు. కాని, పబ్లిసిటీకి దూరంగా వుండే రచయితనెవరూ పట్టించుకోరు. లేదా అనేక సంవత్సరాల తర్వాత అతనికి ఏమాత్రమైనా కీర్తి వస్తుంది. మొదటిరకం రచయితలకు మిత్రులే పబ్లిసిటీ ఏజెంట్లుగా పనిచేస్తారు. చెత్తంతా ఒకచోట పేరుకుపోయినట్టుగా యిలాంటి వాళ్ళకెప్పుడూ కొదవుండదు. ఇక, రెండో రకం రచయితకు మిత్రులుండరు సరికదా, శత్రువులు అతడిమీద రాళ్ళు విసరటానికి సిద్ధంగా వుంటారు. మేథోపరంగా తమకన్న వున్నతుణ్ణి, జీనియస్‌ను చూస్తే ఎప్పుడైనా, ఎవరికైనా ద్వేషమే రెట్టింపవుతుంది తప్ప, అతణ్ణి యిష్టపడే అవకాశమే లేదు. ముఖ్యంగా మీడియోకర్, సెకండ్‌రేట్ రచయితలకు మేధావులను చూస్తే ఎక్కడ లేని అసూయ. నానా గడ్డి తిని తాము సమకూర్చుకున్న కీర్తిప్రతిష్ఠల్ని వాడెక్కడ తన్నుకుపోతాడోనని గజగజ వణికిపోతుంటారు.

*యూనివర్శిటీలలోని ఫిలాసఫీ ప్రొఫెసర్లు, యిది చదివి, వాళ్ళ గురించే నేను ప్రస్తావిస్తున్నాననుకుంటే, అది సత్యదూరమేమీ కాదు.*

చిరకాలం మనగలిగిన ఒక గొప్ప పనిని తలపెట్టినప్పుడు, సమకాలికుల అభిప్రాయాలను పరిగణనలోకి తీసుకోగూడదు. వాళ్ళ విమర్శలనూ, ప్రశంసలనూ పట్టించుకోనవసరంలేదు. అయితే ఒక అనర్ఘరత్నంలాంటి అపురూపమైన రచనకు మాత్రమే యిది వర్తిస్తుంది. అసలు, అలాంటి పని చేపట్టినవాడి జన్మ ధన్యం. ఇది నాలుగు కాలాలపాటు నిలిచే రచన గనక, సమకాలికులను సంప్రదిస్తే రచయిత ఆశయాన్ని వాళ్ళు సరిగ్గా అర్థం చేసుకొనే అవకాశం లేదు. పైగా తప్పుడు సలహాలతో పని పక్కదారి పడుతుంది. అంటే, ఈ క్రమంలో రచయిత, సమకాలీన ప్రభావానికి అతీతంగా వ్యవహరించాలి. తను, తన తరం కోసం యిది రాయటం లేదని కూడా స్పష్టంగా గ్రహించాలి. సమకాలికులను విస్మరించి, భవిష్యత్ తరాల కోసం కృషి కొనసాగించాలి.

ప్రపంచం అంతవరకు కనీ వినీ ఎరుగని ఒక కొత్త రచన జరిగిందంటే, అది తప్పనిసరిగా అసాధారణమైనదై వుంటుంది. జనం దీన్ని వీలైనంతకాలం తిరస్కరిస్తారు. కొత్త సత్యాన్ని ఆవిష్కరించిందని తెలిసినా అసలు దీని వునికినే నిరాకరిస్తారు. కాని ప్రభవించిన ఈ ఉత్కృష్ట గ్రంథం నెమ్మదిగా, అతి నెమ్మదిగా, ఒక్కొక్కరిగా, సమర్థకులను తనవైపు తిప్పుకుంటూనే వుంటుంది. నేలమీద పడ్డ ఆమ్లం లాగ చుట్టూవున్న నేలను కాల్చివేస్తుంది. అయితే పాత ఆలోచనాధోరణుల ఒత్తిడితో, నివురుగప్పిన నిప్పులా లోపలి పొరల్లో వెలుగుతూనే వుంటుంది. దగ్గరగా వెళ్ళినవాళ్ళకు వేడి కూడా తగులుతుంది. అలా ఒకనాడు మనస్సు తెరలను చీల్చుకొని, ప్రభవిస్తాడు నూతన సూర్యుడు. అన్నాళ్ళూ ముసుగు కప్పుకున్న విగ్రహం, అందరూ చూడటానికి అనువుగా ఆచ్ఛాదన తొలగించుకుంటుంది. అయితే ఈ ప్రక్రియ ఎంత నెమ్మదిగా జరుగుతుందో ఊహించటం కూడా కష్టమే. అంటే *మరణానంతరమే మహానుభావుల బోధనలను ఆలకిస్తుంది లోకం. సమాధి నుండి మాట్లాడుతుంది కొత్త గొంతుక.*

సాధారణ రచనల అదృష్టం యింతకన్న మెరుగే. సమకాలికులకోసం వుద్దేశించిందే గనక, దానికి రెడీమెడ్ పాఠకులంటారు. వాళ్ళ యిష్టాలకు, అభిరుచులకు అనుగుణంగానే వుంటుందా పుస్తకం. తక్షణం అవసరాలను తీరుస్తుందది. రచయిత కష్టానికి ఫలితం దక్కుతుంది. గుర్తింపేం ఖర్మ, కీర్తిప్రతిష్ఠలు అతణ్ణి వెదుక్కుంటూ వస్తాయి. పైగా యిలాంటి రచనల్ని చూసి ఎవరూ

అసూయపడరు. అందరూ అనుకరించగలిగిన పుస్తకమే గనక, ఇతర రచయితలు, ఔత్సాహికులు అలాంటిదే మరో పుస్తకం రాయటానికి ఉత్సాహం చూపిస్తారు.

కాని, కాలాతీతమైన మహాగ్రంథాలు ఈ క్షణిక సుఖాలకు నోచుకోవు. వాటి జీవితకాలం కొన్ని శతాబ్దాలు కావచ్చుగాక, కాని అవి తొలిసారి వెలుగు చూసినరోజున, తమ ఊహలకందనంత ఎత్తులో లేక దూరంలో వున్నాయి గనక ఎవరూ వాటి వునికిని కూడా గుర్తించరు. తమకోసం కాదనుకున్నప్పుడు ఎవరైనా ఆ పుస్తకాన్ని ఎందుకు ఆదరిస్తారు? సమకాలికులను అది ప్రభావితం చెయ్యదు. రాబోయే నూతన సంస్కృతికి టెక్స్టుబుక్ వంటిదా పుస్తకం. శుక్రుడు అందరికీ కనిపిస్తాడు. యురేనస్‌ను చూడగలిగినవాళ్ళెందరు? దానిగురించి తెలుసుకోవాలనే కోరిక కూడా వుండదెవరకీ. *జనసామాన్యమెపుడూ తమ నత్తనడక జీవితాలతోనే తృప్తిపడతారు. మట్టిలో మెలికలు తిరుగుతున్న వానపాము అనంతాకాశంలో వలయాలు సృష్టిస్తున్న డేగను చూడగలదా?*

ఏ కాలంలోగానీ, ఏ భాషలోగానీ, లక్షల్లో ఒక పుస్తకం మాత్రమే సాహిత్యంలో శాశ్వతంగా నిలిచిపోతుంది. కాని మిగతా 99,999 పుస్తకాలను పక్కకు నెట్టడానికి యిదెన్ని పరీక్షలు ఎదుర్కొంటుందో ఎవరైనా ఊహించగలరా? లక్షల్లో ఒకడికి మాత్రమే వున్న మేధస్సు సృష్టించినదది. దాన్ని పూర్తిగా అర్థం చేసుకోవాలన్నా అంత ప్రజ్ఞ వుండాలి మరి!

జీనియస్సు అనబడే వాడు కోటికొక్కడు అంటే అతడిది ఒంటరి జీవితమని ప్రత్యేకంగా చెప్పక్కర్లేదు. ముందుతరాలకు చేరటానికి అతడు ఎన్ని దుర్గమారణ్యాలు దాటాలి? ఎన్ని ఎడారులగుండా పయనించాలి? ఎన్ని తుఫానులనధిగమించాలి! అవును. ఇన్ని పరీక్షలు నెగ్గగలిగినవాళ్ళెంతమంది? ఇటువంటి సాహసికి నా సలహా ఒక్కటే. ఖాళీ చేతులతో ప్రయాణం చెయ్యి. బరువులు మోస్తానంటే అడుగు ముందుకు పడదు. లగేజీ లేనప్పుడే సుఖంగా నడుస్తావు. బాల్తజార్ గ్రేషియన్ మాటల్ని గుర్తుచేసుకో "పుస్తకాన్ని విస్తరించకు. సంక్షిప్తంగా వుంటేనే ముద్దు" (ఈ సలహా సమకాలీన జర్మన్ రచయితలకు బాగా వర్తిస్తుంది అంటాడు షోపెన్‌హావర్).

తాము ఈ లోకంలో గడిపిన స్వల్పకాలంలో అతి తక్కువ స్థలంలోనే హర్మ్యాలు నిర్మిస్తారీ అరుదైన రచయితలు. ఆ భవనం ముందు నిల్చుంటే దాని పరిమాణాన్ని ఎత్తును అంచనా గట్టలేం. అలాగే, జీనియస్‌ను దగ్గరగా చూస్తూ ఆయన గొప్పతనం గుర్తించలేం. ఓ శతాబ్దం గడవాలి. అప్పుడే ఆయనెవరో లోకం తెలుసుకుంటుంది. "అలాంటివాడు మళ్ళీ పుడితే ఎంత బావుండును" అనుకుంటుంది.

*నశ్వరమైన జీవితం గడిపిన ఒక వ్యక్తి అనశ్వరమైన సృష్టి చేసినప్పుడు, ఆ వ్యక్తి జీవితకాలం మరీ తక్కువ అనిపిస్తుంది. తల్లి పురిట్లో మరణించవచ్చు. కాని ఆమెకు పుట్టినవాడు మృత్యుంజయుడు. అమరజీవికీ అల్పజీవికీ ఎంత తేడా! ఒక క్షణం వినిపించే కరతాళ ధ్వనులకూ, శాశ్వత కీర్తికీ ఎంత తేడా! నీటి బుడగలాంటి జీవితంలో ఎవరెస్టు శిఖరమంత కృషి అనన్య సాధ్యంకదా! కన్న తండ్రి కూడా తన కన్న పేగు తరతరాలకు వెలుగు కాబోతున్నదని ఊహించలేదు. తన పుస్తకం ఎలా వుండబోతోందో రచయితకు మాత్రం ఏం తెలుసు. సంపన్నుల యింట్లో రోజూ పండగే. జీనియస్సు అనామకుడిగా బతికినా, శతాబ్దాల తర్వాత కూడా అతడి జ్ఞాపకమే ఒక పండగ.*

రచయితకు వెంటనే గుర్తింపు వచ్చిందంటే, అది అతడికీ అభిమానులకూ మధ్య వున్న భౌగోళికమైన దూరం మాత్రమే. జీవితానంతరం అతడి ప్రతిభకు పట్టంగట్టారంటే కాలం అతడికీ, అభిమానులకూ మధ్య వారధిగా నిలిచిందన్నమాట. నిజానికి జీవిత కాలంలో కీర్తి వచ్చినప్పుడు కూడా, రచయితకు తన అభిమానులతో ప్రత్యక్ష సంబంధాలుండవు. మరీ సన్నిహితంగా వున్న వ్యక్తుల మధ్య ఆరాధన సాధ్యపడదు. ఎండలో పెట్టిన వెన్న కరిగిపోతుంది. జీవితకాలంలో ఓ వ్యక్తి పేరు గడించాడంటే, అతని అభిమానుల్లో అత్యధికులు, అతడికి పట్టిన అదృష్టానికి అసూయ పడతాడు. "నక్కను తొక్కి వచ్చాడు" అంటారు. అతి కొద్దిమంది మాత్రమే అతడి ప్రతిభను గుర్తిస్తారు. "మహా కవులను ఒక్కసారి చూసినా సరే, జనం వాళ్ళ రచనల్ని తక్కువ అంచనా వేస్తారు" అన్నాడు ఇటాలియన్ రచయిత పెట్రార్క్ (1304–1374).

రచయిత కీర్తి గడించాలంటే అతడికీ, అభిమానులకూ మధ్య దూరముండాల్సిందే అని అంగీకరిస్తే, ఆ దూరాన్ని మైళ్ళలో కొలుస్తామా, సంవత్సరాల్లో కొలుస్తామా అన్నది అంత ముఖ్యం కాదు. పైగా రచయిత రాసిన అన్ని

పుస్తకాలకూ ఒకే రకమైన గుర్తింపు రాదు. పాఠకులకు కొన్ని నచ్చకపోవచ్చు. అయినా గొప్ప రచయితలు జీవితానంతరం కూడా ప్రజల నోళ్ళలో నానుతూనే వుంటారు. తనకు వచ్చిన ఒక ఆలోచన సార్వకాలీనమైనదని ప్రతిభావంతుడు తక్షణమే గుర్తిస్తాడు. అందువలననే, ఓ ప్రాచీన కావ్యం చదివిన వెంటనే ముగ్ధులమై "ఆ రచయిత తిరిగి వస్తే ఎంత బాగుండును" అనుకుంటాం. అతడితో మాట్లాడినట్టుగా ఊహించుకుంటాం. సమకాలీనుల మధ్య లభించని గుర్తింపు అతనికి మన ద్వారా లభించింది. 'రచయితలకు మరణం లేదు' అంటే అర్థం యిదే.

రాబోయే తరాలే ఒక పుస్తకం ప్రాధాన్యతను నిర్ణయిస్తాయి గాని, కొన్ని పుస్తకాలలో లోపాలున్నా, వాటిని ఖండించగల సామర్థ్యం లేకపోవటంవల్ల అవి గొప్ప పుస్తకాలుగానే చలామణీ అవుతున్నాయి. కనీసం రచయిత జీవితకాలంలో వాటినందరూ విస్మరిస్తారు. కాని యిది ఎంతోకాలం కొనసాగదు. అందులోని తప్పుల్ని ఎత్తిచూపేవాళ్ళు రాకపోరు. అప్పుడు వాటి ప్రాధాన్యతా తగ్గుతుంది అంటే ఒకే పుస్తకం, సమకాలికులకూ, ముందు తరాలవారికీ గొప్పది అనిపించటం అత్యంత అరుదైన విషయం.

అయితే కాలమహిమ గొప్పది. కొందరు మనుషులు కొన్నిసార్లు పొరబాట్లు చేయవచ్చు. తప్పుడు నిర్ణయాలు తీసుకోవచ్చు. మనుషులను పక్కదారి పట్టించవచ్చు. తమ వున్మాదాన్ని జనబాహుళ్యంమీద రుద్దవచ్చు. కాని, కళారంగంలోగానీ, వాస్తవ జీవితంలోగాని ఎవరెన్ని తప్పులు చేసినా అన్నీ కాలగర్భంలో కలసిపోతాయి. అనుభవంతో మనుషులు తమ లోపాలు తామే సరిదిద్దుకుంటారు. వాస్తవాలు కళ్ళముందు కనిపించినప్పుడు యిక వాటి గురించి వాదనలు అనవసరం. కాలం తన సహస్ర నాలికలతో ఏది సత్యమో బోధిస్తుంది. అయితే, తప్పు తెలుసుకోవటానికి ఎంత కాలం పడుతుందనేది, అన్నిటికీ ఒకేలా వర్తించదు. దాని గురించిన ఊహాగానాలవల్లా ప్రయోజనం వుండదు. ఆచరణలో సిద్ధాంతాలు తప్పని నిరూపించబడతాయి. అంటే, కొందరు గొంతు చించుకొని ప్రచారం చేసినంతమాత్రాన అబద్ధం నిజం కాదు. *ఒకనాడు మేధావులు మాత్రమే అవగాహన చేసుకోగలిగిన విషయాలను, తరువాతి కాలంలో సగటు మనిషి కూడా సులభంగా అర్థం చేసుకోగలడు.*

ఒకప్పుడు జనాన్ని గంగవెర్రులెత్తించిన విషయాలు యిప్పుడు కనుమరుగు కావటం చూస్తే, కొంత సాంత్వన కలుగుతుంది. ప్రచారార్భాటాలు ప్రజల కళ్ళకు శాశ్వతంగా గంతలు కట్టలేవు. కొన్నిసార్లు కొన్ని విషయాలు రెండుమూడేళ్ళపాటే వెర్రితలలు వేస్తాయి. మరికొన్ని మనం జీవితమంతా భరించక తప్పదు. అయిన అవి కూడా మారతాయని గ్రహించాలి.

*కాలంతో కలిసి ప్రవహించలేకపోవటం రెండు రకాలు. ఒకటి : నీళ్ళు అంటకుండా గట్టుమీద వుండటం. రెండు : అట్టడుగున నక్కి వుండటం.*



తెలుగు సేత :
ముక్తవరం పార్థసారథి
హైదరాబాదు.
ఫోన్ : 9177618708



# హంపీ నుంచి హరప్పా దాక

## డా॥ తిరుమల రామచంద్ర స్వీయచరిత్ర

**– రావినూతల సత్యనారాయణ**

**ప్రవేశిక :**

తెలుగులో కందుకూరి వీరేశలింగం గారి స్వీయచరిత్ర తర్వాత చిలకమర్తి లక్ష్మీనరసింహం గారు, రాయసం వెంకటశివుడు, వల్లూరి సూర్యనారాయణ గారి స్వీయచరిత్రలు పేర్కొన దగినవి. అలాగే అలనాటి స్వాతంత్ర్య సమర యోధులు చాలామంది స్వీయ చరిత్రల్ని వ్రాసుకొన్నారు. అటువంటి వారిలో కొండా వెంకటప్పయ్య పంతులు గారి స్వీయచరిత్ర, ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులు గారి నా *జీవితయాత్ర,* అయ్యదేవర కాళేశ్వరరావు గారి *నా జీవితం నవ్యాంధ్రం*, దర్శి చెంచయ్య గారి *నేను నా దేశం*, ఉల్లేఖనీయమైన రచనలుగా పేర్కొన వచ్చును.

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత స్వీయచరిత్రలు వ్రాసుకున్న వారిలో డా॥ గిడుగు సీతాపతి గారి *సంక్షిప్త స్వీయచరిత్ర,* వేటూరి ప్రభాకరశాస్త్రి గారి *ప్రజ్ఞాప్రభాకరం*, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారి *అనుభవాలూ జ్ఞాపకాలూ*, కోలవెన్ను వారి *జీవితానుభవం*, చలం గారి *ఆత్మకథ*, శ్రీశ్రీ *అనంతం*, బుచ్చిబాబు *అంతరంగ మథనం*, ఆచంట జానకిరాం *నా స్మృతి పథంలో*, *సాగుతున్న యాత్ర*, సంజీవదేవ్ గారి *స్మృతి బింబాలు*, నటరాజ రామకృష్ణ *నర్తనవాణి*, డా॥ గడియారం రామకృష్ణశర్మ గారి *శతపత్రము*, డా॥ తిరుమల రామచంద్ర గారి *హంపీ నుంచి హరప్పా దాక* మొదలైనవి చరిత్రాత్మక స్వీయచరిత్రలుగా పేర్కొన దగినవి. ముఖ్యముగా గమనించ దగిన విషయ మేమిటంటే, స్వీయచరిత్రలూ, ఆత్మకథలూ వ్యక్తిత్వంగల వాళ్ళ విషయా లైనప్పుడే, వాటిని లోకం ఆదరిస్తుంది, హర్షిస్తుంది.

"20వ శతాబ్దపు తెలుగు సాహిత్య సమీక్షలో, చరిత్రలో, అధ్యయనంలో ఒక పది, పదిహేను మంది ప్రముఖులను ఎంపిక చేయ వలసి వస్తే, కనీసం, ఇంకా రెండు మూడు శతాబ్దాల వరకైనా నిలిచే వారిని తలుచుకో వలసి వస్తే వారిలో తిరుమల రామచంద్ర గారు నిస్సందేహంగా ఒకరు" అంటారు అక్కిరాజు రమాపతి రావు.

రచయిత, సంపాదకుడు, స్వాతంత్ర్య సమరయోధుడు, భాషావేత్త అయిన తిరుమల రామచంద్ర మాతృభాష తెలుగుతో పాటు, కన్నడ, తమిళ, సంస్కృత, పాకృతాది భాషల్లో ప్రావీణ్యం కలిగిన వారు. రకరకాల వృత్తులు చేసి, వివిధ అనుభవాలు గడించిన విస్తృత లోకానుభవ శీలి! "సమృద్ధి నమ్రత వహించు" అనే భర్తృహరి భావుకతకు మూర్తీభావం తిరుమల రామచంద్ర గారు. హంపీ నుంచి హరప్పా దాక ఒక గొప్ప ఆధునిక కావ్యం, ఇతిహాసం. భారతీయ సంస్కృతి లోని మేలిమిని సాక్షాత్కరింప జేస్తున్న సుందర రచన. ఇది ఒక నవల కన్నా వేగంగా, ఆకర్షంగా, ఉత్తేజ భరితంగా చదివిస్తుంది. కేంద్ర సాహిత్య అకాడమీ వారి 2002వ సంవత్సరపు జాతీయ పురస్కారానికి ఎంపికైన ఉత్తమ రచన ఇది.

*హంపీ నుంచి హరప్పా దాక* రచనను గురించి ముచ్చటిస్తూ "నేను సామాన్య మానవుణ్ని. కాని, నాలో వైచిత్ర్యం, వైవిధ్యం వున్నమాట నిజం. కొందరు నాలోని వైవిధ్యాల కన్నా వైరుధ్యాలు చూసి ముచ్చటపడి, నా



హంపి : రాతి రథం

జీవితంలోని కొన్ని సంఘటనలు వ్రాయమన్నారు. కొందరు మారాం చేశారు! మిత్రులు జొన్నలగడ్డ లక్ష్మీనారాయణ గారు రెండు మూడు నాళ్లు నాతో ఉండి, చిన్ననాటి సంఘటనలు ప్రశ్నిస్తూ, గుర్తు వచ్చేటట్టు చేస్తూ, చెప్పినవి చెప్పినట్టు కాయితం పై వ్రాసన్తూ, వివరంగా వ్రాయాలని ప్రోత్సహించారు. అలాగే, మిత్రులు డా॥ అక్కిరాజు రమాపతి రావు గారు నా జీవితంలోని సంఘటనలు ఉదంతాలుగా వ్రాయండని బలవంత పెట్టారు. అరవైయొక్క వారాల పాటు ఈ ఉదంతాలను ప్రచురించారు సంపాదకులు. నా రచనలు చదివి హర్షించింది పాఠకలోకం. మిత్రులు పొగడ్తలతో ముంచెత్తారు! ఆ రచనల సందోహమే ఈ హంపీ నుంచి హరప్పా దాక. ఇదొక దేశదిమ్మరి అనుభవ విశేషంగా, సత్యాన్వేషి కథనంగా, జిజ్ఞాసువు ఆవేదనగా పాఠకుల మనసుకు దగ్గరవుతుందని నా విశ్వాసం." అంటారు తిరుమల గారు.

అయితే, హంపీ నుంచి హరప్పా దాక పుస్తకం తొలి ముద్రణ రామచంద్ర గారు పరమపదించిన రెండు నెలల తర్వాత ప్రచురింప బడింది. ఇది చాలా శోచనీయం. ఈ పుస్తకానికి ముందుమాట డా॥ అక్కిరాజు రమాపతి రావు వ్రాశారు. జి.వి. అమరేశ్వర రావు దీనిలోని రేఖా చిత్రాలను వేశారు. చిత్రాలు సందర్భ సూచకంగాను, ఆకర్షణీయం గాను ఉన్నాయి. కేంద్ర సాహిత్య అకాడమీ వారి జాతీయ పురస్కారానికి ఎంపికైన అత్యుత్తమ రచన హంపీ నుంచి హరప్పా దాక.

ప్రస్తుత వ్యాసం శ్రీ తిరుమల రామచంద్ర గారి బహుముఖ ప్రజ్ఞాపాటవాలను గురించి స్థూలంగా చర్చిస్తూ, వారి రచనా వ్యాసంగాన్ని కూడా చర్చిస్తుంది. ఈ నా ప్రయత్నాన్ని విజ్ఞులైన పాఠకులు హర్షిస్తారని, ఈ వ్యాసం చదివిన తరువాత మూలగ్రంథమైన హంపీ నుంచి హరప్పా దాక వైపు ఆకర్షితు లౌతారని ఆశిద్దాం!

స్వీయచరిత్ర రామచంద్ర గారి ఆఖరి రచన. వారు తమ రచనా ప్రస్థానాన్ని గురించి ప్రస్తావిస్తూ "నేను 13వ యేటనుండి 69 సంవత్సరాలు రచయితగా, 1944 నుంచి 51 సంవత్సరాలు పత్రికా రచయితగా వున్నాను . . . నేను వ్రాసిన ప్రతి వ్యాసానికి, ప్రతి పుస్తకానికీ, ప్రతి సంస్కృత గేయానికీ, ప్రేరణ అననుకాని, కారణం వుంది. ప్రేరణ మానసిక భావజనిత ప్రోత్సాహం. కారణం వృత్తిరీత్యా ఆవశ్యకత" అంటారు. "నా సంస్కృత రచన శృంగారం అంటే ఏమీతెలియని 13వ యేట, కావ్యాల్లో చదువుకున్న శృంగారం ఆధారంగా సాగింది. మానవల్లి రామకృష్ణ కవిగారి మందలింపు నా బుద్ధిని దేశభక్తి గీతాలవైపు మరలించింది." రామచంద్ర గారు వారి దీర్ఘసాహిత్య ప్రస్థాన కాలంలో అనేక రచనలు చేశారు. ఆయనకు ఎనలేని కీర్తిని ఆర్జించి పెట్టిన కొన్ని పుస్తకాలు ఇచ్చట స్థూలంగా చర్చించుట సందర్భోచితమని భావిస్తాను.

**హిందువుల పండుగలు – పర్వములు :**

సురవరం ప్రతాపరెడ్డి గారు తెలుగు పండుగలను గురించి ఒక పుస్తకం వ్రాశారు. దానిలో లేని విషయాలు పరిశోధించి, ఒక మంచి పుస్తకం వ్రాయమని బాలసరస్వతీ బుక్ డిపో వారు అభ్యర్థించగా, వ్రాసిన పుస్తకమిది. ఈ గ్రంథం ధర్మశాస్త్ర, జ్యోతిష, ఆయుర్వేద, సాంఘిక, భాషాశాస్త్రాల దృష్టితో వ్రాయబడినది. ఇది విశ్వనాథ, రాళ్లపల్లి, బూర్గులవంటి పలు పెద్దల మన్ననలందుకొనినది.

**మన లిపి పుట్టు పూర్వోత్తరాలు :**

రామచంద్ర గారు అనేక లైబ్రరీలు శోధించి అతిముఖ్య మైన సమాచారం, అపూర్వమైన చిత్రాలు, ఫోటోలు సేకరించి, పైన పేర్కోనిన పుస్తకాన్ని రచించారు. భారతీయ లిపులపై ఇలాంటి పుస్తకం అంతకు ముందు కాలంలో వెలువడ లేదు. మన లిపి పుట్టు పూర్వోత్తరాలు మల్లంపల్లి సోమశేఖర శర్మ గారికి అంకిత మీయబడినది. దీనికి పరిచయ వాక్యాలు ఆంధ్రవిశారద తాపీ ధర్మారావు గారు వ్రాశారు. ఈ రచనలో పాళీ నుండి సాగిన లిపి ప్రస్థానం ప్రస్తుత లిపి పరిణామం వరకు, ఎంతో అద్భుతంగా వివరించబడింది. ఈ పుస్తకం రామచంద్ర గారికి ఎనలేని కీర్తి ప్రతిష్టలు ఆర్జించినది. లిపిని గురించి తెలుసుకో దలచిన వారందరూ తప్పక చదువ వలసిన గ్రంథమిది. గ్రంథ రచన సొంతం వ్యవహార భాషలో సాగింది సులభ శైలిలో.

**సాహితీ సుగతుని స్వగతం :**

ఈ రచనలకు కారణం తెలియజేస్తూ తిరుమల గారు "నేను భారతి మానపత్రికలో పని చేస్తున్నప్పుడు, శంభుప్రసాదు గారు ఏవో సందేహాలు తెల్పుతూ, వ్యాసం వ్రాయ మనేవారు . . . సుగతుని స్వగతం అనే శీర్షిక భారతి లో ప్రారంభించి మౌలిక వ్యాసాలెన్నో వ్రాశాను. . . ఆ వ్యాస సంపుటికి సాహితి తగిలించి సాహితీ సుగతుని

స్వగతం అని శీర్షిక పెట్టాను". ఇందులో అద్భుతమైన వ్యాసాలున్నాయి. ఈ వ్యాస సంకలనానికి రాష్ట్ర సాహిత్య అకాడమీ ఉత్తమ సాహిత్య విమర్శ పురస్కారం (1970) లభించింది.

**గాథాసప్తశతిలో తెలుగు పదాలు :**

మల్లంపల్లి సోమశేఖర శర్మ లాంటి పలువురు చరిత్రకారులు గాథాశప్తశతిలో తెలుగు పదాలు ఉన్నాయని అనడమే కాని, ఆ పదాలు ఏవేవో వివరించి తెలుప లేదు. ఈ విషయమై మద్రాసు విశ్వవిద్యాలయం కన్నడ ప్రొఫెసర్ మరియప్ప భట్ గారు ఒక వ్యాసం *"Some Kannada Words in Hala Saptasati"* వ్రాశారు. అందులో కొన్ని కన్నడ పదాలను మాత్రమే ఉల్లేఖించారు. అటుతర్వాత, రామచంద్ర గారు భారతి మాసపత్రికలో గాథాసప్తశతిలో తెలుగు పదాలు అనే పరిశోధనాత్మక వ్యాసం రచించారు. ఆ వ్యాసాన్ని చాలామంది చరిత్ర కారులు, భాషావేత్తలు మెచ్చుకొని ప్రశంశలు గుప్పించారు. ఆ వ్యాసం, గాథాసప్తశతిలోని విశేషాలతో వ్రాసిన మరికొన్ని రచనలతో కలిపి, ప్రాకృత అకాడమీ వారు పుస్తక రూపంలో ప్రచురించారు. ఆ పుస్తకానికి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సాహిత్య అకాడమీ సాహిత్య విమర్శ పురస్కారం (1980) లభించింది. ఈ పుస్తకం రామచంద్ర గారికి గొప్పపేరు గడించింది. పలువురు చరిత్రకారులు, పండితులు ఎంతగానో ప్రశంసించారు.

**నుడి – నానుడి :**

తిరుమల రామచంద్ర గారు మద్రాసులోని కన్నెమరా లైబ్రరీలో "వాట్స్ డిక్షనరీ ఆఫ్ కమర్షియల్ ప్రొడక్ట్స్ ఆఫ్ ఇండియా, బర్మా అండ్ సిలన్" అనే పుస్తకం పరిశీలించుట తటస్థించినది. దానిలో ప్రతి పదం పుట్టు పూర్వోత్తరాలు అద్భుతంగా, ప్రామాణికంగా చర్చితాలు. ఆ గ్రంథం రామచంద్ర గారికి ఎంతో నచ్చింది. అలాంటిది తెలుగులో మేలని వారికి తోచింది. అలాగే "హెడ్జిహాగ్ అండ్ అదర్ సేయింగ్స్" అనే పుస్తకం ప్రతి నానుడికీ బొమ్మలతో కూడినది, చూచుట జరిగింది. ఇంతలో ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక ప్రారంభమైనది. దానిలో రామచంద్ర గారు నుడి – నానుడి శీర్షికతో పదాల, సామెతల, నుడికారాల చర్చ ఒక సంవత్సరం పాటు నిర్వహించారు. ఆ సమాచారమంతా సేకరించి విశాలాంధ్రవారు నుడి – నానుడి పుస్తక రూపంలో ప్రచురించారు. ఈ పుస్తకం తెలుగు నుడికారములను గురించి తెలుసుకొన దలచిన వారికి కరదీపికగా ఉపయోగిస్తుంది.

**పాకృత సాహిత్యంలో రామకథ :**

శ్రీ సత్యసాయిబాబా గారు 1975 లో బెంగుళూరు కేంద్రం వైట్ ఫీల్డ్ ఆశ్రమంలో రామాయణ సదస్సు ఏర్పాటు చేశారు. దానికి దేశ విదేశాల నుండి వివిధ భాషల విద్వాంసులు హాజరై తమతమ ప్రాంతాల రామాయణ కథలను గురించి పరిశోధనాత్మక వ్యాసాలు చదివారు. శ్రీ సత్యసాయిబాబా గారు తిరుమల రామచంద్ర గారిని పాకృత సాహిత్యంలో రామ కథను గురించి ప్రసంగించ మని కోరారు. రామచంద్ర గారు తెలుగులో పరిశోధనాత్మక వ్యాసం రచించి దాని ఆంగ్లానువాదం ఆ సదస్సుకు పంపించారు. ఆ వ్యాస రచనకై రామచంద్ర గారు జైన భౌద్ధాది రామయణాలు అధ్యయనం చేయడం జరిగింది. రామచంద్ర గారు వ్రాసిన వ్యాసం (తెలుగు) భారతిలో వరుసగా ప్రచురిత మైనది. ఆ వ్యాస శీర్షిక ప్రాకృత సాహిత్యంలో రామకథ. అదే తర్వాత కాలంలో పుస్తక రూపంలో అచ్చైంది.

**మరపురాని మనీషి :**

పలువురు ప్రముఖ వ్యక్తులను (ఫోటోగ్రాఫరు నీలంరాజు మురళీధర్ తో కలిసి) చూచి, వారిని ఇంటర్వ్యూ చేసి, కొత్త పద్ధతిలో వ్రాసిన వ్యాస సంకలనమిది. తిరుమల రామచంద్ర గారు ఆంధ్రప్రభ వారపత్రికలో పనిచేయుచున్న కాలంలో మరపురాని మనీషి శీర్షిక క్రింద వ్రాసిన వ్యాసాల సంకలనమిది. ఈ పుస్తకం తిరుమల రామచంద్ర వారి మిత్రులు కప్పగంతుల లక్ష్మణశాస్త్రి గారికి అంకిత మిచ్చారు. పై పుస్తకంవల్ల వారికి అత్యంత కీర్తి లభించింది. ఆంధ్రప్రభ వారపత్రిక పాఠకులను ఆకర్షించిన, చదివించిన శీర్షికలలో ఇది చాలా ప్రసిద్ధి చెందినది. ఈ విధంగా రామచంద్ర గారి రచనలను గూర్చి వ్రాయాలంటే అదే ఒక పెద్ద గ్రంథంగా తయారౌతుంది. అది ప్రస్తుత వ్యాస లక్ష్యం కాదు. అందువలన, ఆ ప్రయత్నం మానెయ్యడ మైనది. తిరుమల గారు స్వీయ రచనలే గాక, కన్నడం నుండి 12 నవలలు, కథా సంకలనాలు, వ్యాస సంకలనాలు అనువదించారు. ఆంగ్లం నుండి 30 పుస్తకాలు అనువదించారు. పైన పేర్కొన్న రచనలు వారెంతటి విద్వాంసులో తెలియ జేస్తాయి.

**హంపీనుంచి హరప్పా దాక :**

అసలు ఈ వ్యాసానికి ప్రధానాంశం తిరుమల రామచంద్ర గారి స్వీయచరిత్ర హంపీనుంచి హరప్పా దాక. ఈ గ్రంథంలో అరవై ఒక్క అధ్యాయాలున్నాయి. ఒక్కొక్క అధ్యాయం ఒక్కొక్క ఉదంతాన్ని (సంఘటనను) కథగా చదివిస్తాయి. స్వవిషయాలను ఇంతటి సృజనాత్మక భావుకతతో, ప్రతిభతో వెల్లడించుట రామచంద్ర గారివంటి ఉపజ్ఞా ప్రాభవులకు మాత్రమే సాధ్యమేమో! ఇంత ఆత్మ నివేదనా ప్రణవంగా మరే స్వీయచరిత్ర రాలేదేమో అనుట సాహసం కాదేమో?! ఈ గ్రంథాన్ని కేంద్ర సాహిత్య అకాడమీ వారు తమ జాతీయ పురస్కారానికి ఎంపికజేయుట అత్యంత సముచితం. తిరుమలగారు తమను గూర్చిన అభివర్ణనలో పేర్కొనిన విధానం గమనించండి: "ఆగర్భ శ్రీమంతుడు, ఆగర్భ దరిద్రుడూ, అనునవి అందరికి తెలిసిన తెలుగు నానుడులు. నేను చాలా విషయాలలో ఆగర్భ అదృష్టవంతుడిని. భగవద్భక్తి, దేశభక్తి పొంగిపొర్లే వంశంలో పుట్టడం నా మొదటి అదృష్టం. తాము ఏకాలము వారైనా విద్యార్థులను మానవత్వంతో పుత్ర నిర్విశేషంగా ప్రేమించే ఉపాధ్యాయులవద్ద చిన్ననాడు


హంపి - వేసవి విడిది

చదువు కొనడం నా రెండవ అదృష్టం. కౌమార దశలో ఆదర్శప్రాయులైన మహనీయుల పరిచయంతో జ్ఞానార్జనకు అవకాశం కలగడం నామూడవ అదృష్టం. పెద్దవాడి నైన తర్వాత నా మనసైన ధర్మపత్ని లభించటం, సత్సంతానం కలగడం నా నాలుగవ అదృష్టం. మంచి మిత్రులుండటం నా ఐదవ అదృష్టం. ఇన్ని అదృష్టాలు వరించిన నేను గొప్పవాడు కావలసింది. నన్ను ప్రేమించిన వారంతా నేనొక మహాపురుషుడ నౌతాననే భావించారు . . . కాని, అస్థిరత అనే నా దురదృష్టం నా అదృష్టాలన్నింటినీ దిగమింగి నన్నొక తెగిన గాలిపటం చేసింది . . ."

ఈ స్వీయచరిత్రను సూక్ష్మంగా పరిశీలిస్తే, రామచంద్రగారు తన జీవిత చరిత్రను కాలానుక్రమంగా వ్రాయలేదు. జరిగిన ఉదంతాలన్నీ వివరణాత్మకంగా విశ్లేషించారు. ఘటనలన్నీ దేనికది వివిధ సమయాల్లో జరిగినప్పటికీ, పఠితల ఆసక్తి కుంటుబడకుండా చదివింప జేస్తుందీ పుస్తకం. చిన్నచిన్న అధ్యాయాలలో ఎన్నో అందమైన విషయాలు నవరస భరితమైన చక్కని వచనంలో మనస్సుకు హత్తుకునే విధంగా చెప్పారు రచయిత. సందర్భాన్ని అనుసరించి ఒక్కొక్క అధ్యాయంలో శ్లోకాలు ఉల్లేఖించుటయే గాక ఆయా శ్లోకాలకు చక్కని లఘువ్యాఖ్యలు పొందు పరచారు. అందువలన ప్రతి శ్లోకమూ పఠితలను మళ్లీ మళ్లీ చదివిస్తుంది. మిగతా వచనంతో కలిసి పాఠకుడిని ఎంతో తమకంతో చదివిస్తుంది. వారు ప్రస్తావించిన వృత్తాంతాలు ఎంతో రోచకంగా వున్నాయి. స్వీయచరిత్రలో ఉల్లేఖింప బడిన ఘటనల ద్వారా మనకు స్ఫురించే రామచంద్రగారి స్వీయచరిత్రను పరిశీలిద్దాం.

**బాల్యం, విద్యాభ్యాసం :**

తిరుమల రామచంద్ర గారు అనంతపురం జిల్లా, ధర్మవరం తాలుకా రాగవంపల్లె, మాతామహులు ఇంట్లో 1913 జూన్ 17న జన్మించారు. శ్రీమతి జానకమ్మ, శ్రీ శేషాచార్యులు వారి తల్లి తండ్రులు. వీరి పూర్వీకులు విజయనగర సామ్రాజ్య రాజగురువైన తాతాచార్యుల వంశీయులు. రామచంద్ర గారి బాల్యం హంపీ శిధిలాలలోని గ్రామమైన కమలాపురంలో గడిచింది. రామచంద్ర గారికి వారి మేనమామ మూడవ సంవత్సరంలోనే అక్షరాభ్యాసం చేయించారు. ఆయనకు ఏడోఏడు రాగానే వీధిబడిలో వేశారు. ఆ బడిలో కొద్దికాలం మాత్రమే చదివారు. తర్వాత కమలాపురంలోని ఎలిమెంటరీ స్కూల్లో చేరారు. చిన్ననాటి వింతవింత ఉదంతాలు పులికథ, పాములతో సహవాసం, మొదలైనవి ఆరు, తొమ్మిది అధ్యాయాలలో చక్కగా వెల్లడి చేశారు. అవి యెంతో ఆహ్లాద కరమైన విషయాలు. ఆ సమయంలోనే జరిగిన మరో ముఖ్య సంఘటన రామచంద్ర గారు వారి తాతగారితో బళ్ళారి వెళ్ళి అచ్చట గాంధీ గారిని సందర్శించుట. అప్పుడు రామచంద్ర గారి వయసు 8 సంవత్సరములు. ఈ విషయాన్ని గురించిన వివరాలు 14వ అధ్యాయంలో విశదంగా పేర్కొన్నారు. రామచంద్ర గారు

ఎనిమిదవ ఏట నాలుగో తరగతి ముగించారు. తర్వాత కొంతకాలం ఇంగ్లీషు చదివారు. కొంతకాలం పాటు శేషాచార్యుల గారి శుశ్రూషల లో సంస్కృతం అభ్యసించారు. కాని, ఆయన క్రమశిక్షణ విధానం భరించ జాలక భయంతో ఆయన దగ్గర చదువు మానివేశారు. రామచంద్ర గారు ఆనేగొంది గ్రామంలో సంస్కృత చదువు మానేసి తిరుపతిలో చదవాలన్న వాంఛ ప్రభలంగా ఏర్పడటానికి కారణం శ్రీ వెంకటాచార్యుల వారి హితబోధ. ఈ విషయాన్ని రామచంద్ర గారు తన తల్లికి నచ్చ చెప్పి, ఆమె ద్వారా తాతగారిని ఒప్పించే ఏర్పాటు చేసుకొన్నారు. ఎట్టకేలకు తిరుపతి వెళ్లడం నిశ్చయమైంది. రామచంద్ర గారి తాతగారు ఆయన వెంట వెళ్ళారు. 24 డిశెంబరు 1924న తిరుపతి చేరారు. అప్పుడు తిరుపతి కళాశాల ప్రిన్సిపాలు సేలం సుబ్బారావు గారు రామచంద్ర తాతయ్యగారికి తెలిసిన వారయినందున, కళాశాలలో ప్రవేశము సులభంగానే జరిగింది. రామచంద్ర గారు తిరుపతి కళాశాలలో ప్రవేశం తీసుకునే నాటికి వారి వయస్సు పదకొండేళ్లు. తిరుపతి సంస్కృత కళాశాలలో రామచంద్ర గారు దాదాపు ఎనిమిదేళ్ళు చదివారు. తిరుపతిలో విద్యార్థిగా ఉన్నప్పుడు రామచంద్ర గారు వివిధ విషయాలపై దాదాపు వంద సంస్కృత వ్యాసాలు వ్రాశారు. అవి తరువాత విద్యార్థులకు ఒరవడి అయ్యాయి! ఆ రచనలలోని ప్రధాన గుణం చిన్నచిన్న పదాలతో వాక్య రచన, సరళత. ఆ రోజులలో తిరుపతి దేవస్థానం విద్యాశాఖాధికారి శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు. వారికి ఏదో పనిలో సహకరించుటకు దేవనాగరీ దస్తూరి బాగా వ్రాయ గలిగిన మనిషి అవసర మయ్యాడు. ఆ విషయం మానవల్లి గారు ఎవరితోనో సంప్రదించారట. ఆ విషయం తెలుసుకొన్న తిరుమల రామచంద్ర గారు తను సంస్కృత శ్లోకాలు రచించి వ్రాసుకున్న నోటు బుక్కుతోపాటు రామకృష్ణ కవిగారి దగ్గరికి వెళ్ళారు. మానవల్లి గారు అందరినీ తారతమ్యం లేకుండా అయ్యా అని సంబోధించి చక్కగా మాట్లాడే వారుట. రామచంద్ర గారిని ఆప్యాయంతో పలుకరించి, ఆయన నోటుబుక్కు లోని కవిత చదివారుట!

**ఆ కవిత :**

*రచయంతీ రంగలతాం / మంగళగాత్రీ, సలీలం అంగణకే,*
*విటజన హృదయాంగణకే / అనంగజ బాధాం విశాలయతి కునూనమ్*

అది చదివిన మానవల్లి కవిగారు రామచంద్ర గారిని "నీ వయస్సెంతయ్యా?" అని అడిగారట! "పదమూడండీ" అన్నారట రామచంద్ర. "నీ కవిత బాగుంది కాని, ఈ వయస్సులో శృంగార మెందుకయ్యా నీకు? పాఠ్యపుస్తకాలు కాక, తక్కిన కావ్యాలు చదువు . . . సందేహాలు నన్నడుగు" అన్నారట!

**వ్యష్టి సత్యాగ్రహం – జైలుశిక్ష :**

గాంధీజీ – ఇర్విన్ సంధి విఫల మైన తర్వాత దేశమంతా వ్యష్టి సత్యాగ్రహం జరిగింది. శ్రీ తిరుమల గారు 1932 ప్రారంభములో సత్యాగ్రహం చేసి శిక్షితుడయ్యారు. చంద్రగిరి మేజిస్ట్రేటు కోర్టులో ఆయనకు శిక్ష విధించ బడినది. ఆయన రాయవెల్లూరు, తిరుచురాపల్లి జెయిళ్ళలో శిక్ష అనుభవించారు. తిరుచురాపల్లి జైలులో ఉన్నప్పుడు రామచంద్ర గార్కి ఆంధ్ర, తమిళ, కర్నాటక, కేరళ, హింది, వంగాది ప్రాంతాల వారితో పరిచయం కలిగింది. వారిలో చాలామంది తర్వాత కాలంలో మంత్రులు, ఎమ్.ఎల్.ఏ లు, కాంగ్రెసు పార్టీ ప్రముఖులు అయ్యారు. అక్కడ సురేంద్ర మోహన్ ఘోష్, ప్రతూల్ చంద్ర గంగులీ అనే డెటిన్యూలు, భగత్ సింగ్ కేసులో యావజ్జీవ కారాగార శిక్ష పడిన బట్ కేశ్వర్ లాంటి వారు ఉండేవారు. రామచంద్ర గారు రవీంద్రుని కొన్ని గీతాలు సంస్కృతీక రించారు. శిక్షానంతరం రామచంద్ర గారు సాహిత్య శిరోమణి కోర్సు పూర్తి జేయుటకు తిరుపతి వెళ్ళారు. కాని, తిరుపతి సంస్కృత కళాశాల వారు ఆయనను కళాశాలలో చేర్చుకోలేదు. రామచంద్ర గారు చదువు నిమిత్తమై నెల్లూరు వెళ్ళారు. అచ్చట పూర్వ సంగతులేమి చెప్పకుండా వేద సంస్కృత కళాశాలలో అనాయాసంగా ప్రవేశం సంపాదించారు. స్వయంపాకుల వారి సత్రంలో మిత్రుల సహాయ సహకారాలతో ఉండడానికి గది ఏర్పాటు చేసుకున్నారు. ఈ విషయంలో కె.వి.రాఘవాచార్యుల వారు ఎంతో సహాయం చేశారు. భోజనానికి వారాలు ఏర్పాటు చేసుకున్నారు. సంస్కృత విద్యార్థి కావడం, తల్లితండ్రులకు దూరంగా ఉండటం, సత్యాగ్రహిగా జైలుకు వెళ్లడం – ఇలా ఎన్నో కారణాలవల్ల వారికి వారాల భోజనం పెట్టిన తల్లుల పుత్రవాత్సల్యం అమితంగా లభించింది. నెల్లూరులో ఉన్నకాలంలో చదువుతోపాటు కొంతమంది పూర్వ మిత్రులతో కలిసి విప్లవ కార్య క్రమాలలో గోప్యంగా

పాల్గొనేవారు. అలాగే చదువుతూ మంచి మార్కులతో సాహిత్య శిరోమణి ప్రిలిమినరీ పాసయ్యారు. కొందరు నెల్లూరు పెద్దలను గూర్చిన వివరాలన్నీ అత్యంత ఆహ్లాదకరంగా 42వ అధ్యాయంలో వర్ణించారు రామచంద్ర గారు. నెల్లూరిలో రామచంద్ర గారి జీవితం ద్వందరీతిలో రెండు పట్టాలపై నడిచింది. పగలేమో పరమభాగవత (విద్యార్థి) వేషం, రేయి ఏమో రాత్రించర వేషం. మధ్య మధ్య లో అతని అంతరాత్మ ప్రబోధించేది. "నీవు హింసా మార్గంలో నడుస్తున్నావు, హింసతో సాధించేది ఏది మంచిది కాదు . . ." అని. కాని రామచంద్ర నిస్సహాయులు, అతని విప్లవ మిత్రులు అన్ని విధాలా అతని కంటే బలవంతులు.

రామచంద్ర గారి సాహిత్య శిరోమణి ఫైనలు ప్రవేశానికి పిన్సిపాలు చాలా అడ్డంకులు కలిగించారు. మంచిమార్కులు వచ్చిన వారికి విద్యార్థి వేతనం ఇవ్వవలసి వున్నా ఈయక ఇబ్బంది పెట్టారు. మళ్లీ రెండు సంవత్సరాలు వారాల విద్యార్థిగా ఉండడానికి ఆయన మనస్సు ఒప్పలేదు. అదే కాకుండా ఆయన విప్లవ హింసా కార్యాలకు దూరంగా ఉండదలచారు. ఆ కారణాన నెల్లూరు విడిచి మద్రాసు వెళ్ళాలని నిశ్చయించు కొన్నారు. అచ్చట మైలాపూర్ సంస్కృత కళాశాలలో ప్రయత్నించ దలచారు. మద్రాసుకు పయనమయ్యారు.

**మద్రాసు విశేషాలు :**

తిరుమల గారు మద్రాసులో తన పూర్వ మిత్రులైన దమ్మలపాటి శేషగిరి రావు, కప్పగంతుల లక్ష్మణశాస్త్రిని కలిశారు. ఇద్దరూ సాహిత్యశిరోమణి కోర్సు పూర్తిచేసి, వేదాంత శిరోమణి కక్ష్యలో చేరారు. వారితో రామచంద్ర గారు తమ కథ చెప్పారు. మరుసటి రోజు కళాశాల నిర్వాహక మండలివారిని కలిశారు. వారు కళాశాలలో ప్రవేశం ఇవ్వగలము కాని భోజన సదుపాయం కల్పించ లేమన్నారు. లక్ష్మణశాస్త్రి, శేషగిరిరావు వంటవానితో సఖ్యత కుదుర్చుకొని, ఏదో విధంగా మిగిలి పోయిన అన్నం, తదితర వంట పదార్థాలు రాత్రి తొమ్మిది గంటల తర్వాత రామచంద్ర గారికి అందజేసే ఏర్పాటు చేశారు. అప్పుడప్పుడు పండుగలకూ, పర్వాలకు మరో మిత్రుడైన రామనాథ దత్త ఇంట్లో పగలు భోజనం చేసే వారు. పిన్సిపాలుగారు, తక్కిన ఆచార్యులు రామచంద్ర గారిని ప్రేమతో చూచేవారు. మైలాపూర్ సంస్కృత కళాశాలలో యథాప్రకారం పనులు సాగిపోతున్నాయి. ఇంతలో ఒకరోజు ''ఫలానా వారున్నారా?" అంటూ ఒక పెద్ద మనిషి తరగతి గదిలోకి వచ్చాడు. ఆయన సి.ఐ.డి. ఇన్ స్పెక్టర్. ఆయన వెంట రామచంద్ర గారిని పోలీసు స్టేషనుకు తీసుకు వెళ్ళారు. పట్టాభిరెడ్డి గారిని గురించి ప్రశ్నించారు. "నీ మిత్రులందరు పట్టు బడ్డారు నీవు నిజం చెబితే మంచిది . . . రామచంద్ర గారికి మాట్లాడక తప్పింది కాదు . . . రామచంద్రను కుట్రకేసులో ప్రాసిక్యూషన్ సాక్షిగా వేసుకున్నారు. ప్రభుత్వం పగబట్టి యువకు లందరికీ యావజ్జీవన కారాగార శిక్ష విధిస్తుంది కనుక వారిని కాపాడ వలసిందని చాలామంది ప్రకాశం పంతులు గారిని ప్రార్థించారు. మద్రాసు కుట్రకేసు సంవత్సరంపాటు 1934 సంవత్సరమంతా జరిగింది. ప్రకాశం గారి వాదనా పటిమ వల్ల రామచంద్ర గారి మిత్రులంతా కొద్దిపాటి శిక్ష పొందారు. రామచంద్ర గారిని ఎలాంటి శిక్షలేకుండా విడుదల చేశారు. కాని, సంస్కృత కళాశాలవారు రామచంద్రను బహిష్కరించారు. ఆ సమయంలో రామచంద్ర గారి మిత్రుడు రామనాథదత్త (అప్పటికి వైద్యుడుగా మైలాపూర్ డిస్పెన్సరీలో), భారతి ఉపసంపాదకులైన తిరుమల వెంకటాచార్యులు కొంతకాలం ఆశ్రయం ఇచ్చారు. ఆ సమయంలోనే ప్రభుత్వ ప్రాచ్యలిఖిత భాండాగారం, ఎగ్మోరులో సంస్కృత తెలుగు ప్రాచీన గ్రంథాలు చూచి వ్రాయడానికి లేఖకులు కావాలని ప్రకటించారు. తిరుమల రామచంద్రగారు అక్కడికి వెళ్లి స్వయంగా ధరఖాస్తు వ్రాసి యిచ్చారు. అప్పుడు ఆ పుస్తక భాండాగారం పండితులు వేటూరి ప్రభాకర శాస్త్రి గారు శలవు పెట్టడంవల్ల ఆ స్థానంలో తాత్కాలికంగా ఉన్న బులుసు వెంకటరమణయ్య రామచంద్ర గారి దస్తూరి పరీక్షించి కాపీయిస్టు పదవికి అర్హుడని సిఫార్సు చేశారు. రామచంద్ర గారు 30 రూపాయల నెల వేతనంపై 1934లో కాపీయిస్టుగా చేరారు. నాలుగు సంవత్సరాల పాటు అక్కడ పనిచేశారు. అప్పటికి రామచంద్ర గారు సంస్కృత – తెలుగు విద్వాను పరీక్ష పూర్తిచేశారు. అప్పటికి ఆయన వయస్సు 21 ఏళ్ళు. రామచంద్ర గారు ఉద్యోగరీత్యా వేటూరి ప్రభాకర శాస్త్రి గారికి సన్నిహితులు అగుటయే గాక, శాస్త్రి గారికి ఏకలవ్య శిష్యుడయ్యారు. శాస్త్రి గారి నడతను, వ్రాతలను, ప్రసంగాలను, సంభాషణలను, సలహాలను పాఠంగా గ్రహించి ఎన్నో విషయాలు నేర్చు కున్నారు. ప్రాచీన గ్రంథాల

పాఠాంతర సంగ్రహణం, పాఠవివేచనం, పాఠనిర్ణయం, తాళపత్ర గ్రంథాల పఠనం మొదలగు విషయాలు రామచంద్ర గారు ప్రభాకర శాస్త్రిగారి నుండియే తెలుసు కున్నారు. తిరుమల వారు, ప్రభాకర శాస్త్రిగారి కోసమై హరవిలాసాది కావ్యాల, ప్రబంధాల పాఠాంతరాల సేకరణకు తంజావూరు వెళ్ళివచ్చారు.

మద్రాసులో ఉన్న సమయంలోనే శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారికి అసిస్టెంటుగా ఆయనతో కలిసి పనిచేసే గొప్ప అదృష్టం రామచంద్ర గారికి లభించింది. తిరుమల గారు 1935 సెప్టెంబరులో భారతిలో "ఆంధ్ర ఛందో విశేషములు" అనే వ్యాసము ప్రచురించారు. దానిని గిడుగు రామమూర్తి పంతులు గారి వంటి పండితులు మెచ్చుకున్నారు. రామచంద్ర గారు మద్రాసులో ఉన్న తరుణంలోనే హరిజనోద్యమ సమయంలో గాంధీజీతో పాటు పయనించే అవకాశం, మాంబళంలో ఆయనతో కొన్నాళ్ళు ఉండే అవకాశం కలిగింది. ఆ కాలంలోనే ఆంధ్ర విశ్వవిద్యాలయం వారు ద్విపద భారత ప్రతులను, తంజావూరు సరస్వతీ గ్రంథాలయం ప్రతులతో సరిచూచి ముద్రణప్రతి సిద్ధపరచడానికి రామచంద్ర గారు ఎంపికైనారు. ఆయన 1937 – 1938 మధ్యకాలంలో తంజావూరు సరస్వతీ మహల్ గ్రంథాలయంలో ఉద్యోగం చేశారు. తంజావూరిలోని పని రామచంద్ర గారికి గొప్ప అనుభవం కలిగించింది. ఆ కాలంలోనే లాహోర్ విశ్వవిద్యాలయం, వారి గ్రంథాలయంలో ఉన్న తాళపత్ర గ్రంథాలకు వర్ణనాత్మక సూచి వ్రాయడానికి ఒక పండితుడు కావలెనని ప్రకటించింది. దానికి రామచంద్ర గారు దరఖాస్తు పంపగా, వచ్చి చేరమని ఉత్తరువు వచ్చింది. ఈ లోపల రామచంద్ర గారి జీవితంలో ఒక ముఖ్య సంఘటన జరిగింది. అదే, 1938 మే 7వ తేదిన సౌభాగ్యవతి అనంతలక్ష్మితో వారి వివాహం. 1939 ఆగస్టు చివర లాహోరుకు బయలు దేరారు తిరుమల గారు. లాహోరు సుందరనగరం. సిటీ ఆఫ్ గార్డెన్స్ అని దానిని పేర్కొంటారు. రామచంద్ర గారు పురానీ అనార్కలీ ప్రాంతంలో ఒక గదిలో అద్దెకు ఉండే వారట! ఆయన యూనివర్సిటీ లైబ్రరిలో ఉన్నందున, ఉదయశంకర్ భట్ వంటి గొప్ప రచయితలను, ఓరియంటల్ కాలేజి పిన్సిపాల్ మహామహోపాధ్యాయ మాధవశాస్త్రీ భండారి వంటి గొప్ప విద్వాంసులతో పరిచయం చేసుకోగలిగారు. యూనివర్సిటిలోని సంస్కృత విభాగంలో రామచంద్ర గారికి పని. తెలుగు, కన్నడ, మళయాళ, నాగరీ లిపుల తాళ గ్రంథాలు దాదాపు 1000 వరకు ఆ విభాగంలో ఉండేవట! విశేష మేమిటంటే, వాటిలో 'దాశరథీ తంత్రం' అనే తెలుగు లిపి గ్రంథంలో రెండంగుళాల వెడల్పు తాటాకులో ఒకవైపు 30 పంక్తులు ఉండేవట! సంస్కృత విభాగం వారు తెలుగు లిపి పొంకానికి ఆశ్చర్యపడి, ఒక ప్రదర్శనం ఏర్పాటు చేశారట! స్థానిక పత్రికలైన ట్రిబ్యూన్ మొదలైన పత్రికలు ఆ ప్రదర్శనాన్ని చాలా ప్రశంసించాయని వ్రాస్తారు తిరుమల వారు.

లాహోరులో ఉన్న కాలంలో రామచంద్ర గారు, అక్కడి అత్యున్నత హిందీ పరీక్ష ప్రభాకరు ప్యాసయ్యారట. తదుపరి ప్రైవేటుగా మెట్రిక్యులేషన్, ఇంటరు పరీక్షలు కూడా ప్యాసయ్యారట. బి.ఎ. పరీక్ష కూడా పూర్తి చెయ్యాలని సంకల్పించినా, కారణాంతరాల వలన పూర్తి చేయలేక పోయారట.

రామచంద్ర గారు లైబ్రరీ ఉద్యోగంలో చేయవలసిన పని పూర్తయిన తర్వాత, ఆ నగరం లోనే ఒక హైస్కూలులో హిందీపండిట్ గాను, బంగారు కంపెనీలలో గుమాస్తాగా రకరకాల చిల్లర పనులు చేశారని, అవి కూడా నచ్చక వదిలేశారని వ్రాసు కున్నారు. ఆయన లాహోర్ నగరంలో నివసించిన కాలంలో జరిగిన సంఘటనలన్నీ స్వీయచరిత్ర 53, 54, 55 అధ్యాయలలో అత్యంత ఆహ్లాదకరంగా విపులీకరించారు. ఆయా అధ్యాయాలు చక్కని శైలిలో ఉత్కంఠ భరితంగా, నవలకన్నా ఆసక్తికరంగా చదివిస్తాయి! తిరుమల గారు లాహోరులో మూడేళ్ళు ఉన్నారు. అక్కడ ఉన్నప్పుడే డాక్టరు రఘువీరా గారితో వారికి పరిచయం అయింది. ఒకనాటి సాయంత్రం అనుకోకుండా రామచంద్ర గారు డా॥ రఘువీర గార్ని కలిశారు. ఆయన లైబ్రరీ ఉద్యోగం గురించి అడుగగా, ఆ పని పూర్తయినదని, ప్రస్తుతం మరో ఉద్యోగ ప్రయత్నంలో ఉన్నానని రామచంద్ర గారు డా॥ రఘువీరా గారితో చెప్పారు. ఒక వారం తర్వాత తనని కలుసుకోమని రఘువీర గారు చెప్పారు. వారం తర్వాత కలిసి నప్పుడు డా॥ రఘువీరా గారు తాను ప్రపంచభాషల నిఘంటువు సంకలనం చేస్తున్నానని, ఆ సందర్భంలో దక్షిణ భారత భాషలు తెలిసిన విద్వాంసుల సహాయ, సహకారాలు అవసరమని, ఆ విషయమై రామచంద్రగారు తనకు

సహాయకునిగా పనిచేయమని, అందుకు గాను నెలకు ముప్పది రూపాయలు ఇవ్వగలనని తెలియ జేశారు. రామచంద్ర గారికి ఇష్టమైతే పనిలో చేరవచ్చునని తెలిపారు. ఆలోచించుకొని జవాబు ఇస్తానని రామచంద్ర గారు చెప్పారట. తర్వాత అంత తక్కువ జీతానికి పనిచేయుట ఇష్టంలేక, ఆ విషయమై ఆలోచించ లేదు. డా॥ రఘువీర గొప్ప మేధావి. విశ్వవిఖ్యాతి పొందినవారు. ఆయనతో పని చేయుటయే గొప్ప! అయితే, అప్పట్లో రామచంద్ర గారు ఆ విషయాన్ని గ్రహించలేక పోయారు. తర్వాత కాలంలో ఆ విషయమై ఇలా అంటారు వారు "ప్రతివ్యక్తికీ అతని యోగ్యతను బట్టి మంచి అవకాశాలు కలుగుతాయి. ఎలాటి యోగ్యతాలేని నాబోటివారికి అరుదుగా కలుగుతాయి. వాటి బాగోగులు ఆలోచించుకొని ముందుకు పోవడంలోనే వుంది విజయం. అలా వినియోగించుకోక, వచ్చిన అవకాశాలను జారవిడుచుకొనే మూర్ఖుడు జీవితమంతా పశ్చాతాప పడవలసినదే"! ఈ ఉదంతాలన్నీ 56వ అధ్యాయంలో వివరించారు తిరుమల గారు.

రామచంద్ర గారు లాహోర్ లో ఉన్న సమయంలోనే ద్వితియ ప్రపంచయుద్ధం తీవ్రమైంది. వారికి మిలటరీలో చేరుదామని బుద్ధి పుట్టింది. సరాసరి రిక్రూటింగ్ ఆఫీసుకు వెళ్ళారు. ఆఫీసువారు రామచంద్ర గారిని హవల్దారు క్లర్కుగా చేర్చుకున్నారు. 1940లో ఈ సంఘటన జరిగింది. చేరిన మరుసటిరోజే రామచంద్ర గారిని శిక్షణ కోసం బెలూచిస్తాన్ క్వెట్టాకు పంపారు. క్వెట్టానగరం బెలూచిస్తాన్ రాష్ట్రం రాజధాని. క్వెట్టాలో శిక్షణ పొందిన తర్వాత రామచంద్ర గారిని ఆఫ్గనిస్తాను, పర్షియా సరిహద్దుల్లోని చమన్ లో ఒక గూర్ఖా బెటాలియన్ కు పంపారు.

మిలిటరీ సూత్రాలు విచిత్రంగా ఉండేవి. విధి నిషేధాలు – వెంటనే అపవాద సూత్రాలు! వ్యభిచారం నిషిద్ధంకాని వెళ్లదలచావా, మొదట పని తర్వాత డాక్టరు దగ్గరికి వెళ్ళు. అలాగే, తాగుదు నిషిద్ధం – తాగదలచావా తాగి బారకాసుల లోనే పడిఉండు – చల్లగాలి తగిలితే మత్తు ఎక్కువవుతుంది". అంటే నిషిద్ధమైన పనులు చేయవచ్చు. ఒకవేళ అలాచేస్తే దానికి విరుగుడు సహితం చెప్పబడినది.

యుద్ధం తీవ్రమైంది. కెట్వా ప్రాంతాన్ని రణరంగంగా ప్రకటించ బోతున్నారన్న వార్తలు ప్రచార మయ్యాయి. ఆ తరుణంలోనే బ్రిటీషు ప్రధాని చర్చిల్ హఠాత్తుగా తనిఖీకి వస్తున్నారని సర్వసిద్ధంగా ఉండాలని అచ్చటి సైన్యాధికారులకు హెచ్చరికలు అందాయి. రామచంద్ర గారున్న బెటాలియన్ తుపాకులు పట్టుకుని అప్పుడే శత్రువుపై పోరయ్యేటట్టు సిద్ధమయ్యారు. ఆ మరునాడు పెద్ద మైదానంలో పరేడు జరిగి నప్పుడు ఒక మిలిటరీ జీపులో ఉన్నత సైనికాధికారుల మధ్య బ్రిటీషు ప్రధాని చర్చిల్ ఉన్నారు. అంతవరకు రామచంద్ర, తదితర సైనికులకు ఆయన సర్ విన్‌స్టన్ చర్చిల్ అని తెలియదు! చర్చిల్ దర్శనం తిరుమల వారి జీవితంలో గొప్ప సంఘటన! చమన్‌లో జరిగిన విశేషాలన్నీ అత్యంత వివరంగా పేర్కొన్నారు రామచంద్ర గారు. ఆ విషయాలు తెలుసుకొనగోరే పాఠకులు స్వీయచరిత్ర లోని 56 నుండి 58 వరకు గల అధ్యాయాలు చదువుకొన వచ్చును.

మిలటరీలో ఉన్నప్పుడు రామచంద్ర గారు చేసిన ఒక చిన్నపొరపాటు పనికి ఆయనను కోర్టుమార్షల్ కి గురి చేశారు. కోర్టుమార్షల్ తర్వాత మిలటరీ జీవితం మీద విరక్తి కలిగింది, ఛీ అనిపించింది. ఏమిటీ 24 గంటల కూలీ! వదిలించు కొనుటకై ప్రయత్నించ సాగారు. కాని వదలించు కోవడం అంత సులువు కాదు. ఆ సమయంలో సారవాక్ నుండి వెంకటకృష్ణ అనే తెలుగు డాక్టరును రామచంద్ర గారి బెటాలియన్ చమన్ కు పంపించారు. రామచంద్ర గారు కృష్ణా గారికి తమ కథనంతా వివరించి, ఎలాగైనా మిలటరీ జీవితం నుండి విముక్తి కోరారు. డా॥ కృష్ణగారు రామచంద్రను రకరకాలుగా పరిశీలించి, ఆయనకు ఆవేశోద్రేకాలు ఎక్కువ కావడం వల్ల ఒక్కొక్కప్పుడు మతిమరుపు ఎక్కువవుతుందని అందువలన రామచంద్రవంటి వారి వల్ల సైన్యానికి నష్టమని ఒక అధికార నివేదిక వ్రాసి, తదుపరి పరిశీలనకై క్వెట్టాకు బదిలీ చేయించాడు. రామచంద్ర ఆ మెడికల్ రిపోర్టు సంగతి కమాండెంట్ ఆఫీసరుకు తెలియజేసి, ఒక రాజీనామా వంటిది వ్రాసి పంపించి, ఆ సాయంత్రం లాహోరుకు ప్రయాణమయ్యాడు. అయితే, మధ్యలో రోహ్రీ జంక్షన్ వచ్చింది. అక్కడ ఒక చరిత్ర విద్యార్థి రామచంద్ర గారికి పరిచయమయ్యాడు. అతడు రామచంద్ర గారిని అక్కడ దిగి సింధూ నదిలో స్నానం చేయడానికి, పక్కనే ఉన్న సుందరమైన నగరం హైదరాబాదు పట్టణం, మొహంజొదారో చూద్దామని

ప్రోద్బలం చేశాడు. ఆ వివరాలన్నీ 59వ అధ్యాయంలో చక్కగా వర్ణిత మయ్యాయి. ఆ విధంగా రామచంద్ర గారు మొహెంజొదారో హరప్పా ప్రాంతాలలో ప్రాచీన నాగరికతా చిహ్నాలు దర్శించారు! హరప్పా నుండి తిరిగి వచ్చి లాహోరు రైలెక్కారు. లాహోరులో మిత్రులిద్దరూ విడిపోయారు. రామచంద్ర గారు లాహోరు నుండి ఢిల్లీ వస్తూ అమృతసర్ లో దిగి జలియన్ వాలాబాగ్ దర్శించారు. అచ్చట జనరల్ డయ్యర్ కాల్పులు జరిపించి వందలమందిని పొట్టబెట్టుకొన్న ప్రదేశాన్ని పరికించారు. అమేయానుభూతి పొందారు. ఆ చోటు వదల్లేక, వదల్లేక ఢిల్లీకి పయన మయ్యారు. ఈ విషయాలన్నీ 59వ అధ్యాయంలో పొందు పరచారు.

60వ అధ్యాయంలో గంగాతీరంలో రామచంద్ర గారు లాహోరు వదలిన తర్వాత జరిగిన విశిష్టోదంతాలను అద్భుతంగాను, ఆశ్చర్య జనకంగాను మనకు తెలియ పరుస్తారు తిరుమల గారు. ఆ సంఘటనలు జరిగిన సమయంలోనే సత్రంలో మొహర్ సింగ్ అనే క్షత్రియ యువకునితో పరిచయమయింది వారికి. అతనికి తమ పరిస్థితి తెలియ పరచారు. అప్పుడు రామచంద్ర గారి వద్ద చిల్లిగవ్వ లేదు. ఆయన ఆర్థిక పరిస్థితి అత్యంత దైన్యం! ఆ రాత్రికి మొహర్ సింగ్ అతిథిగా ఒక రాజస్థాన్ హోటల్లో నాలుగు చపాతీలు తిన్నారు! ఆకలి ఆచారా లెరుగదు కదా! మొహర్ సింగ్ కు అతిథిగా భోజనం ముగించి, సత్రం గదిలో మంచంపై పడుకొని దొర్లుతూ ఆలోచనలో పడ్డారు తిరుమల. కెట్వానుంచి లాహోర్ చేరిన తర్వాత జరిగిన సంఘటనలన్నీ సినిమా బొమ్మల్లాగా ఆయన కండ్లముందు మెలిగాయి! ... పూర్వమిత్రుడు చీమకుర్తి సీతారామయ్యను కలియుట, ఆయనతో కలిసి వెంకటరామన్ అనే ఆయన సంపాదకత్వంలో ఆంగ్లపత్రిక స్థాపించనున్నట్లు తెలుసుకొని ఆపత్రికలో ఉద్యోగం కోసం ప్రయత్నించారు. వెంకటరామన్ గారు పత్రిక పెట్టడం నిజమేనని, రెండుమూడు నెలల తరువాత తనను కలుసుకోమని చెప్పారు. . . ఆలోచనల్లో ఉండగా మొహర్ సింగ్ గది తలుపు తట్టి, పేపరులో "హిందీ, ఇంగ్లీషు తెలిసినవాళ్ళు ప్రూఫ్ రీడర్లు గాను, రిపోర్టర్లుగాను పనిచేయడానికి మనుష్యులు కావాలట!" అనే ప్రకటన గురించి చెప్పి, "ఎడిటర్ వెంకటరామన్ మీప్రాంతం వాడే ప్రయత్నించండి" అని చెప్పాడు. తర్వాత రామచంద్ర గారు ఇంటర్వ్యూ ఇవ్వడం, ఉద్యోగం లో చేరటం జరిగి పోయాయి. విచిత్ర మైన తన ఇంటర్వ్యూ ను గురించి, డెయిలీ టెలిగ్రాఫ్ లో తన ఉద్యోగాన్ని గురించిన తన అనుభవాలను చక్కగా వివరించి కథారూపంలో ప్రకటించారు రామచంద్ర గారు స్వీయచరిత్ర 61వ అధ్యాయంలో.

డెయిలీ టెలిగ్రాఫ్ లో చేరిన తర్వాత రామచంద్ర గారు వారి నాన్నగారికి రెండు సంవత్సరముల తర్వాత ఉత్తరం వ్రాశారు. ఆయన రామచంద్ర గారు పత్రికలో చేరినందుకు సంతోషిస్తూ, "ఇంగ్లీషు మహాసముద్రం. తెలుగు పత్రికలలో చేరితే, మాకు దగ్గరగా ఉంటావు" అని జవాబు వ్రాశారు. దాని ఉద్దేశ్యం "ఉద్యోగం వద్దు తిరిగిరా – అనడమేనని" భావించారు రామచంద్ర.

తిరుమల గారు 1944 చివరలో కాన్పూరునుండి ఇంటికి తిరిగి వచ్చారు. 1939లో వివాహమయిన తర్వాత భార్యను కలుసుకోనేలేదు! ఇంట్లో వారందరు ఎంతో సంతోషించారు. తిరిగి కాన్పూరు వెళ్ళడానికి ఎవ్వరూ సమ్మతించ లేదు. ఇది వరకు అయితే రామచంద్ర గారు ఏపనికైనా సిద్ధపడేవారే గాని, ఇప్పుడు పత్రికలో పనిచెయ్యాలనే పట్టుదల కలిగింది. అంటే ఆయన మనస్తత్వంలో మార్పు వచ్చిందన్నమాట. ఉద్యోగానికి ప్రయత్నించడానికి ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, దేశాభిమాని అనే రెండుమూడు పత్రికలు మాత్రమే! మద్రాసులోని ఆ పత్రికలలో రామచంద్ర గార్కి ఉద్యోగం దొరకడం అంత సులభం కాదు. కాబట్టి హైదరాబాదు వెళ్ళి ప్రయత్నం చేద్దామని బుద్ధి పుట్టింది. అందువలన ఆయన సురపురంలో అత్తగారింట్లో నెలరోజులుండి, హైదరాబాదుకు పయనమయ్యారు. అప్పుడు డక్కన్ క్రానికల్ వారు తెలంగాణా పత్రిక అనే దినపత్రిక ఆంధ్రపితామహ మాడపాటి హనుమంతరావు గారి సంపాదకత్వంలో ప్రారంభించారు. రామచంద్ర గారికి సంగం లక్ష్మీబాయి ద్వారా, హనుమంతరావు గారి సిఫార్సుతో సబ్ ఎడిటర్ గా ఉద్యోగం దొరికింది. పదవి సబ్ ఎడిటర్ అయినా, రిపోర్టింగ్ చేసేవారు. ఆయన మొదటి రిపోర్టు నిజాం నవాబుగారి పెద్దకోడలు నీలోఫర్ బేగంగారు ఏదో ఆస్పత్రి ప్రారంభించడానికి సంబంధించినది. అప్పుడు పత్రికలు గ్రాంథిక భాషనే వాడేవారు కనుక రామచంద్ర గారు ఆ రిపోర్టు గ్రాంథిక భాషలోనే వ్రాశారు. అది మరుసటిరోజు

అచ్చైంది. డక్కన్ క్రానికల్ ఎడిటరు రామానుజా చార్యులు దానిని చదివి "సులభ గ్రాంథికములో వార్తలు ఉండాలిగాని, మీప్రబంధశైలి వద్దు. మీ రిపోర్టు మీకు, మాకు తప్ప ప్రజాసామాన్యానికి అర్థంకాదు. కనుక టోన్ డౌన్ చేయండి" అన్నారుట. రామచంద్ర గారు తెలంగాణా పత్రికలో మూడునెలలు పని చేశారు. ఇంతలో అడవి బాపిరాజు గారి సంపాదకత్వంలో మీజాన్ పత్రిక వెలువడింది. రామచంద్ర గారు దానిలో చేరారు. ఆ పత్రికలో వారు సాంఘిక, చరిత్ర, భాషాసాహిత్యాల పై వ్యాసాలు వ్రాసేవారు. మీజాన్ లో పని చేసేటప్పుడు మధ్యాహ్నం అల్పాహారానికి ఒకపెద్ద వేపచెట్టు క్రింద అందరూ కూర్చునే వారని, ఒకపెద్ద టిఫిను కేరియర్ నిండా ఫలహారాలు బాపిరాజు గారు తెచ్చి అందరికి పంచేవారని, చెట్టు కింద అంతర్జాతీయ విషయాలన్నీ చర్చకు వచ్చేవని వ్రాశారు తిరుమల.

రామచంద్ర గారు 1947 ఏప్రిల్ మొదటి వారంలో ఆంధ్రప్రభలో చేరారు. ఆయనకు ఆదివారం నాటి అనుబంధం అప్పగించారు. ఆంధ్రప్రభలో పనిచేయు కాలంలో కొన్ని వందల పుస్తకాలు సమీక్షించారట! స్వంత పేరుతోను, మారు పేరుతోను ఎన్నోవ్యాసాలు వ్రాశారట! శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రివంటి పెద్దలు అస్తమించి నప్పుడు సంతాప సంపాదకీయాలు, రాష్ట్రసరిహద్దు సమస్యలవంటి భౌగోళిక చారిత్రకాంశలపై సంపాదకీయాలు వ్రాశామని పేర్కొన్నారు. ఆ రోజుల్లో తాపీ ధర్మారావుగారి సంపాదకత్వంలో సందేశం అనే పత్రిక వెలువడేది. 1958లో రామచంద్ర గారు సందేశం లో పత్రికల హెడ్డింగులను వ్యంగ్యంగా విమర్శిస్తూ, హెడ్డింగు అనే శీర్షికతో ఒక వ్యంగ రచన ప్రచురించారు. ఆ వ్యాసం ఆంధ్రప్రభ హెడ్డింగులపైనే అని కొందరు నార్లగారికి పితురీలు చెప్పారు. ఆయన రామచంద్ర గారిపై ఎక్కువగా కోపగించు కున్నారట! ఆ సంఘటన జరిగిన వెంటనే రామచంద్ర ఆంధ్రప్రభ ఉద్యోగానికి రాజీనామా ఇచ్చారట! ఆంధ్రప్రభ వదిలిన వెంటనే ఆంధ్రపత్రికలో అసిస్టెంటు ఎడిటర్ స్పెషల్ కరస్పాండెంటుగా, భారతి ఇన్ చార్జి ఎడిటర్ గా చేరారట. భారతిలో దేవరకొండ బాలగంగాధరతిలక్ కథ ఒకటి ప్రచురించి నందులకు రామచంద్ర గారు, శంభుప్రసాద్ గార్ల మధ్య అభిప్రాయ భేదాలు మొలకెత్తాయి. దానితో ఆ ఉద్యోగానికి సహితం తిలోదకాలు ఇవ్వవలసి వచ్చింది. అటు తర్వాత ఇండియన్ ఎక్స్ ప్రెస్ రెసిడెన్షియల్ ఎడిటర్ శేషాద్రిగారి ద్వారా మరలా ఆంధ్రప్రభ చిత్తూరు ఎడిషనులో ఉద్యోగంలో ప్రవేశించారు వారు. అక్కడి నుండివారు ఆంధ్రప్రభ వీక్లీకి బదలీ అయ్యారు రామచంద్ర. ఆ పదవిలో వారు మూడేళ్ళు పనిచేశారు. అప్పుడు ఆంధ్రప్రభ వీక్లీ సంపాదకులైన బి.సి.కామరాజు గారితో పేచీలు వచ్చాయి. అందుచేత ఉద్యోగ విరమణచేసి, మళ్ళీ ఆంధ్రపత్రికలో చేరారు! చివరకు ఆంధ్రపత్రిక ఉద్యోగం నుంచే రిటైరు అయ్యారని జీవిత చరిత్రలో పేర్కొన్నారు.

ఆ తర్వాత హైద్రాబాదు చేరుకొని, ఆంధ్రప్రభ వారపత్రికకు హైదరాబాదు లేఖ ఒక ఆరునెలల పాటు నిర్వహించారు. 1972 నుంచి 1989 వరకు (అంటే ఆంధ్రపత్రిక ఆగిపోయే వరకు) హైదరాబాదు నోట్ బుక్ అనే శీర్షికను నిర్వహించారు. అటు పిదప బిర్లా రిసెర్చ్ ఇన్‌స్టిట్యూట్ లో తాళపత్ర గ్రంథాల వర్ణనాత్మక సూచి తయారు చేశారు. ఆంధ్రభూమి పత్రికలో మూడేళ్ళు పనిచేశారు. ఈ పత్రిక కార్యకలాపాలే కాక, హరేరామ హరేకృష్ణ సంస్థ లో ఆంగ్ల పుస్తకాలు అనువదించారు. 1994లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో రెండువందల సంవత్సరాలనాటి లఘుశబ్దార్థ సర్వస్వమ్ అనే సంస్కృత విజ్ఞానకోశం పరిష్కరించి, ముద్రణకు సిద్ధపరిచే పనిలో నిమజ్ఞులయ్యారు. అటు తర్వాతనే స్వీయచరిత్ర రచించారు.

రామచంద్ర గారు ఇతరులతో కలిసి సంపాదకుడిగా ప్రచురించిన ప్రాచీన గ్రంథాలు, ప్రత్యేక సంచికలు చాలా ఉన్నాయి. అలాగే, ఆల్ ఇండియా ఓరియంటల్ కాన్ఫరెన్స్, హిస్టరీ కాన్ఫరెన్సులలో పాల్గొని పరిశోధనా పత్రాలు సమర్పించారు. తెలుగు దేశంలోని విశ్వవిద్యాలయాలలో ఏర్పాటయిన పెక్కు సదస్సులలో పరిశోధన వ్యాసాలు సమర్పించారు. అంతేకాదు, దాదాపు ముప్పై సంస్థలలో సభ్యునిగానో, సలహాదారుగానో, కార్యదర్శిగానో పనిచేశారు.

**బిరుదులు – సన్మానాలు :**

పైన పేర్కొన్న విధంగా తిరుమల రామచంద్ర గారు అనేక సంస్థలతో సంబంధాలు కలవారు. చాలా సంస్థలు వారిని బిరుదులతోను, పురస్కారలతోను సత్కరించి గౌరవించాయి. వానిలో కొన్నిటిని మాత్రం ఇచ్చట పేర్కొనడం జరిగింది. ఇలా చేయడంలోని ఉద్దేశం వారి



హరప్పా - మొహంజొదారో

పాల్గొని జైలు శిక్ష అనుభవించినవారు. వారు సంస్కృతం, ప్రాకృతం, హిందీ, కన్నడం, తమిళం, ఆంగ్ల, ఆంధ్ర భాషలలో పాండిత్యం గడించిన వారు. ఆయన జీవిత కాలంలో సృజించిన దాదాపు పదహారు వేల పేజీల సాహిత్యానికి జరామరణాలు లేవని విజ్ఞుల అభిప్రాయం. "సత్యం, తపస్సు, జ్ఞానం, అహింసాగుణం, విద్వాంసులను సేవించడం, ఉత్తమశీలం" ఈ గుణాలన్నీ ఉన్నవాడే విద్వాంసుడు. వట్టి చదువుతో విద్వాంసుడు కాడు" అంటారాయన! ఈ గుణాలన్నీ వారిలో మూర్తీభవించాయి అంటే సత్యవిదూరం కాదు. సంస్కృత కళాశాలలో చదువుతూ కూడా ఆధునిక భావాలతో, నవీనాశయలతో ఉత్తమ ఆదర్శాలతో వారు తమ జీవితాన్ని తీర్చి దిద్దు కున్నారు. "కుటుంబం లోను, సమాజంలోనూ గౌరవంగా వుండడానికి మానవుడు న్యాయంగానూ, నీతితోను, వ్యవహరించాలి" అనే ఆర్య వాక్యాన్ని ఆయన జీవితంలో మీరలేదు, మరువలేదు. వైచిత్ర్యం, వైవిధ్యం, వైరుధ్యాలు గల రామచంద్ర గారి జీవితం అందరికీ ప్రేరణాదాయకం. ఇదొక సత్యాన్వేషి కథనంగా, జిజ్ఞాసువు ఆవేదనగా పాఠకుల మనస్సులను అనుకంపంతో తప్పక నింపుతుంది. డా॥ తిరుమల రామచంద్ర 84 సంవత్సరముల వైవిధ్య జీవితాన్ని గడిపి, కర్మయోగిగా అక్టోబర్, 12, 1997న పరమ పదించారు. వారి వాఙ్మయ తపస్వితలో విరబూసిన సాహితీ కుసుమాలలో ఉత్తమమైన రచన హంపీ నుంచి హరప్పా దాక. ఈ రచనను ఉత్తమ గ్రంథంగా ఎంపికజేసి, జాతీయ పురస్కారాన్ని ప్రకటించిన కేంద్ర సాహిత్య అకాడమీ, న్యూఢిల్లీ వారు ప్రశంసా పాత్రులు.

విశిష్ట వ్యక్తిత్వాన్ని పాఠకుల ముందుంచడమే! బిరుదులు: మహామహోపాధ్యాయ – కాశీపండిత పరిషత్తు, పత్రకార శిరోమణి – కలకత్తా లోని ఉతంత మార్తండ పత్రిక, ఏకతా అవార్డు – హైదరాబాదు, డాక్టరేటు పట్టా (1988) – డా॥ అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం, డాక్టరేటు పట్టా – తెలుగు విశ్వవిద్యాలయం. పురస్కారాలు: ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ 1970లో సాహితీ సుగతుని స్వగతం పుస్తకానికి, 1980లో గాథా సప్తశతిలో తెలుగు పదాలు అనే రచనకు.

కేంద్ర సాహిత్య అకాడమీ 2002లో జాతీయ పురస్కారం హంపీ నుంచి హరప్పా దాక పుస్తకానికి (మరణోపరాంతం). సన్మానాలు: ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రపంచ తెలుగు మహాసభల రెండింటిలోను (హైదరాబాదు, కౌలాలంపూర్) లలో, రెండుసార్లు ఉగాది ఉత్సవాలలోను, తెలుగు విశ్వవిద్యాలయం రెండుసార్లు పరిశోధనకు గాను సన్మానించాయి. తమిళనాడు ప్రభుత్వం స్వాతంత్ర్య సమరయోధునిగా 1993లో సన్మానించింది.

**ముగింపు :**

"చెట్లు జీవిస్తాయి, (కొన్ని ఆయితే వేలఏండ్లు కూడా). మృగాలూ, పక్షులూ జీవిస్తాయి. అయితే వాటి మనస్సు పరిపక్వశీలం కాదు. ఎవరైతే మనస్సుతో మనసారా జీవిస్తారో వాళ్లే నిజంగా జీవించినట్లు. వాళ్ల జీవితమే సార్థకం" – అని యోగవాసిష్టం చెబుతున్నది. అలాంటి సార్థకజీవి డా॥ తిరుమల రామచంద్ర గారు. "వారు ఎప్పుడూ మనసుతోనే, మనస్విత తోనే, మనస్విగానే జీవించారు". తిరుమల వారు సుప్రసిద్ధ పత్రికా రచయిత, పండితుడూ, పరిశోధకుడు, పరమదేశ భక్తుడే కాక, స్వాతంత్ర్యసమరంలో

ప్రొ. రావినూతల సత్యనారాయణ
హైదరాబాద్.
సెల్ : 9618524702

# ఆధ్యాత్మిక చైతన్య సమన్వితాలు – కూచిపూడి నృత్య నాటకాలు

*– భాగవతుల హేమలత*



పరమ పావని ఐన మన భారతజనని ఎందరో తపఃసంపన్నులైన ఋషులకు, మునులకు, సిద్ధులకు, యోగులకు, జన్మనిచ్చిన పరమ పునీత. ఆమె ప్రసవించిన దివ్య ప్రసూనాలైన వీరందరూ సమస్త మానవజాతి యొక్క ఆధ్యాత్మిక అభ్యున్నతిని దృష్టిలో వుంచుకుని, అక్షయ సాధనా ఫలితంగా తాము గడించిన జ్ఞానసంపదను కొన్ని సాధనా మార్గాలుగా మలచి మానవజాతికందించారు. వాటిలో ముఖ్యమైనవి ధ్యానం, యోగం, తపం ఇత్యాదులు. వీటి ద్వారా మానవుడు అపూర్ణత్వం నుంచి పూర్ణత్వం వైపుకి, అంధకారం నుంచి ప్రకాశం వైపుకు, మృత్యువు నుంచి అమృతత్వం దిశగా పురోగమించగలుగుతాడు. ఈ క్రమంలోనే ఋషుల యొక్క చింతన నుంచి వికసించిన కుసుమమే 'పంచమ వేదం' మరియూ 'అభినయ వేదం'గా అభివర్ణించబడే నాట్యకళ. ఈ నాట్య కళ జగత్ కళ్యాణ కారకమైన భగవత్ప్రాప్తికి శ్రేష్టమైన సాధనామార్గంగా చెప్పనగుతుంది. ఒకానొక సందర్భంలో భూమండలంపై సత్యధర్మాలకు హాని కలిగినప్పుడు, ఆ ఆపద నుంచి ధరిత్రిని ఉద్ధరించే నిమిత్తం విధాత ఈ నాట్యవేదాన్ని రూపొందించ సంకల్పించినట్లుగా భారత ముని నాట్య శాస్త్రం ద్వారా విదితమవుతుంది

**ధర్మం యశశ్య మాయుష్యమ్ హితం బుద్ధి వివర్ధనం**
**లోకోపదేశ జననం నాట్యమేతత్ భవిష్యతి.**

ధర్మ, అర్థ, కామ, మోక్షాలలో ధర్మం ప్రధమమైనదే కాక ప్రధాన పురుషార్థం. తక్కిన మూడు పురుషార్థాలకూ ఆధారం కూడా ధర్మమే. ఆ ధర్మాన్ని ధరిత్రిపై సుస్థాపితం చేసే దిశలో నాట్యం ముఖ్య పాత్ర వహించగలిగిన యోగ్యమైన సాధనం. భరత ముని నాట్య శాస్త్రం లోని ప్రధమ అధ్యాయం లో పొందుపరచబడిన కథ ఈ ఉక్తిని బలపరుస్తుంది. ఈ కథనానుసరించి దేవతా సమూహం అంతా కలసి విరించి సన్నిధికి ఒక అభ్యర్థనను తీసుకు వెళతారు– భూమండలంలోని ప్రజలలో అనైతిక ప్రవర్తన ప్రబలిపోయింది.

అంతేకాక వారిలో కామ, క్రోధ, లోభ, మోహాది అరిషడ్ వర్గాలు చోటుచేసుకోవటంతో సమాజం తిరోగమన దిశగా పయనిస్తోంది. వేద వాఙ్మయం అర్థం చేసుకోగల సామర్థ్యం అన్ని జాతులవారికీ లేకపోవటంచేత, వారిలో ధర్మాధర్మాల విచక్షణ లేకుండా పోతోంది. తత్ కారణంగా సర్వులకూ ఆహ్లాదకారకమూ, ఆస్వాద యోగ్యమూ, దృశ్య శ్రావ్యయుక్తమైన పంచమ వేదాన్ని ప్రసాదించమని వేడుకుంటారు. అంత బ్రహ్మ దేవుడు ఋగ్వేదం నుంచి పాఠాన్ని, యజుర్వేదం నుంచి అభినయాన్ని, సామ వేదం నుంచి సంగీతాన్ని, అధర్వణ వేదం నుంచి రసాన్ని గ్రహించి పంచమ వేదమైన నాట్యాన్ని సృష్టించగా భరతముని నూర్గురు కుమారులూ ఈ కళను భూమండలంపై వ్యాపింప చేసినట్లు ప్రతీతి.

ఆ రీతిగా వారి ద్వారా ప్రచారం చేయబడిన ఈ కళ నుంచి వికసించిన విభిన్న శాస్త్రీయ నాట్య రీతులలో

కూచిపూడి నాట్యం కళాభారతి శిరమున వెలుగొందే కలికి తురాయి మాదిరిగా భాసిస్తోంది. ఐతే కొన్ని గాథలను ఆధారంగా చేసుకుంటే కూచిపూడి క్షేత్రంలో ఉద్భవించిన ఈ నాట్య కళ త్రేతాయుగం నాటి నుంచి ప్రచారంలో వున్నట్లు తెలుస్తుంది. నేటి ఈ కూచిపూడి త్రేతాయుగం నాటి 'కుశీలవ పురి' అని కొంతమంది చరిత్రకారుల అభిమతము. శ్రీరామ చంద్రుని కుమారులైన 'లవకుశలు' ఈ క్షేత్రంలో రామాయణ కథాగానాన్ని అభినయించటంచేత 'కుశీలవపురి'గా చెప్పబడినట్లు, అనంతరం ద్వాపర యుగంలో శ్రీకృష్ణుని మిత్రుడైన కుచేలుడు కొంత కాలం ఈ ప్రదేశంలో నివశించటంచేత ద్వాపర యుగంలో కుచేలపురిగా పరివర్తితమైనట్లు, అటు పిమ్మట కలియుగంలో కూచమ్మపూడి నిలయుడుగా ప్రసిద్ధి చెందిన గోపాలకృష్ణస్వామి ఈ క్షేత్రంలో కొలువై పూజలందుకుంటూ వుండటంచేత ఈ ప్రదేశం ప్రస్తుత యుగంలో కూచిపూడిగా స్థిరపడినట్లుగా కొన్ని చారిత్రక ఆధారాలననుసరించి, తెలియ వస్తుంది.. ఐతే పదకొండో శతాబ్ద సమయంలో పతనోన్ముఖ స్థితికి చేరిన ఈ కళను 17 వ శతాబ్దంలో శ్రీ సిద్ధేంద్ర యోగి పునఃప్రతిష్ఠించారు. వీరు ఈ కళను ఇహపర సాధనా మార్గం గా రూపొందించే క్రమంలో తన సంపూర్ణ జీవితాన్ని,మరియూ తపో సాధనాబలాన్ని కూచిపూడి నాట్యకళా భారతి చరణ యుగళానికి సమర్పించారు. తత్ ఫలితంగా వారి కృష్ణభక్తి రసజల సమన్విత హృదయ సరోవరం నుంచి జాలువారింది 'భామకలాపం' అనే రసవత్తర అద్భుత నృత్య రూపకం. ఇందులో సిద్ధేంద్రయోగి తన హృదయాంతరాళాలలో కృష్ణ భగవానుని పట్ల కూడుకుని వున్న శృంగార భరిత భక్తి భావ నవనీతాన్నికరిగించి పోశారు. నాటి నుంచీ ఈ సత్కృతిని కూచిపూడి వారు నేటి వరకూ భావ, స్ఫుర, రాగ,లయ రసోచితముగా ప్రదర్శిస్తూ వస్తున్నారు.సిద్ధేంద్ర యోగి భగవదైక్యాభిలాష తో తాను ఒక స్త్రీ గా అనుభూతిని చెందుతూ, రెప్పపాటు కాలమైనా తన భర్తను విడచి వుండలేని స్థితిని అనుభవిస్తారు. కృష్ణుని క్షణ కాలమైనా విడిచి వుండలేని శృంగార రసాధి దేవత ఐన సత్యభామ అతని రాక కై ఎదురు తెన్నులు చూస్తూ, ఆ విరహం లో వివిధ అవస్థా బేధాలను ప్రదర్శించటమే ఈ రూపకం యొక్క ఇతి వృత్తం. బాహ్య దృష్టికి ఇది ఒక శృంగార రస ఘుటికగా గోచరించినా, అంతరార్ధమాలోచిస్తే ఇదొక భాగవత్ ప్రాప్తి మార్గమని అవగతమవుతుంది. ఇక్కడ కృష్ణుడు పరమాత్మ కాగా, సత్యభామ జీవాత్మ. ఐతే జీవాత్మ పరమాత్మలో ఐక్యం పొంది జన్మ రాహిత్య స్థితి కై ప్రయత్నించటమే మానవజన్మ యొక్క లక్ష్యమని వైదిక వ్హ్మాయం ఘోషిస్తోంది. ఈలక్ష్యాన్ని మానవులు సులభంగా అర్థం చేసుకుని, దానిని ప్రాప్తింపచేసుకునే దిశగా పురోగమించాలని శ్రీ సిద్ధేంద్ర యోగి భామా కలాపం ద్వారా సందేశాన్నిస్తారు. భక్తుడు భగవంతుని చేరుకోవటానికి అతని మార్గం లో అవరోధంగా నిలిచేది అహంకారమే. తాను జగదేక సుందరినని, తన అతిలోక సౌందర్యానికి కృష్ణుడు వశుడని, మాయతెరలు క్రమ్మటం చేత సత్యభామ అభిప్రాయపడుతుంది. ఈ అభిప్రాయం తో ఆమె చూపే అష్టవిధ నాయికా లక్షణాలని,ఆమె కనపర్చేదర్పం, జాణతనపు సోయగం ఇత్యాది అంశాలను సిద్ధేంద్ర యోగి ఎంత మనోజ్ఞంగా కూర్చారో అంతే మనోజ్ఞంగా ప్రదర్శిస్తారు కూచిపూడి నర్తకులు. సత్యని కృష్ణుని తో కలపాలి అంటే, సత్య లోని అహంకార పొరలు వీడి, ఆమెకు కృష్ణ తత్వం పూర్తిగా అవగతమవ్వాలి. ఆ క్రమం లో ఆమె లోని అజ్ఞానాన్ని తొలగించటానికై సిద్ధేంద్ర యోగి మాధవి పాత్రని సృష్టించారు. సత్యభామ సఖి ఐన మాధవి మాధవుని స్వభావాన్ని ఆకళింపు చేసుకున్న ప్రజ్ఞాశీలి. ఈ విషయాన్ని గ్రహించిన సత్య తన కృష్ణ స్వామిని తన మందిరానికి రప్పించుకో గోరి మాధవిని రాయబార మొనర్చమని అర్థిస్తుంది. ఈ రాయబార నేపథ్యంలో అనేక విజ్ఞాన దాయక విషయాలు మానవాళికి అందించారు సిద్ధేంద్ర యోగివరేణ్యులు. ఈ భామాకలాపమును ఎందరో మహానుభావులు పరంపరను గతముగా ప్రదర్శించి, దర్శించి బ్రహ్మైక్యమును



పొందినారనుటలో అసత్యముండబోదు. భామాకలాపం లోని సత్యభామ కేశ విన్యాసం లో కూడా, ఒక పరమార్ధ తత్వం గోచరిస్తుంది. స్త్రీల యొక్క సౌందర్యశోభను ఇనుమడింప చేయటం లో కేశ పాశాలు ప్రత్యేక పాత్రను పోషిస్తాయి. సిద్ధేంద్ర యోగి కల్పన లోని సత్యభామ యొక్క కేశ శోభా విలాసం ప్రత్యేకతను కలిగి వుండటం చేత, ఆమె నంది తిమ్మన గారి పారిజాతాపహరణం నాయిక సత్యభామ కు భిన్నంగా ఒక విలక్షణమైన రూపవిశేషాన్ని కలిగివుంటుంది. క్షీరసాగర మధనం అనంతరం దేవాసురులకు అమృతాన్నిపంచే నిమిత్తం మోహిని రూపాన్నిధరించిన విష్ణుమూర్తి ఆనాటి తన జడను లోక కంటకుడైన నరకాసురుని సంహారం కావించిన అనంతరం సత్యభామకు కానుకగా సమర్పించినట్లు గా ఐతిహ్యం. ఈ జడ యోగా తత్వానికి ప్రతీక గా చెప్పబడుతుంది. ఈ జడ షట్చక్రాల లో ప్రధమ చక్రమైన మూలాధారాన్ని స్పృశిస్తుంది ఆ మూలాధారంలో నిక్షిప్తమైన కుండలినీ శక్తి ని జడ తన స్పర్శద్వారా జాగృత పరుస్తుంది. అది శుషుమ్ననది గుండా స్వధిష్టానంలో ప్రవేశించి విష్ణు గ్రంధిని చేధిస్తుంది. ఫలితంగా విశ్వమంతా విష్ణుమయంగా అనగా పరమాత్మ స్వరూపంగా గోచరిస్తుంది. ఇది సాధించే నిమిత్తమే మహాయోగులు కఠోర దీక్షను వహిస్తారు.

సిద్ధేంద్ర యోగి యొక్క రస స్ఫూర్తి, తజ్జనితమైన అద్వైత స్థితి, ఈ భామాకలాపం లో ప్రస్ఫుటంగా ప్రతిబింబిస్తుంది. ఇన్ని విశేషాలను తనలో ఇముడ్చుకున్న ఈ రసరమ్య



హరవిలాసము

కావ్యాన్ని కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారు వడకట్టబడ్డ భారత అలంకార శాస్త్రంగా అభివర్ణించారు.

పతంజలి యోగసూత్రములను, భగవత్ గీతను, యోగ వాశిష్టమును ఆధారముగా చేసుకుని పరమ యోగ నిష్టా గరిష్టులైన భాగవతుల రామయ్యగారిచే సృజించబడిన మరొక మహత్తర కలాపం గొల్లకలాపం.

శ్రీ భాగవతుల రామయ్యగారు శ్రీమతి ఆదెమ్మ, శ్రీ రామలింగం దంపతులకు వారి తపఃఫలానికి వరప్రసాదిగా జన్మించారు. బహుకళా ప్రవీణులైన వీరు హఠయోగ, రాజయోగాలనేకాక సకల ఉపనిషత్ సారాన్ని ఎరిగిన పరమహంస. మనసు శరీరము మరియూ బుద్ధి యొక్క సమతుల్యత మరియూ సంగమవే యోగమనబడుతుంది. ఈ యోగస్థితిని సిద్ధింప చేసుకున్నవారు పరబ్రహ్మలో లీనమై వుంటారు. నిత్యసుందర చైతన్య ఆనంద స్వరూపులుగా వుండగలుగుతారు. ఐతే ఈ స్థితిని సాధించటంకానీ, ఈ యోగరహస్యాన్ని గ్రహించటంకానీ అంత సరళమైన విషయం కాదు. అందుకే తానెరిగిన ఈ జ్ఞానాన్ని సర్వులకూ కరతలామలకం కావించటానికి శ్రీ రామయ్యగారు నాటక శైలిని మాధ్యమంగా ఎంచుకున్నారు. 'నాట్యం భిన్నరుచేర్జనస్య బహుదాప్యేకమ్ సమరాధనం' అంటారు. ఇది చాక్షుష ప్రక్రియ కావటంచేత అందరికీ రుచికరమూ మరియూ సులభగ్రాహ్యము అవుతుంది. ఈ నాట్యంలో పంచీకరణ జరుగుతుంది, అనగా పంచభూతల సంగతీకరణం జరుగుతుంది అని శ్రీ రామయ్యగారి అభిప్రాయము. అంగ విక్షేపం ద్వారా వాయువు, నాద ప్రసారంవలన అగ్ని, పరోక్షంగా జలము, పద తాడనం వలన భూమి, భావాభినయం వలన ఆకాశం (మనసు ద్వారా) యోగిస్తాయి. అందుకే వారు యోగవిజ్ఞానాన్ని మనవాళికి అందించటానికి ఈ మార్గాన్ని ఎన్నుకున్నారు అంటారు. వారి ముని మనుమడు శ్రీ భాగవతుల లక్ష్మీనరసింహం గారు (బిఎల్ఎన్ వ్యాసాలు, పుష్పక విమాన యాత్ర అనే స్వీయ గ్రంథంలో). గొల్ల కలాపము అనే రచన యొక్క వాస్తవిక శీర్షిక పిండోత్పత్తి మరియు ఆత్మ యజ్ఞ కలాప దృశ్య ప్రబంధము.

ఐతే ఇందులో ముఖ్యంగా గొల్లభామ పాత్ర ద్వారా వేద విప్రునికి రసవత్తరంగా వేదాంత బోధ జరగటం

కారణంగా ఈ సత్కృతి గొల్లకలాపంగా వాసికెక్కింది. ఇందులో రామయ్యగారు తమ సమకాలీన పరిస్థితులను ప్రస్ఫుటంగా ప్రతిబింబింప చేసిన తీరు అనితర సాధ్యమైనదిగా గోచరిస్తుంది. తత్కాలీన సమాజంలో బ్రాహ్మణుల ఆధిపత్యం ప్రబలంగా వుండేది. స్వర్గ ప్రాప్తి వారి లక్ష్యంగా వుండేది, అందుకై చేయవలసిన పంచ మహాయజ్ఞాలు, షోడశ కర్మలవరకూ మాత్రమే వారి జ్ఞానం పరిమితంగా వుండేది. వర్ణ తారతమ్యాలు మిక్కుటంగా వుండేవి. స్వస్వరూప జ్ఞానాన్ని (తనెవరో తెలుసుకునే జ్ఞానం) ఎరిగినవారు, అందుకై సాధన చేసేవారు మచ్చుకైనా కనుపించేవారు కారు. ఆ నేపథ్యంలో పరబ్రహ్మతత్వాన్ని సంపూర్ణంగా అర్ధంచేసుకున్న జ్ఞాన కోవిదులైన శ్రీ రామయ్య గారు స్వర్గప్రాప్తిని మించిన పరమ స్థితి మరొకటి వున్నదని, దాన్ని చేరేందుకు చేయవలసింది ఆత్మ యజ్ఞమని గొల్ల కలాపం ద్వారా ఉద్బోధిస్తారు. ఇందులోని పాత్రలైన గొల్లభామ, వేద విప్రుల సంభాషణల ద్వారా సమకాలీన సమాజంలో (1853 ప్రాంతంలో) పాదుగొన్న వర్ణ వైషమ్యాన్ని, జంతుబలిని, మూఢమైన విశ్వాసాలను ఖండిస్తారు కవి. కర్మ వల్ల జ్ఞానం వస్తుందని, దేహమే తను అనుకుని, స్వర్గ ప్రాప్తి జీవిత పరమావధి అని విశ్వసించే పాత్ర వేద విప్రునిది. ద్విజత్వం జన్మ వల్లకాక, కర్మవల్ల వస్తుందని, భగవత్ప్రాప్తికి మార్గం కర్మ కాక ఆత్మ నిష్టతో మానస సంయోగం చేయటం అందుకు అవసరమని బోధించే పాత్ర గొల్లభామది. ఒకరకంగా ఇక్కడ కృతి కర్త రామయ్యగారు గొల్లభామ కు అన్యులు కారు. వారు తన సాధనాజనిత జ్ఞాన సంపదను సమాజం ముందు వ్యక్త పరచటానికి గొల్లభామ పాత్రను సృజించారు. పుట్టుకతో మనిషి ఎక్కడ ఎలా జన్మించినా, గుణాలను ఉన్నతంగా మలచుకుని ఉన్నతుడుగా రూపొందాలన్న సందేశం అత్యంత ప్రతిభావంతంగా ఈ గొల్లకలాపం ద్వారా సమాజానికందించారు. నృత్య, మార్దంగిక, యోగ, ఉపనిషత్ జ్ఞాన దురంధురులు కవి రామయ్య గారు.

ఈ భామాకలాపం గొల్ల కలాపాలే కాక పూర్వ గాధావళి, పురాణావళి మరియూ ఇతిహాసదులు కూచిపూడి నాట్య నందనంలో వికసించిన కుసుమాలు. వీటి పరిమళం ఎప్పటికప్పుడు క్రొత్త తరాలవారికి అందుతూనే వున్నది. జనులలో హాస్యాన్ని కలిగింపచేసే పగటి వేషముల



శ్రీనివాస కళ్యాణం

సాంప్రదాయం సహితం కూచిపూడి నృత్య కళలోని భాగమే. కళాకారులు తమ జీవనోపాధికై పగటి వేషాలు ధరించినప్పటికీ, సమాజంలోని దురాచారాలను, ద్రోహ చింతనను, మట్టుపెట్టి, సమాజాన్ని దోచుకుంటున్న వారి గుట్టును రట్టు చేయటమే ఈ పగటి వేషాల లక్ష్యము. నేడు మరుగున పడిపోయిన ఈ కళారూపం ఒకప్పుడు కూచిపూడి కళాకారులచే హాస్య ధోరణిలోనే సామాజిక రుగ్మతలను దూరం చేసి సమాజ అభివృద్ధికి ఎంతగానో దోహద పడిందని చెప్పటంలో అతిశయోక్తి ఉండబోదు.

**సర్వ భావైః సర్వ రసైః సర్వ కర్మ ప్రవృత్తిభిః**
**నానా వస్త్రాంతరోపేతం నాటకం సంవిధీయతే**

నాటకాలలో లేని జ్ఞానం విజ్ఞానం ఏది వుండబోదు. నాటకం సామాన్యుల హృదయాంతరాళాలను సహితం స్పృశించ గలిగిన శాశ్వత ప్రక్రియ. లోకమునకు మూల ఆధారము ధర్మము. ఈ ధర్మాచరణమునకు ఆయువు ప్రధానము. అట్టి ఆయువునూ, బుద్ధి బలాన్ని పెంపొందించుకుని, నర్తకుడు లోకానికి సదుపదేశాన్ని అందిస్తున్నాడు. ధర్మాన్ని అనుసరించటం, దాన్ని నిలబెట్టటంద్వారా మానవుడు చతుర్విధ పురుషర్ధాలలో ప్రధానమైన ధర్మాన్ని నిలబెట్టిన వాడు కాగలుగుతాడు. ఈ మహత్తర కార్యంలో కూచిపూడి నర్తకులకు ప్రధాన ఉపకరణాలుగా నిలుస్తున్నవే ఈ కూచిపూడి నాట్య రూపకాలు. మి

డాక్టర్ భాగవతుల హేమలత
మాచవరం,
విజయవాడ.
ఫోన్ : 942437606



రఘుపతి వెంకటరత్నం నాయుడు

# రఘుపతి వెంకటరత్నం నాయుడు

– పతివాడ సూర్యనారాయణ

బ్రహ్మర్షి రఘుపతి వెంకటరత్నం నాయుడు, ఆచార్యులకు ఆచార్యులు. ఒకప్పుడు నాయుడుగారి శిష్యులని చెప్పుకోవడమే గర్వంగానూ, ఘనతగానూ ఉండేది. మాలాంటివారి అదృష్టం ఏమిటంటే వెంకటరత్నం నాయుడు కులపతిగా ఉన్న కాకినాడ పిఠాపురం రాజావారి కళాశాలలో చదవడం – వారి శిష్యులు మాకు అధ్యాపకులు కావడం. 'పంతులు గారు, నాయుడు గారు' నవ్యాంధ్ర నిర్మాతలుగా ప్రసిద్ధికెక్కారు. సాంఘిక సంస్కరణలుద్వారా వీరేశలింగం పంతులు గారు, భక్తి ప్రచారం – విద్యావ్యాప్తి ద్వారా వెంకటరత్నం నాయుడు, తెలుగు జాతిని ప్రభావితం చేశారు. ఈ శతాబ్దపు వేగుచుక్కలు వారే.

ఎప్పుడూ ధవళవస్త్రధారియై ఆజానుబాహుడైన నాయుడు గారు పాదుషావలె కనిపించేవారట. ఆ రోజుల్లో శిష్యులు ఎల్లవేళలా వారిని చుట్టి ఉండడంవల్ల "పిల్లలకోడి" అని నాయుడుగారిని పిలిచేవారట. వారి శిష్యులు మహాకవి కృష్ణశాస్త్రి గురుదేవా అంటూ అర్పించిన ఒక పద్యపాదంలో "సూఫీ చరితామృతమ్ము గురిపించెడు మా గురుదేవుడే లొకోత్తోంచు షరాయితో ఫగిడితో నెవరోయొక పాదుశాహిగా"

మరోశిష్యుడైన ప్రసిద్ధులు "కృష్ణాపత్రిక" సంపాదకులు ముట్నూరి కృష్ణారావు గారు వారి గురుదేవుని సంస్మరిస్తూ

*"మహాపురుష లక్షణములు, మూర్తివంతమైన*
*విగ్రహమది దాతృత్వముచే పొడుగు సాగిన, ఆజా*
*నబాహులవి; ఉదారాశయములకాశ్రమిచ్చుట*
*చే ప్రవర్ధమానమైన ఉన్నత వక్షస్థలమది*
*యోగనిద్రయందు ప్రజ్ఞాచక్రము నిరంతరము*
*పరిభ్రమించుటచే నునుపు బారిని విశాల ఫాల*
*తలమది : ఎట్టి గహనతత్వముల లోతులనైనను*
*జొచ్చుకొనిపోవు నేత్రయుగ్మమది – పర్వతశిఖరము*
*ను బోలి ఊర్ధ్వలోకములకు సోపానములు వేయ*
*గల దేవతావిగ్రహమది"*

వీరిరువకంటే వేరెవరు ఆ మహాపురుషుని గురించి చెప్పగలరు.

వారిపై యిరువురుకాక మరెందరో మహానాయకులు, కవులు, సంస్కర్తలు, పత్రికాధిపతులు, అధ్యాపకులు అనేకులు శిష్యులు. వారిలో డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్య నార్ల వెంకటేశ్వరరావు, పెద్దాడ రామస్వామి, తారకం, రఘుపతి వెంకటరత్నం నాయుడు, 1862 సం॥ అక్టోబరు 1 వ తారీఖున జన్మించారు. మచిలీపట్నం వారి జన్మస్థలం. వారి తండ్రి సుబేదార్ అప్పయ్యనాయుడు. సైనిక ఉద్యోగి. వారి తల్లి శేషమ్మ. వీరికి ఒక తమ్ముడు వారి పేరే రఘుపతి వెంకయ్య ఫోటోగ్రఫీలో ప్రఖ్యాతులు. తరువాత చలనచిత్ర పరిశ్రమకు ఆద్యులయ్యారు. అందుకే ఆంధ్రప్రదేశ ప్రభుత్వం ఆయన పేరుతో ప్రతి సంవత్సరం సినీపరిశ్రమకు చెంది ఉన్నత శిఖరాన్నందుకున్నవారికి పురస్కారం ప్రధానం చేస్తున్నారు. అన్నదమ్ములిద్దరూ వారివారి శాఖల్లో వైతాళికులైనారు. వారి చిన్నతనమంతా సైనికస్థావరాల్లో సాగింది. ఉత్తర హిందూస్థానంలో చదువుతున్నప్పుడు పర్షియన్, ఉర్దూ, హిందూస్థానీ భాషలు నేర్చుకున్నారు. అక్కడే బ్రహ్మ మత ప్రభావానికి బీజాలేర్పడ్డాయి. అక్కడే రాజా రామమోహన్‌రాయ్‌వైపు ఆకర్షితులై ఏకోశ్వరోపాసనవైపు మరలటానికి భీజాలేర్పడ్డాయి. అప్పలనాయుడుగారికి హైదరాబాదు బదిలీ కాగా అక్కడ శ్రీమతి సరోజినీ నాయుడు గారి తండ్రి గొప్ప విద్యావేత్త డా॥ అఘోరనాథ్ ఛటోపాధ్యాయ వద్ద విద్యనభ్యసించడం జరిగింది. తరువాత మదరాసు క్రైస్తవ కళాశాలలో ప్రముఖ విద్యావేత్త డా॥ మిల్లర్ ప్రిన్సిపాల్‌గా ఉంటూ నాయుడుగారి పదనిర్దేశికులా ఉంటూ వారిపై ప్రత్యేక శ్రద్ధ చూపేవారు.

ఇంగ్లీషులోని మహాకవులందరినీ ఔపోసన పట్టారు. మిల్టన్ వ్రాసిన 'పేరడైజ్ రిగైన్డు' మీద థీసీస్ తయారుచేసి పట్టభద్రులయ్యారు. తన మేధాసంపత్తితో ఉత్తమ విద్యార్థిగా పలువురి మన్ననలు పొందారు.

పండిత శివనాథశాస్త్రి గారి బ్రహ్మమత ఉపన్యాసాలు నాయుడు గారిని బాగా ఆకట్టుకున్నాయి. బ్రహ్మసాహిత్యాన్ని బాగా చదివి ఆకళింపు చేసుకున్నారు. బ్రహ్మసమాజం ద్వారా తన ఆధ్యాత్మిక జీవనాన్ని గడపటానికి పూనుకున్నారు. తలిదండ్రులిద్దరు వైష్ణవ మతస్తులు. తండ్రి అనేకసార్లు మందలించారు. గదిలోపెట్టి తాళంవేసి తిండికూడా పెట్టకుండా శిక్షించ చూసారు. అయినా నాయుడు పట్టువిడువలేదు. వారు నమ్మిన బాటలోనే నడిచారు.

ఆయన అధ్యాపక వృత్తినే చేపట్టారు. విద్యాగరుపుతూ యువకుల్ని మంచి పౌరులుగా, ఆధ్యాత్మిక చింతనతో తీర్చిదిద్దాలనేది వారి ధ్యేయం. అలానే చివరివరకు తన ధ్యేయాన్ని విడవలేదు. 1881లో 'బ్రహ్మప్రవేశిక' 'ఫెలోవర్కర్' పత్రికలను కూడా నడిపారు. బ్రహ్మమత ప్రచారంతోపాటు సామాజిక రుగ్మతపైన అస్పృశ్యతను, పడుపువృత్తిని ప్రతిఘటించారు. విధవావివాహాలను సమర్థిస్తూ వీరేశలింగంగారి ఉద్యమానికి తన మద్దతును ప్రకటించారు. వీరేశలింగం గారికి నాయుడుగారంటే ఎంతో అవ్యాజమైన ప్రేమానురాగాలు, హైస్కూలు ప్రారంభించడం లోను, ప్రార్థనా సమాజపు ప్రారంభంలోను, హితకారిణీ సమాజ స్థాపనలో నాయుడు గారి సహాయ సహకారాలు పొంది, వారిని భాగస్వాములను చేసేవారు.

1884లో బి.యే. మొదటి సంవత్సరం చదువుతుండగనే శేషమాంబగారిని వివాహమాడారు. ఆమె పతికి తగిన సతి. 1887లో వారికి ఒక పిల్లవాడు కలిగి వెంటనే చనిపోయాడు. మతభ్రష్టు కావడంవల్లే కుమారుడు చనిపోయాడని అందరూ అనుకోగా తండ్రి బ్రహ్మమతాన్ని విడిచిపెట్టమని పట్టుబట్టినా, భార్య, భర్తలిద్దరూ ఒక్కమాటమీద ఉండి, చివరకు తండ్రి గృహాన్ని విడిచి వెళ్ళవలసివచ్చింది. 1889 వారికి ఒక ఆడపిల్ల కలిగింది. కానీ భార్యమాత్రం మరణించారు. నాయుడు తరువాత పెళ్ళిచేసుకోలేదు. 50 సంవత్సరాలు కఠిన బ్రహ్మచర్యాన్ని అవలంభించి శ్వేతాంభరధారియై 'ఆంధ్రదేశపు శ్వేతాంబర ఋషి' అని పేరొచ్చింది.

వెంకటరత్నం నాయుడు గారు తాను ఉపాధ్యాయుడుగా ఉండాలనే కోరుకునేవారు. ఏలూరు సి.యం.యస్. హైస్కూలుకు కొంతకాలం హెడ్‌మాస్టర్‌గా పనిచేశారు. రాజమండ్రి థియస్టిక్ హైస్కూల్లోను, బందరు హిందూహైస్కూల్లోను ఉపాధ్యాయులుగా పనిచేశారు. 1891లో ఎం.ఏ. (లిటరేచర్) పట్టా పుచ్చుకొన్న తరువాత మద్రాసు పచ్చియప్పాస్ కాలేజీలో 1994లో బందరు నోబుల్ కళాశాలలోను, ఆచార్యత్వం సమర్థవంతంగా నిర్వహించారు. నోబుల్ కళాశాల ప్రిన్సిపాల్, సి.డబ్ల్యు.ఏ. క్లార్క్ నాయుడుగారి గురించి చెప్పిన మాటలు గమనార్హము. "విద్యార్థులపై నాయుడుగారి వ్యక్తిత్వ ప్రభావం ఎంతో బలవత్తరమైంది. అంత ప్రభావం కలిగిన మరో వ్యక్తినెవర్నీ నేను చూడలేదు" అన్నారు.

1899 నుంచి 1904 వరకు సికిందరాబాదులో మహబూబియా కళాశాలలో పనిచేశారు. బందరులో పనిచేసేటప్పుడు కొన్ని సంవత్సరాలుగా పాటు మునిసిపల్ కౌన్సిలు సభ్యులుగా ఉండి ప్రజలకెంతో సేవచేసి మన్ననలు పొందారు.

చివరకు పిఠాపురం రాజా కళాశాలకు ప్రిన్సిపాలుగా, రైట్ ఆనర్‌బుల్ శ్రీనివాసశాస్త్రి గారితో పోటీపడి రావడం ఆనాడు ఒక అపూర్వ సంఘటన. చరమదశలో వారు ఆ కళాశాల గురించి అన్న మాటలు చదివినపుడు మాకు ఒళ్లు జలదరించేది. "నా హృదయమునకు దిగువ అంగుళము చీల్చుడు, అక్కడ "పిఠాపురం రాజా వారి కళాశాల" అని లిఖింపబడి ఉండును". ఇది ఎంత గొప్ప వాక్కు! వారు ఎక్కడ పాఠము చెప్పుచున్నా ముఖ్యంగా షేక్స్పియర్ పాఠం చెబుతూ ఉంటే క్లాసు ప్రక్క వరండాలలో కూడా నిలబడి, ఇతర క్లాసు విద్యార్థులు ఆసక్తిగా వినేవారట.

విద్యారంగంలో నాయుడు ఎన్నో ఉన్నత స్థానాలు పొందారు. 1926-28 వరకు వారు మద్రాసు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్ష పదవిని అలంకరించడం చరిత్రలో పూర్వ విషయం. చెన్నపురి విశ్వవిద్యాలయానికి ఎన్నికైన ఉపాధ్యక్షుల్లో నాయుడుగారే, ప్రముఖ విద్యావేత్తల నుండి ఎన్నికైనవారిలో ప్రథములు. వైస్‌ఛాన్సలర్‌గా, ఎన్నో సంస్కరణలు తీసుకువచ్చారు. ద్రవిడ భాషలకు ఉన్నతస్థానమిచ్చారు.

నాయుడు గారు ఎన్నో పదవులను చేపట్టారు. రావు

బహద్దర్, దివాన్ బహద్దర్, సర్, కులపతి బిరుదులు ప్రభుత్వంనుంచి ప్రజల నుండి డి.లిట్., ఎల్.ఎల్.డి.లు విశ్వవిద్యాలయాల నుంచి పొందారు. వారి డెబ్బైయ్యో జన్మదినోత్సవంనాడు 'బ్రహ్మర్షి' బిరుదును కూడా పొందారు.

వారికి అత్యంత ఆప్తులైన పిఠపురం రాజావారిచే ఎన్నో భూరి విరాళాలు ఇప్పించారు. అనాథ శరణాలయము, బ్రహ్మోపాసన మందిరం వారి కృషివల్లే నిర్మించబడ్డాయి. రాజావారు వారికెంతో సహకరించారు.

ఒకసారి పిఠాపురం రాజవారు, ఏ సంస్థలకు దానం చేయాలో సూచించమంటే, నాయుడు 'అనాథ శరణాలయం' అన్నారట. వెంటనే రాజావారు, "తప్పకుండ. అనాథ బాలురంటే ఏమిటో నాకు తెలుసు" అన్నారట కళ్ళంట నీళ్ళుపెట్టుకుంటూ. పొన్నేరి స్టేషనులో కనబడ్డ నలుగురు అనాథ బాలికలను, మరికొందరిని తన బిడ్డలుగ పెంచి, పెద్దచేసి ఎంతో ఉన్నత విద్య పొందేటట్లు చేశారు. "మీరు లేనిచో వారేమైయుండేవారో" అని ఒక మిత్రుడనగా "వాళ్ళే లేకపోతే నేనేమైయుండేవాడను" అని జవాబిచ్చారట. "పొన్నేరి నా పుణ్యభూమి" అంటూ ఉండేవారట. వితంతువులను, అనాథలను, పతితులను తల్లివలె ప్రేమించి, ఆదరించిన ప్రేమమూర్తి. వారు ఎందరికో 'నాయన', 'తాతయ్య'. అట్టి మహనీయుడు 1939 సంవత్సరం, మే నెల 26వ తేదీన బ్రహ్మసాయుజ్యము పొందారు. యావత్ దక్షిణ ప్రాంతం దుఃఖసాగరంలో మునిగిపోయినది. కుల మతరహితముగా వారు ఊరేగింపుగా స్మశానవాటికకు చేరారు.

ఆ మహోన్నత వ్యక్తికి, పలువురు పెద్దలు నివాళు లర్పించారు. వాటిలో కొన్నింటిని స్ఫురణకు తేవడం వారికి మరొక్కసారి మన ముందు సాక్షాత్కరించుకోవడమే.

*"గురువులనేకులుందురు గురుదేవుడన్నడెన్నడో*
*యవతరించును, మానవుడు గురువర్యుడు కాగల*
*డు, ఋషియే గురుదేవుడు కాగలడు. ఏబది*
*సంవత్సరములభినాంధ్ర యువకులను, సత్యసాన్ని*
*ధ్యమున నిలువబెట్టిన సోక్రటీసు నాయుడు గారు"*

*"పురాణేతిహాసములో, పారశీక భక్తుల ప్రవచ*
*నములో షేక్స్పియర్, వర్డ్స్‌వర్త్, గెటి, కార్లైె, మిల్టన్*
*టెన్నిసన్, ప్యూడ్ మున్నగు పాశ్చాత్య ప్రవక్తల*
*విజ్ఞానమో, తన్మయులై వినిపించుతరి, ఎదురుగా*
*తేజస్తంభమువలె కన్పట్టెడివారు నాయుడు గారు"*

*"నాయుడుగారివలె ఆంగ్లమున ఉపన్యసించగల*
*వక్తులుగాని, వారివలె షేక్స్పియర్, నాటకములను*
*బోధించగల సమర్థులుకాని ఆంగ్లేయులలో*
*సహితములేరని ఆ దినములలో నాయుడుగారు*
*సర్వత్రా ప్రశంసింపబడిరి"*

ఇదేకాక వారి దాతృత్వము కూడా విశిష్టమైనదని వారి చేతికి ఎముక లేదని, గుప్తదానాలు చేశారని, విద్యార్థులకు పరీక్ష రుసుములు, భోజన వసతి ఖర్చులు, పేదవిద్యార్థులకు జీతాలు కట్టడం చేసేవారు. లక్షలాది సొమ్మునార్జించిన నాయుడుగారికి మిగిలిన ఆస్తి వేలాది మనియార్డరు రసీదులు మాత్రమేనట.

బ్రహ్మఋషి శత జయంతి ఉత్సవాలు 1962 అక్టోబరు 7వ తేదీని కాకినాడలో బ్రహ్మమందిరంలోను 22న సూర్యకళామందిరంలో వారి శిష్యప్రశిష్యులు జరుపుకున్నారు. 1965 అక్టోబరు 15వ తేదీన డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ అధ్యక్షతను హైదరాబాదు 'రవీంద్రభారతి'లో ఎంతో వైభవంగా జరిగింది.

తెలుగుజాతి ఉన్నంతకాలం వీరేశలింగంగా గారు నాయుడు గారు, చిరస్మరణీయులే.

* "పంతులు గారు ఆంధ్ర భాషాకోవిధులైతే, నాయుడు ఆంగ్లభాషావేత్త. పంతులు గారు ఒక వ్యాసధాటితో, నాయుడు గారు ఉపన్యాస ఝరితో ఆంధ్రజాతిని ప్రభావితం చేశారు. పంతులు గారు, ఝుంజామారుతమైతే, నాయుడు గారు మలయవీచిక. ఒకరు ధీనబంధువైతే మరొకరు, అనాథలకు తల్లి తండ్రి.



పతివాడ సూర్యనారాయణ
రాజమండ్రి.
ఫోన్ : 9849211500

## భారతదేశపు
# మరువబడిన మానవులు

*– వెన్నెలకంటి రాఘవయ్య*

మార్పురాని దేశ దిమ్మరులకు కూడా ఉనికిపట్టు అనేది ఒకటి ఉండగలదని మనం భావించేయెడల, అట్టిది దక్షిణాన పొన్నేరు, ఉత్తరాన కృష్ణకు మధ్య ఉన్న దేశమని చెప్పవచ్చు. ఇక తూర్పు బంగాళాఖాతము, పడమర వెలిగొండలు, ఒంటికి కాకపోయినా, కంటికైనా నీటిసమృద్ధిని నోచుకోని ప్రదేశము నీటికాకులవలె మునకలు వేయుచుండు యానాదులకు బొత్తిగా గిట్టని భూమి. అందుకనే మద్రాసు రాష్ట్రమందలి పొన్నేరు నది మందగమనంతో సంచరించే చెంగల్పట్టు జిల్లాలలోను, పెన్నేరు ప్రయాణించే నెల్లూరు జిల్లాలలోను, కృష్ణ ప్రవహించే కృష్ణ, గుంటూరు జిల్లాలలోను, యానాదులు కుప్పలుకుప్పలుగ కనపడుతుంటారు. తూర్పుకనుమలకు అవతల కడపల కర్నూలు జిల్లాలో కూడ కావళ్ళు కాచి జీవించే యానాదులు నివసించుతుంటారు కాని వారి సంఖ్య అత్యల్పం. మరేకారణంవల్ల కాకపోయినా చిత్తూరుజిల్లా, యానాదుల కులదైవమైన ఏడు కొండలవాని రాజధాని కాబట్టి, అచ్చట కూడ ఊరూర వీరు దర్శనమిస్తూనే ఉంటారు.

యానాదుల ఎడల విశేష అనురక్తి కలిగి వారికెన్నో సంఘాలను ఏర్పాటు చేసిన పోలీసు శాఖ ఉన్నతోద్యోగి కీ.శే. వి. సుబ్బారాయన్‌గారు 'ఇండియాదేశపు మరువబడిన మానవులు' అనే గ్రంథంలో యానాదుల స్థావరాన్ని గురించి దిగువ విధముగా వర్ణించారు.

"చిత్తూరుజిల్లాలోని సదాశివకోనలో కూడ చెంచులు ఉన్నారు కాని వారికి, కర్నూలుజిల్లా చెంచులకు ఎలాంటి సంబంధము లేదు. చెంచు, కొండదిగి యానాది అయినాడు ఇక్కడ. సదాశివకోనలో చెంచు అని పిలువబడే వ్యక్తి పుత్తూరు, కాళహస్తి ప్రాంతాలకు దిగబ్రాకేసరికి కప్పలయానాది అవుతాడు. కొన్ని సంవత్సరాల క్రిందట సదాశివకోన చెంచులు విల్లంబులను భుజాలకు తగిలించుకొని పోవుచుండేవారు. కొంతకాలం క్రిందట చెంచులు లంకమలల్లోను, వెలికొండల్లోను సంచరిస్తుండేవారు. క్రమేణ వారు సెట్టూరు కోస్తాకు చేరుకొని యానాదులతో కలసిపోయియుంటారు. కార్వేటినగరం చెంచులుకూడ చిత్తూరు చెంగల్పట్టు జిల్లాలకు చేరబారి ఇరుళలని, విల్లరులని పిలువబడుచుండిరి. ఈ ఇళ్లరులే (నల్లనివారు అని అర్థము) ఉత్తర ఆర్కాటు, శేలం జిల్లాలకు పోయి, అష్టపది లోయచేరి, క్రమేణా నీలగిరి వరకు వలసపోయుంటారు"?

నెల్లూరు జిల్లా యొక్క అతి పురాతన ప్రాశస్త్యాన్ని గురించి జిల్లా గజిట్ గ్రంథకర్తలు దిగువ విధముగా వ్రాశారు.

"ఇండియాదేశము యొక్క పాలియోలిథిక్ యుగంలో, అనగా క్రీస్తుకు పూర్వము 13 లక్షలు మొదలు 4 లక్షల సంవత్సరాల వరకు పురాతన మానవులు ఒరిస్సా మొదలు దక్షిణ ఆర్కాటుజిల్లా వరకు ముఖ్యంగా కడప, గుంటూరు, నెల్లూరు జిల్లాలలో ప్రవర్ధమానముగా జీవితాన్ని గడుపుచుండిరి. ఈ ప్రాంతంలో లభ్యపడు క్వార్ట్ జైట్ రాతితో వారు అనేక విధమైన పనిముట్లను, ఆయుధములను చేసుకొనుచుండిరి. ఈ వస్తువులు దొరికిన మట్టిదిబ్బలు, భూమియొక్క ప్రారంభ దశలోనివిగానే ఉన్నట్లు రుజువైనందున, వాటిని చేసిన ప్రజలు కూడ అట్టి కాలములోనే నివసించుచుండిరని అనుకొనవచ్చును. గుంటూరు, నెల్లూరు కోస్తా ప్రాంతాలలో హెచ్చుభాగము గట్టి బొంతరాతి భూమి. కృష్ణ ముఖద్వారము మొదలు నెల్లూరు మధ్యమ భాగము వరకు బ్రూస్‌ఫుట్‌గారు పరిశోధించినందున అమూల్యమైన చారిత్రక దాఖలాలు పై విధముగ లభ్యపడినవి. ఈ బొంతరాతి బండలు

మానవుడు ప్రథమంలో భూమిమీద అవతరించినపుడు యేర్పడినవేయని బ్రూస్‌ఫుట్‌గారి అభిప్రాయము. ఈ ప్రాంతంలోనే మొదటి మానవులు గూచిగా చెక్కబడిన రాతి కత్తులు, గొడ్డళ్ళు, రాతి ములుకులు, చిప్పలు, ఆయుధాలు అతి పురాతనమైన మట్టిదిబ్బలలో కూరుకొనియుండగా వెలుపలికి తీయబడినవి".

బ్రూస్‌ఫుట్ నెల్లూరు ప్రాంతాన్ని గురించి వ్రాసిన మాటలివి.

''కృష్ణ, గుంటూరు, తంజావూరు జిల్లాలలో, ముఖ్యముగ మొదటి రెండు మండలాలలో నేను చేసిన పరిశోధనల ఫలితముగా, బొంతరాతి కంకర దిబ్బలలో అతి పురాతనమైన అనగా 10 లక్షల సంవత్సరాలనాటి పనిముట్లు నాకు లభించినవి. నెల్లూరు జిల్లాలోని మన్నేరు ప్రాంతంలో చిక్కిన రాతిగొడ్డళ్ళకు కోడిగ్రుడ్డు ఆకారంలో చేయబడిన వెడల్పయిన, గూచిగానున్న చిప్పలు వుండినవి. గొడ్డళ్ళే కాక గూచిగానున్న రాతి బల్లెపు కొనలు రాతి కత్తులు కూడ కందుకూరు చుట్టుప్రక్కల లభించాయి. వీటినిబట్టి యా ప్రాంతపు మొదటి మానవులు మామూలు అవసరాలకు ఉపయోగించు రాతి పనిముట్లనే కాక రాతితో గాయపరుచుటకు విసిరివేయుటకు పనికివచ్చే ఆయుధములను కూడ యిక్కడివారు చేయుచుండిరని నిర్ణయించగలిగాను.''

*సీవెల్‌గారు పురాతన చరిత్రనుగూర్చి వ్రాసిన గ్రంథంలో నెల్లూరు గురించి తన విచిత్రమైన అనుభవాన్ని పొందుపరిచారు. ''నెల్లూరు పట్టణమును ఆనుకొని పారుతున్న పెన్నానదికి ఆనకట్ట కట్టుచుండగా యీ సంఘటన జరిగినది. ఆనకట్టకు బొంతరాతిని త్రవ్వుచుండగా ఆ సమీపంలోనే పొడుగైన, వెడల్పయిన పెట్టెలు తెల్లశంకురాతిలో బిగించినవి కంటబడినాయి. అవి కాల్చిన కుండ మట్టితో చేయబడినవి. మూతలు తెరువగా ఒక్కొక్క పెట్టెలో ఒకటికన్నా ఎక్కువ శవములు అందులో ఉండినవి. మూతలు తెరిచినపుడు శవాలు చెక్కుచెదరకుండ చనిపోయినపుడు కండలతో ఉన్నట్లే వుండినవి. చర్మము చెడనేలేదు. గాలి సోకిన తరువాత త్వరలోనే ఆ శవాలు పొడిగా మారిపోయినవి. ఈ శవపేటికలలో బల్లెపు రాతి ములుకులు, యితర పనిముట్లు కూడ వుండినవి. ఈ పనిముట్లు, ఆ శవాలు క్రీస్తుకు మునుపు 5000 మొదలు 3000 సంవత్సరాలకు పూర్వపువేయని అనగా నియోలితిక్ కాలానికి చెందినవని అభిప్రాయపడినాను. ఈ శవపేటికల విషయము మరే పరిశోధకుడు వ్రాసియుండలేదు.''*

సీవెల్ మరోమాటకూడ వ్రాశాడు నెల్లూరు జిల్లాను గురించి.

"ద్రావిడులకు మునుపు యిక్కడ నివసించుచుండిన ఆదివాసులు అనగా యానాది, ఎరుకల, చెంచు, దొమ్మర (ద్రిమ్మర) జాతులు, యిప్పటికీ యీ జిల్లాలలో హెచ్చుగా వుండడాన్నిబట్టి చూస్తే ద్రావిడులు యా ప్రాంతపు ఆదివాసులను ఓడించియుండలేదు కాబోలు. దక్షిణ ఇండియాలోని యితర ప్రాంతాలతోపాటు నెల్లూరు మండలంకూడ ద్రవిడుల వశమై యున్నట్లు యిచ్చట వాడబడే భాష తెలుపుచున్నది. వలస వచ్చినవారి సంఖ్య తక్కువైనందున యిచ్చటి ఆదివాసులు వీరిని ఎదిరించేటంతటి సాహసవంతులైనా అయియుండవలె, లేదా యీ జిల్లా పశ్చిమ ప్రాంతంలో వున్న తూర్పు కనుమల పర్వత శ్రేణికి వారు పరుగెత్తి అచ్చట తలదాచుకొనియైన ఉండవలె.''

అన్ని తెనుగు జిల్లాలోకి నెల్లూరులోనే యానాదుల సంఖ్య హెచ్చుగానున్నది. ప్రక్కగానున్న గుంటూరుకు కొంత దూరానవున్న కృష్ణాజిల్లాకు జీవనోపాధికి, బంధురీతిగా, యానాదులు డెల్టా పారుదల ఏర్పడిన పిమ్మటే పోయియుంటారు. గోదావరి జిల్లాలలోను గుంటూరు కృష్ణల్లోను వీరు కావలిగాండ్లు. చిత్తూరులోని తిరుపతి దేవుడు, కడప, కర్నూలు జిల్లాల్లోని అరణ్యములు వీరిని ఆకర్షించి యుండవచ్చు. గోదావరి యెగబ్రాకినవారు వీధులు చిమ్ముచు, మరుగుదొడ్లను శుభ్రపరచుచు జీవించు మున్సిపల్ నౌకర్లు.

చిన్న తరగతులలోని పాఠ్యపుస్తకాలలో యానాదుల జన్మస్థానము శ్రీహరికోటయని ఆ దీవినుండే ఆంధ్రప్రదేశపు అన్ని ప్రాంతాలకు వీరు చేరబారిరని వ్రాసిన వ్రాతలు కాళ్ళు లేని కట్టుకథలు.

3.59 కోట్ల జనాభా, 106286 చదరపు మైళ్ళ వైశాల్యముగల ఆంధ్రప్రదేశమునందు నివసించే షెడ్యూలు ఆదివాసి జాతుల సంఖ్య 33. వీరి పేర్లు చెంచు, కోయ, గోండు, భగత, గడబ, జాతపు, కమ్మర, కట్టునాయక, కొండదొర, కొండకాపు, కొండరెడ్డి, ఖోండు, కోటియ, బెంతొ

ఒరియ, కులియ, మాలి, మన్నెదొర, మూఖదొర, పొరజ, రెడ్డిదొర, రోన, సవర, సుగాలి, యానాది, ఎరుకల, అంధ్, భిల్లు, నాయకపోడ్, కోలం, పర్థాన్, తోటి, గౌడు, నాయక, వాల్మీకి. వీరి మొత్తం జనసంఖ్య 1961లో 13,24,368. వీరిలో అక్షరాస్యుల సంఖ్య 4.41 శాతం మాత్రమే. వీరు మాట్లాడే భాషలు గోండి, కొలామి, లంబాడీ, సవర, తెలుగు, ఒరియ, గదబ, కుయి, అరవము.

చెంచులు నివసించేది నల్లమల కొండల్లోను, మహబూబ్‌నగర్, నల్లకొండ జిల్లాలోని అమరాబాద్ పీఠభూమిలోను, కర్నూలు జిల్లాలోని శ్రీశైల ప్రాంతంలోను, మహానంది క్షేత్రములోను, గుంటూరు, చిత్తూరు జిల్లాల్లోను. గిరిజనులకున్న అడివి అధికారుల రాపిడి త్రోసిపుచ్చదగినది కాకున్నను, కుగ్రామాలలోని రైతుల బాధలు, పోలీసు ఉద్యోగుల ఒత్తిడి, క్రూరతరమైన పోటీజీవనము, కృంగదీసే నిరుద్యోగము, అమాయకులగు మానవుల ఆస్తులను అచిరకాలంలోనే అరగదీయకపోవు. ఇక ఆశ, అభివృద్ధికి వస్తామనే కోరిక, అసలే పుటమరించని దేశ దిమ్మరుల అస్థిర జీవితము దుర్భరమైనదే! వర్తమాన నాగరీకత, నాలుగు పంచవర్ష ప్రణాళికలు దేశంమీద కుమ్మరించిన 20000 కోట్ల కనకవర్షము, వీరిని తాకనైనా తాకలేదు. ఇల్లు వాకిలి లేని దేశ ద్రిమ్మరిని ఎవరుమటుకు ఎట్లు జాడ తీయగలరు? ఆపైన ఎట్లు ఆదరించగలరు?

లక్షల కొలది సంవత్సరాలనుండి అడవుల్లోను, కొండల్లోను నివసిస్తూ, రైలు కూతగాని, బస్సు మోతగాని వినని, బాహ్య ప్రపంచాన్ని చూడని ఈ అమాయకపు ప్రజలకు ఏది మేలో ఏది కీడో తెలియదని, అందువల్ల వారిని, వడ్డీ వ్యాపారుల, పెద్ద రైతుల, ముఠాదారుల పేరాన నుండి, వారి రాకపోకల సంబంధాలనుండి రక్షించవలెనని, 1855లో జరిగిన సంతాలు జాతి తిరుగుబాటు అనంతరం బ్రిటిషు ఇండియా ప్రభుత్వము నిర్ణయించింది. శ్రీకాకుళము, విశాఖపట్టణము, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, వరంగల్లు, ఖమ్మం, ఆదిలాబాద్ జిల్లాలోని విపిన భూములను ప్రత్యేకించి వాటికి "ఏజెన్సీ" అనే పేరు పెట్టినది. ఇప్పటికీ ఆ పేరు పోలేదు, ఆ స్థితి మారలేదు.

ఆంధ్రదేశపు ఆదివాసులను స్థూలంగా మూడు భాగాలుగ విభజించవచ్చు. (1) కొండ అడవి తెగలు, (2) పల్లపుభూముల ఆదివాసులు, (3) దేశ ద్రిమ్మరులు. వీరిలో భేదాలు లేకపోలేదు. కొండల్లోని గిరిజనులకు, ఆటవికులకు నాగరికత లోపడినా శరీరసౌష్ఠవము, ధైర్యము, కాయకష్టపు అలవాటు, ఆహారపుష్టి, సంఘాభిమానము, పరస్పర సహకారము, సంఘశక్తి, పౌరుషము, పట్టుదల, ఎంతమాత్రము లోపించవు. ఇందుకు 1922 నుండి తెలుగుదేశపు వివిధ ప్రాంతాలలో ముఖ్యముగ రంపచోడవరం, ఎల్లవరం, తాలూకాలో 1924 వరకు శ్రీ అల్లూరు శ్రీ రామరాజుగారి అమోఘమైన నాయకత్వాన ఉప్పెనవలె లేచిన తిరుగుబాటే తార్కాణం. పల్లపు దేశాల ఆదివాసులకు వేటవసతులు మృగ్యమైనందున పస్తులు తప్పవు. "రెక్కలాడినప్పుడే డొక్కలాడుతాయి" అన్న సామెత వీరి యెడల ముమ్మాటికి నిజము, అడవిరాజుల విచ్చలవిడి వీరికి లేనందున, హద్దులు, ఆటంకములు, హంసపాదులు, వీరికి కుప్పలు తిప్పలు.

ఏజెన్సీ ప్రాంతాలలో నివసించే ఆదివాసులు దాదాపు అందరు ఒకటిగానే ఉంటారు. ఆటవికులైనందున



మలేరియా తప్పని అనారోగ్యము. బాన కడుపులు, చీకిరికండ్లు, పాలిపోయిన శరీరాలు, చమురు సోకనందున ఎదుగని తలకట్లు, పల్లపు ప్రాంతంలో అదృశ్యమైనా, నాణ్యమని చెలామణి అవుతున్న బులాకులు, రవికెల నిర్బంధాలను సహించని వక్షోజములు, అంకమ్మ కుంకుమబొట్లు, మోకాలును దిగిరానొల్లని చీరె మడత గోచులు, తంగేడు వంటి అడవిపూలను చిక్కగా దురిమిన కోలకొప్పులు, అందాన్ని చందాన్ని అణగద్రొక్కగల కాలి అందెలు, వాటికి ఎంతమాత్రము బరువులో తీసిపోని కంచు మెట్టెలు, వంకీలు, చేత్రాడువలె నడుములు పట్టుకొని ముందుకు వెనక్కు కుడికాళ్ళు లేచి చూపుచు విసుగుబుట్టించు చౌకబారు నాట్యములు, పొడుగుమద్దెలలు, రంగురంగుల పూసలసరాలు, కండ్లు పొయ్యేటంతటి కాటుకలు, దూలాలు అచ్చిరాని పూరియిండ్లు, తలవంచి ప్రవేశించవలసిన ద్వారబంధములు, మిగతా హిందువులకు పూజనీయమైన కోతులను, కొండముచ్చులను, ఆవులను వదిలిపెట్టని ఆరగింపులు, చట్టిముక్కులు, పొట్టినొసళ్ళు, మిట్ట కనుబొమలు, ఎత్తుకణతలు వీరి ముఖ్య ఆదివాసీ లక్షణాలు. అరమరలేని అతిథిసత్కారము, హరిశ్చంద్రుని మరిపించు సత్యసంధత, కుచేలుని సిగ్గుపరుచు జీర్ణవస్త్రములు, ఈ కాలానికి ఎంతమాత్రము ఉపకరించని, పైగా ప్రమాదకరమైన, అమాయకత్వము వీరికి పెట్టని భూషణాలు.

ఏజెన్సీ ఆదివాసులైన కోయ, కొండరెడ్డి, సవర, జాతులు మామూలుగ శాంతియుతమైన జీవితాన్ని గడిపేవారైనను దుస్సహమైన నిరంకుశత్వాన్ని సుతరాం ఓర్చుకోరు. అప్పులపాలై విపరీత వడ్డీలు పెరిగి, స్వంత భూములను దిగుమతి అయిన పల్లపు ప్రాంతపు వడ్డీవ్యాపారులకు తాకట్టుపెట్టి నాదారులు కావడమే ఏజెన్సీ ఆదివాసుల ప్రథమ, ఆఖరు సమస్య. ఇదే వారి పురోభివృద్ధిని అడ్డగించే చెలియలికట్ట. కొండరెడ్లు ఇటీవలి వరకు చాటుమాటుగా నరబలులను అర్పించుచుండిరని హైమన్‌డార్ఫ్ గారి అభిప్రాయం. జీలుగు, విప్పకల్లులో నిరంతరము మునిగితేలడమే వారి నిద్రాణస్థితికి ఒక కారణము. సివిలు, క్రిమినల్ తగాదాల పరిష్కరణ, గ్రామపెద్దల చేతులమీదనే జరుగుచుండును. మన కోర్టులకు వారు ప్రాధేయపడినా రారు. ఈ పద్ధతిలో కీడు, మేలు కూడ లేకపోలేదు. పల్లపు ప్రాంతాలలో భూమిదున్ని, ఎరువువేసి, కలుపుతీసి, వరి మొదలగు నీటిపారుదల పైరులను పండించినట్లు ఏజెన్సీ ప్రజలు సాగుచేయరు. అడివిని నరికి, తగులబెట్టి, నుశిని వెదజల్లి, గూచికొయ్యలతో కలుగులుచేసి, విత్తనాలను జారవిడిస్తే వర్షానికి మొలిచి మూడు సంవత్సరాలవరకు మంచి పంటలను అందించే "పోడు" సాగే వారికి తాతలనాటి నుండి వీరికేకాక దేశమందలి అనేక ఆదిజాతులకు అలవాటైన ఆచారము. "భూదేవి గర్భాన్ని అరకబెట్టి చీల్చిన పాపాన్ని ఒడిగట్టుకోమంటావా?" అన్న ఏజెన్సీ ప్రజల ప్రశ్నకు అడ్డేలేదు; కొంతకాలము నుండి వీరు నవీన పద్ధతులను నేర్చుకొన్నప్పటికి ఒడుదుడుకులతో నిండిన అసమప్రదేశ వాసులకు పోడు తప్పనిసరి అయినది. ఆ ప్రదేశపు గోండులు, కోలములు, నాయక్ పోడులు, కోయలు పల్లపు సేద్యాలను ఇప్పుడిప్పుడు నేర్చుకొనుచున్నారు.

భగతలు, సవరలు, గదబలు, ఖోండులు పోళ్ళు కొట్టుకొంటూ దున్నకాలను కూడ అలవరుచుకొనుచున్నారు. నల్లమల చెంచులు గడ్డలను త్రవ్వుకొని తింటూ వన్యమృగాలను వేటాడుతూ, ఆకులు అలములను భుజిస్తూ సేద్యం ఎటువంటిదో ఎరుగక, వేలకొలది సంవత్సరాల ప్రాచీన స్థితిలోనే ఉన్నారు. సవరలు, జాతపులు ఏటవాలు ప్రదేశాల్లో చిన్నచిన్న కొండయేళ్ళకు ఆనకట్టలు కట్టి పైరులకు నీటిని మళ్ళించుకొనుటలో నేర్పరులైనారు. మన్ను కరిగిపోకుండునట్లు గట్లు, గనిమలు నిర్మించు పని వారికి కరతామలకము. వివిధ రకములైన అపరాలు కాయ ధాన్యములు, చిక్కుళ్ళు, కాఫీ, ఉర్లగడ్డలు పండించుచున్నారు. అరకులోయలో నారింజపండ్లు కూడ విరివిగా కాయుచున్నవి. అడవులలోని చెట్ల ఫలితము దాదాపు అంతా వారి అనుభవమే. శీకాయ, చింతపండు, తేనె, చిరోంగి, పిప్పళ్ళు, అడ్డ ఆకులు, నైగర్ కుంకుళ్ళు, కరక్కాయలు, ఆదివాసులపరమే చేయబడినవి. వెదురు బొంగుల నరుకుడు కూడ అడవిజాతులకే అప్పగించబడింది. బొగ్గుగనులున్నచోట చాలామంది జీవనము సాగించుచున్నారు. ఈ నడుమ దండకారణ్యముద్వారా నిర్మించబడిన బైలదిళ్ళ – విశాఖపట్నపు రైలు మార్గ నిర్మాణము వేలకొలది అడవిజాతులకు పనులు కల్పించినది. బాహ్య ప్రపంచాన్ని కండ్లుకు కట్టినట్లు

చూపించినది. భగతలు గోలుకొండ రాజులకు సిపాయిలుగా పనులు చేయుచు, స్వామి భక్తిని కలిగియుండినందున ఆ పేరును సార్థక పరుచుకున్నారు. గదబల బట్టలనేత నేర్పరితనము మెండు. పెండ్లిపీటపైన ధరించవలసిన మధుపర్కపు చీరె నేయుగల్గినప్పుడే గదబ వధువుకు వరుడు లభ్యపడడం. పూర్వపు రాజుల పల్లకీమోతగాండ్లే గదబలు. కమ్మరులు ఇనుప పనిముట్లు చేసేవారు. జాతపులు శ్రీకాకుళం జిల్లాలోని పార్వతీపురం, సాలూరు, పాలకొండ తాలూకాలలో విస్తరముగ నివసించుచుందురు. కోలములకు ఆదిలాబాద్, వరంగల్ జిల్లాలు ఉనికిపట్టు. వీరందరు పోడు సాగువల్లనే జీవిస్తారు.

కోయలను, తూర్పు, పడమర గోదావరి జిల్లాలలోను, వరంగల్, ఆదిలాబాద్, ఖమ్మం జిల్లాలోను కరీంనగర్ ప్రాంతాలలోను విస్తారముగా చూడవచ్చును. పోళ్ళే వీరికి జీవనాధారము.

కొండరెడ్లలో పెద్ద, చిన్న అని రెండురకాలు. మొదటి తెగకు చెట్లు, అడవిజంతువుల పేర్లే ఇంటి పేర్లు. రెండవ తెగవారు తెలుగు ప్రజల ఇంటిపేర్లనే పెట్టుకొంటారు.

వేదాల్లోను, పురాణాల్లోను వర్ణించబడిన రాక్షసులు, కిరాతులు, నిశాచరులు ఆదివాసులే. వారికి రాజులు, రాజ్యాలు, సైన్యాలు లేకపోలేదు. మహాభారత యుద్ధములో పాండవ కౌరవుల పక్షాన యుద్ధమొనర్చిన దక్షిణాది సేనలో కుకర, అంధకజాతులుండినట్లు భారత ప్రమాణముకాబోలు. భారత కుకురులు నేటి అస్సాంలోని కుకినాగాలు, అంధకులు బహుశా ఆదిలాబాదు జిల్లాలో కొలదిగాను (1468 మంది), ఆనుకొని యున్న నేటి మహారాష్ట్ర ప్రదేశములో విరివిగాను ఉన్నారు. నేటి ఆంధ్రులు నాటి అంధులనే పేరు కలిగియుండవచ్చు. వి.పి. విల్‌సన్ ఊహించినట్లు, రామాయణ కాలపు రాజులు వాలి, సుగ్రీవుడు, అంగదుడు వారి అనుచరులు జాంబవంతుడు, లంకకు వారధిని నిర్మించిన ఇంజనీరు నీలుడు, సుగ్రీవుని సర్వసైన్యాధిపతి హనుమంతుడు, శ్రీకృష్ణుని మేనమామ కంసుడు, పెండ్లిమామ, అప్పటి కామరూప (నేటి అస్సాంలోని) రాజు, కుండినపుర (నేటి భీష్మక్‌నగర్) భీష్మకుడు, కృష్ణుని వియ్యంకుడు బాణాసురుడు (అతని కూతురు కృష్ణుని కుమారుడు అనిరుద్ధుని భార్య ఉష) ఆర్యులను ఎదిరించిన బకాసురుడు, మైసూరు ప్రాంతంలో ఆర్యులతో పోరిన మహిషాసురుడు, గోదావరి ప్రాంతంలో రాజ్యమేలుచుండిన దండకాసురుడు, హిరణ్యాక్షుడు, హిరణ్యకశ్యపుడు, రావణుడు, విభీషణుడు వీరందరు అలనాటి ఆదివాసుల రాజప్రముఖులే. అసుర, రాక్షస అనే పేర్లు విరోచితమైనవేయని ప్రాచీన పురాణాలు కావ్యాలలోని ప్రయోగములనుపట్టి నిర్ధారణ చేయవచ్చు. శ్రీరాముని ఏలుబడి నాటికి స్వదేశవాసులైన ఆదివాసులకు, వీరిని ఓడించి వీరి భూములను ఆక్రమించుచుండిన ఆర్యులకు తీవ్రమైన మనస్పర్థలు పెరిగియుండినప్పటికి క్రమేణ శ్రీకృష్ణుని రాజ్యకాలమునాటికి ఇరువురికి స్నేహభావము పెరిగి, వైవాహిక సంబంధాలు ఏర్పడి, స్వదేశస్తులు విదేశస్తులు ఒకే ప్రజగా పెనవైచుకోసాగిరనుటకు సందేహములేదు. అసుర శబ్దముయొక్క ప్రయోగం పురాణాలలో, కావ్యాలలో ఎట్లు ఉన్నదో పరిశీలించిన వెరియర్ ఎల్విన్ వ్రాయడంలో వీరుడు అనే అర్థంలో 142 సారులు, క్రూరుడు అనే అర్థంలో 42 పర్యాయములు వాడబడినదని అభిప్రాయపడినారు. ఆనాటి పురాణాల్లోను, నేటి వీధి హరికథల్లోను, బొమ్మలాటల్లోను వికారముగ చిత్రింపబడే అసురులు, రాక్షసులు, అందవిహీనులు కారని, పిరికివారు కారని, వారికి దైవభక్తి, నీతి లేకపోలేదని యుద్ధభూమిలో శ్రీరామచంద్రుడు రావణుని గురించి వర్ణనే రుజువు పరచగలదు. సురులు (ఆర్యులు) కానివారందరు సంస్కృత భాషలో అసురులైనారు.

ఇక రాక్షస పదానికి క్రూరత్వము, పశుత్వము, హేయమైన మనస్తత్వము అంటకట్టబడలేదని, చంద్రగుప్త మౌర్యచక్రవర్తికి, ప్రఖ్యాత నవనందులనే చక్రవర్తులకు మహామంత్రిగా నుండిన రాక్షసుడు (ముద్రారాక్షసము) రాజనీతి కోవిదుడు, ధీశాలి, ప్రభు భక్తి పరాయణుడని చాణక్యుని ప్రశంసే చాటుచున్నది. ఈ రాక్షసుల వేషభాషలు కొంతవరకు అనాగరిక చిహ్నములై, ఆర్య కవీశ్వరులకు ఏవగింపు కలిగించి, విరోధ భావం వల్ల వ్యంగ్యంగా వారి గ్రంథాలలో వర్ణింపబడినంత మాత్రాన వారికి దుష్టత్వాన్ని ఆరోపించుట అన్యాయము. రాక్షసులను గురించిన వర్ణనలన్నీ నిజమే అయినట్లయితే, రుక్మిణి, సత్యభామ, మందోదరి, లీలావతి, ప్రహ్లాదుడు, విభీషణుడు అతి గౌరవస్థానాలను ఎట్లు పొందగలిగి యుండిరి? మేనల్లుడు కృష్ణుడు సురుడు అయినప్పుడు మేనమామ కంసుడు

అసురుడు ఎట్లు కాగలడు? కృష్ణ శిశుపాలురు సన్నిహిత బంధువులైయుండి సురాసురులు ఎట్లు అవుతారు? ఆ కాలంలో అమలులో ఉండిన ఆచారాన్నిబట్టి విజయులు పరాజితుల ఆస్తిపాస్తులనేకాక వారి స్త్రీలనుకూడ చేపట్టుచుండిరి. అందువల్ల సురులకు వైవాహిక సంబంధాలు ఏర్పడినవి. విరోధాలు సన్నగిల్లినవి. భారతజాతి యైక్యతను కోడిగుడ్డ కట్టబడినది. రాక్షసులనబడినవారు హెచ్చుగా శివభక్తులైరి. విష్ణుభక్తులైన ఆర్యులను తూలనాడుచుండిరి. ఇప్పటికి శక్తిపూజ అందరు ఆదివాసులయొక్క ఎన్నదగిన లక్షణము. నేఫా ప్రాంతంలోని కిరాతులుకూడ పౌరాణిక ప్రశంసను పొందినవారే!

పాఠ్యపుస్తకాల అపక్వ గ్రంథకర్తలు వ్రాసినప్పటికి శ్రీహరి కోట యానాదులకు పురుడుపోసిన ద్వీపముకాదు. ఈ ద్వీపము పొడవు 35 మైళ్ళు. వెడల్పు 6 మొదలు 3 1/2 మైళ్ళవరకు. నెల్లూరుజిల్లా దక్షిణ భాగాన సూళ్ళూరుపేట, తడ, కోస్తా గ్రామాలకు ఎదురుగా 18 మైళ్ళ దూరాన ఉత్తర దక్షిణముగా సాగియున్న ఈ ద్వీపం ఎప్పుడు ఏర్పడినదో చెప్పలేము. దీనికి ఆనుకొనియున్న విశాలమైన పులికాటు సరస్సు పేరునుబట్టి ఒకప్పుడు అరణ్యమయమై పులులకు ఆశ్రయమిచ్చుచుండెనని భావించవచ్చు. నెల్లూరు కోస్తాకు దీనివి మధ్యనున్న సముద్రము లోతు 5 అడుగులు మొదలు 8 వరకు ఉండును. ఇచ్చటి యానాదుల సంఖ్య 1390కి మించదు. మొత్తం జన సంఖ్య 1142 (1961), ఇరకం, వేనాడు, కొరడి, అటగానితిప్ప ద్వీపాలు, శ్రీహరికోట ద్వీపము కలిసి 18 గ్రామాలు, శ్రీహరికోట ఫిర్కాగా ఏర్పడినవి, వీనిలో వేనాడులో 143, దొరవారిపాలెంలో 521, బేరిపేటలో 336, రెట్టమాలలో 74, చెన్నుగారి పాలెంలో 64, కలవాంగులో 44, చెంగలపాలంలో 22, కడపట్రలో 29, దామరాయలో 7గురు యానాదులు కాపురమున్నారు.

ఈ చిన్న ద్వీపానికి సముద్రాలను దాటి ఎచ్చటినుండో వీరు వచ్చారనుకొందామా, యానాదులకు సముద్రమంటే మహాభయము. పోనీ నెల్లూరు జిల్లానుండి అచ్చటికి తరలిపోయినారనుకుందామా ఇంతటి నిస్సారమైన ఇసుక సముద్రంవలె వెల్లివిరిసిన ద్వీపము మరొకటి ఉండదు.

తప్పులు చేసిన సర్కారు గుమస్తాలను ఇక్కడకు మారుస్తూ వున్నందువల్లనే ఈ ద్వీపము పేరు ప్రజలకు ఎరుక. ఇట్టి మార్పుకు లోనైన ఒకానొక అభాగ్యుడు ఆక్రోశాన్ని పట్టజాలక దిగువకథను కల్పించి ప్రసారంలో వదిలివేశాడు. "శ్రీరాములవారు అరణ్యవాసం చేసేటప్పుడు శ్రీహరికోటకు దారితప్పి వచ్చాడట. ఈ ఇసుకలో పాదం పెట్టినాడో లేదో అప్పుడే సీత నిద్రలోనుండి లేచిన గయ్యాళివలె ఎదురు తిరిగి "రాజకొమార్తెను నేను, నీకు బట్టినగతి నాకెందుకుబట్టిందయ్యా? సుఖపడుతుందని మా తండ్రి నీకు కట్టబెట్టాడుకాని అడవుల్లో తిప్పుతావని కాదు" అని గొణుక్కుంటూ ఒక కాలుదారిన వెంబడించి అంతర్ధానమైనదట! అంతవరకు అన్న మాట జవదాటని లక్ష్మణుడు అన్నగారి పావుకోళ్ళు నేలబడవేసి "నాకేమి ఖర్మ వచ్చిందయ్యా నీ పాదరక్షలను మోయడానికి? నీవు పుట్టినట్లే నేను కూడా మా తల్లి గర్భావాసాన పుట్టలేదా?" అని విసుగుకుంటూ మరొక త్రోవలోకి నడిచివెళ్ళినాడట.

శ్రీరాములవారు ఇదంతా చూసి నివ్వెరపడి ఇసుకలో నడువజాలక తన పాదరక్షలు తానే చేతబట్టుకొని ఉసూరంటూ నెమ్మదిగా ప్రయాణం సాగించారట. కొంతసేపటికి శ్రీహరికోట అవతల పడవరేవును ముగ్గురు ఒకే సమయానికి చేరుకున్నారు. పడవవాడు భక్తిభావంతో శ్రీరామునికి ఎదురేగి ఆదరంతో పడవనెక్కించుకొని ఇంతలో అక్కడికి చేరిన సీతమ్మ, లక్ష్మణుని అదేవిధముగా సత్కరించాడట! చిన్నబోయిన లక్ష్మణుడు పాదరక్షలకు మళ్ళీ నమస్కరించి చేతపుచ్చుకొని నెత్తిన పెట్టుకొని పశ్చాత్తాపాన్ని తెలియపరిచాడు. నిరుపమాన పతివ్రత, లోకమాత, సీతమ్మ వంచిన తలను ఎత్తలేక పమిట చెంగుతో లోకపాలకుడైన ప్రియుని నొసటిపై చిందులు త్రొక్కుచున్న చెమ్మట ముత్యములను తుడుచుచు, కన్నీరు కార్చుచుండినదట.

ఇంతలో వీరి స్థితిని శ్రద్ధగా గమనించుచుండిన పడవ సరంగు చిరునవ్వు నవ్వి "స్వామీ! మోటుగాణ్ణి. ఒక మాట చెపుతా యినండి. ఇందులో మీలో ఎవరి తప్పు ఎంత మాత్రము లేదు. ఇదంత పాడుగడ్డ దినుసు. పూర్వం ఎప్పుడో చెల్లెలు శూర్పణఖకు పెండ్లిసమయములో రావణాసురుడు పసుపు కుంకుమలకుగా యీ గడ్డను యిచ్చాడట! తిన్నగా దాటారుగదా ఇక పరవాలేదు. నేను తెచ్చిన నాగుజెముడు పండ్లు, బీర పండ్లు, కలేపండ్లు, పాలపండ్లు, పప్పు తినండి. ఈలోగా తేగలను తంపటి వేస్తాను. బురగుంజుకూడ పెడతాను అని ఆ అపూర్వ

కుటుంబాన్ని శక్తి వంచన లేకుండా ఓదార్చాడట.” ఇది జరిపించవలసిన అజమాయిషీలు జరిపించినట్లు, తప్పుడు బత్తాబిల్లులు వ్రాసి చేయని ఆక్రమణలు చేసినట్లు, చేసిన సాగు చేయనట్లు పుట్టలు పుట్టలుగా తప్పులు వ్రాసి, చీటికి మాటికి చేయిస్తూ, కావలసినన్ని చీవాట్లుతిని, కడకు శ్రీహరికోటకు బదిలీ చేయించబడిన పిల్లకారు, పెండ్లి కాని వికటకవిత్వంలో బ్రహ్మకాయ అయిన ఆ రెవెన్యూ ఇన్‌స్పెక్టరు అల్లిన కల్లబొల్లి కట్టుకథ. లేకుంటే శ్రీరామచంద్రమూర్తి ఎక్కడ? శ్రీహరికోట ఎక్కడ? చెప్పండి. శ్రీహరికోట యానాదుల అతి పురాతన స్థితిలో ఉండినది వాస్తవము. ఈ గ్రంథకర్త, పేదల పెన్నిధి అయిన కీ.శే. ఆర్.యస్. మలయప్పన్‌గారు (కలెక్టరు) 1953 మే నెలలో ఈ ద్వీపానికి వెళ్ళినప్పుడు ఫారెస్టుశాఖవారు అచ్చటి యానాది కూలీలను గుత్తగానుంచుకొని స్త్రీకి 0-12-0, పురుషునికి 1-80 వంతున దిన కూలి యిచ్చుచుండిరి, కంట్రాక్టరులు ఇబ్బడిగా కూలీలు ఇచ్చుచు ఉన్నప్పటికి, వారితో కూడ పనిచేసే బాలురకు ఏ కూలిలేదు. భారవైన ట్రాలీబండ్లు లాగవలసినప్పుడు కంట్రాక్టరు కూలి 6 రూపాయలు వరకు పెరిగేది. యానాదుల వివాహాలకు అడివి ఉద్యోగుల అనుమతి ముందుగా పొందితీరవలెను. అప్పటి వరకు యానాదులు రాత్రింబగళ్ళు ఆరుబయటనే చెట్లక్రింద నివసించేవారు. ఎక్కడ అడవి నరుకుడు జరిగితే అక్కడికి ఇంటిల్లిపాది తరలిపోతుండేవారు. మోకాలువరకే చాలిచాలని వస్త్రములను కట్టుకొని, తలచమురు ఎటువంటిదో ఎరుగని చిట్టుతల వెంట్రుకలతో అందవిహీనముగ పశుప్రాయులై యుండేవారు. కడకు చెట్లు ఎక్కుటకు కూడ వారికి తెలియకుండెను. కట్టెనుసి చింతపండు కలిపిన ముద్దలను ప్రతిదినము ఆరగించేవారు.

శ్రీహరికోటలో పాలు యియ్యని, కట్టుముట్టకురాని పశువులు మెండు. ఇవి ఎవ్వరికి ఆస్తిగా గణింపబడవు. అడవి మృగాలు సముద్రాన్ని దాటనందున వాటికి భయము మృగ్యము, కాని వీటికి పిచ్చినక్కల కరువువల్ల ఏటేట చావులు తప్పుటలేదు. మంచువంటి అతి శీలమైన బీరువాలలో ఔషధాలను పెట్టి కాపాడే ఏర్పాట్లు లేనందున ఈ మరణాలను తప్పించలేకుండుట విచారకరము. రైలు కూత వినని, ద్వీపాన్ని దాటి బాహ్య ప్రపంచాన్ని కనని యానాదులు అనేకులున్నారు ఈ దీవిగడ్డలో. వారికి కనబడే ప్రభుత్వమంతా అడివి ఉద్యోగులే. 1835లో మొదలు ఈ ద్వీపము తూర్పుఇండియా కంపెనీ స్వాధీనమైనది. 1864లో దీవిని గూర్చి వ్రాసిన డాక్టరు జాన్‌షార్ట్ ఇచ్చటి యానాదులను చదివించుటకై, అడివిఫలితాన్ని వారికి అప్పగించుటకు మద్రాసు ప్రభుత్వము చేసిన మంచి ప్రయత్నాలను గురించి విస్తరించారు. మెకన్‌జీ వీరిని గురించి యిలా వ్రాశారు.

“రాఘవుడనే నాయకుడు చెంచులు విశేషముగా నివసించు కర్నూలు ప్రాంతంనుండి కొన్ని వందల సంవత్సరాల క్రిందట 60 యానాది కుటుంబాలను తీసుకొని శ్రీహరికోటను చేరి రాఘవపురం అనే పేరుతో ఒక గ్రామాన్ని నిర్మించాడు. క్రమేణ వీరి జనసంఖ్య పెల్లుగా పెరిగి దీవినంతటిని ఆక్రమించి అంతటితో ఆగక కోస్తాజిల్లాలకు కూడ ఎగబ్రాకినారు. అంబికేశ్వరుడనే ఋషి కృష్ణానదికి దక్షిణ దేశానికి వారణాసి నుండి వచ్చి ఈ దీవిలో ఆశ్రమాన్ని ఏర్పరచికొనియుండెను. ఆయనకు యానాదులు అడివిపండ్లను, తేనెను తెచ్చి యిచ్చుచుండిరి. ఒకనాడు ఋషి ప్రశ్నించగా తమ ఉనికిపట్టులో ఒక బ్రహ్మాండమైన సర్పము ఉండినదనియు దానిని సంహరించే ఉపాయము ప్రసాదించవలెననియు కోరగా ఆ ఋషి తగిన సలహాలను ఇచ్చి కొన్ని మంత్రాలను ఉపదేశించి స్వస్థానానికి వెడలిపోయెను.” ఈ కథ ఎంతవరకు నిజమైనను 60 మంది యానాదులు ఆంధ్రదేశపు కోస్తాను ఆక్రమించి నేటికి రెండు లక్షలుగా పెరిగినారనే వాదము చెల్లనేరదు. ఇప్పటికీ శ్రీహరికోటలో ఒక పాముపుట్ట దానికి పూజచేసి ఒక యానాది కుటుంబము ఉన్న సంగతి మాత్రము నిజము.

శ్రీహరికోటలో శ్రీహరిగాని, కోటగాని సుతారాం లేవు. ఈ పేరు ఎందుకు వచ్చిందో ఎవరికి తెలియదు. ద్వీపములో కలపకు పనికివచ్చే మానులు సున్న. మద్రాసుకు వంటచెరుకుకు పనికివచ్చే చౌకచెట్లు, ముష్టిచెట్లు విస్తారము. ఇదివరలో విరివిగా పెరుగుచుండిన నారింజ, మునగ, మామిడిచెట్లు ఇప్పుడు కలికానికి కూడ కనపడవు. 8వ శతాబ్దంలో అరేబియా నుండి వచ్చినట్లు చెప్పుకుంటూ కప్పా అనే గ్రామంలో పడవలు కట్టి అమ్ముకొనే అరబ్బులను కొందరిని చూడవచ్చు. నిర్మానుష్యం కాకపోయినా అతి తక్కువ జనసంఖ్య ఉన్నందున ఆటంబాంబులు, రాకెట్లు చేయుటకు అతి అనుకూలమైనదని ఇటీవలనే ఇండియా

ప్రభుత్వం నిర్ణయించినది. రెండు మూడు వందల కోట్లు ఇక్కడ ఖర్చు అయితే కావచ్చుకాని ఉన్న జనంలో చాలమంది తల్లిగడ్డయైన నెల్లూరు మండలానికి చేరుకోవడం తథ్యం. ఇటీవలనే మొదటి రాకెట్ కూడ ప్రేల్చారు.

1861 సంవత్సరంలో కంపెనీ ప్రభుత్వము, అడివి చిల్లర ఫలితంవల్ల వచ్చే ఆదాయాన్ని యానాదుల సంక్షేమ నిధికే వినియోగించ, నిశ్చయించినది. కూలీలు హెచ్చించినది, పాఠశాలను ఏర్పరచినది. 1909వ సంవత్సరంలో "దక్షిణ భారతము యొక్క కులాలు జాతులు" అనే గ్రంథమాలను శ్రద్ధతో రచించిన ఎడ్గార్‌తర్‌స్టన్ అను మద్రాసు మ్యూజియం ఉద్యోగి యానాదులను గురించి యీ విధముగా పొందుపరిచారు.

''యానాదులు పులికట్ సరస్సులో చేపలు పట్టుకుంటూ విచ్చలవిడిగా వేటాడుతూ సంచరించు చుండేవారు. కాని రెడ్లు వారిని బానిసలుగా చేసి వారి స్వేచ్ఛను అణచివేశారు.'' గ్రామాలలో యానాదులకు గౌరవస్థానమున్నదని ఎవరు అనుకోరు. వారియెడల వైరుధ్యము కాని, నిరాదరణకాని ఎక్కడ కనిపించదు. గ్రామ పెత్తనంలోగాని, గ్రామసంస్థల పోకడలోగాని, కులతీర్పుల్లోగాని, ప్రభుత్వ సంబంధమైన బాధ్యతగల వ్యవహారములలోగాని వీరికి జోక్యము ఉండదు. హరిజనులకు, పనిపాటలవారు అని పిలువబడువారు సంఘ నౌకర్లకు ఉండే హక్కులు మొగమోటాలు, చౌరవలు, మర్యాదలు వీరికి లేనేలేవు. గ్రామ జీవితంలో వీరికి కూడ ఒక భాగమున్నదని అనుకొనేవారు ఉండరు. అంతమాత్రాన వీరిని నీచముగా సంఘము చూస్తుందని అనుకోవడం గొప్ప పొరపాటు. "యానాదులు పసిరికపాములవంటివాండ్లు, వాండ్లనెందుకురా దండించబోతావు?" అనే అభిప్రాయం ప్రతివాని నోట వినబడుతూనే ఉంటుంది. "పాపం తిట్టితే నవ్వుతారు; కొట్టితే దెబ్బలు తింటారు" అన్న నానుడి తెనుగుదేశములోని ప్రతి ఊర అనుకొనే మాటే.

యానాది అనే పేరు తిట్లలోను, కొట్లాటలోను అనుకొనే నీచసూచకమైన దూషణ కాదు, కొందరు అల్పసంఖ్యాకులైన పనిపాటలవారినన్నట్లు. కలుగక, కలుగక సంతానం కలిగితే ధనవంతులు కూడ అట్టిబిడ్డలను పులి ఆకులలో ('పై' కులస్థులు తిని పారేసిన విస్తళ్ళలోని అన్న శేషాన్ని ఆరగించే చల్ల లేక కప్పల యానాదుల ఆచారము) పొర్లించి, అట్టి బిడ్డలు ఆరోగ్యముగా కలకాలము జీవించుటకై కాబోలు వారికి యానాదయ్య, యానాదిరెడ్డి, యానాదమ్మ అనే పేర్లు పెట్టుకొనే అలవాటు నేటికి కలదు. యానాదులు అల్పసంతోషులు. అరమరలేని అమాయకులు, కుడుము చేతికిస్తే పండుగ అనుకొనే ఛాందసులు. తెలివితక్కువ ప్రసంగాలను యానాదిచేష్టలని హేళన చేయడం పరిపాటి. చీకు చింత లేని మానవులు యానాదులేయని ప్రజాబాహుళ్యముయొక్క నిజమైన నిర్ణయము.

యానాదుల మొట్టమొదటి జన్మభూమి హైదరాబాదుకు అనతి దూరాన వుండే యాదగిరి వుండవచ్చునా అన్న సంశయము కొందరికి ఉండిన మాట వాస్తవమే. ప్రతి యానాదినోట్లో ఎప్పుడు నానుతూవుండే దిగువ యానాది చెంచుపాట ఈ అభిప్రాయానికి కొంత ఆస్కారాన్ని కలిగించిన మాట నిజమే.

**యానాదులో ఎట్ల బొయ్యిరో**
**యాదగిరి చెరువులోకి దేవబొయ్యిరో**
**వాళ్ళు రాబోతరా, మనం చూడబోతమా**
**చుక్కబొట్టు పెట్టుకోని నిక్కబోతమా?**

పై పాటలోని యాదగిరి ఒకవేళ వేదగిరికి వికృత అయినట్లయితే నెల్లూరు నగరానికి ఐదారుమైళ్ళ దూరంలో పడమటివైపున వేదగిరి కొండపై వెలసియున్న నృసింహస్వామి పాదములయొద్ద ప్రారంభమై నెల్లూరువరకు వ్యాపించిన నెల్లూరు చెరువుకే ఈ పేరు అన్వయించవచ్చు. కాని యింతటి సమీపంలో ఉన్న చెరువులో చేపలు పట్టుటకుపోయిన తమ భర్తలను గురించి ''వాళ్ళు రాబోతారా, మనం చూడబోతామా'' అని నిస్పృహ చెందవలసిన విరహబాధ యానాది యువతులు పొందవలసిన అవసరముండదు. నెల్లూరు యానాదులు హైదరాబాదు ప్రాంతపు యాదగిరి గుట్టయొద్దకు చేపలవేటకు పోవలసిన ప్రమేయము కూడ అసంభవము. నల్లమలల్లో ఒకప్పుడు చెంచులనే పేరుతో నివసిస్తూ ఉండిన యానాదులకు యాదగిరి గుట్ట దూరమే కావచ్చు. కాలంలో యాదగిరి చేరువన గొప్ప చెరువు వుండినా ఉండవచ్చు. కొండలపైన ఉండిన చెంచులు పల్లపు ప్రాంతాలకు దిగివచ్చి యానాదులైనారనే నమ్మకానికి బలము కలుగవచ్చు.

*(శంకరన్ స్మృతి సంచిక)*

# భాసుడు –
# నాటక భాస్కరుడు

– ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

**భాసుడు :**

నాటకం అంటే అతనికి మంచినీళ్ళప్రాయం. నిట్టూర్చినంత సహజంగా, నవ్వినంత హాయిగా, చేయి విసిరినంత అప్రయత్నంగా, అతడు నాటకం వ్రాయగలడు.

నాటకం అంటే – అతనికొక యజ్ఞం కాదు; క్రీడ! దురదృష్టం ఏమిటంటే – అతడు మనకు చెప్పలేనంత ఆలస్యంగా పరిచయమయ్యాడు.

అతని నాటకాలు మన చేతికి దొరికేనాటికి – సంస్కృత నాటకరంగంలో ఒక పద్ధతి స్థిరపడి ఘనీభవించిపోయింది.

అది కవిత్వం–

కాళిదాసంతవాడు నాటకం వ్రాయబోతే అది బరువైన బలమైన కవిత్వరూపం తీసుకుంది. ఎన్ని భిన్న రుచులు కలవారినైనా ఒక్కచోటికి తెచ్చి సంతోషపెట్టేది నాటకమొక్కటే – అని తెలిసినా, దాన్ని ఒక మహాయజ్ఞం చేశాడు.

ఉదాత్త పాత్రలుండాలి.

ఉజ్జ్వల వస్తువుండాలి.

ఉత్తమ రసక్రియ ఎన్నుకోవాలి.

ఊరించే కవిత ఉండాలి.

ప్రజ్ఞావంతుడు గనక – తాను అన్ని హంగులతోటీ తన నాటకాలను ఔననిపించి దాటిపోయినా తక్కినవారు నాటకాలను కవిత్వమయం చేసి పాత్రలకు ఊపిరాడకుండా ప్రేక్షకులకు ఊహ అందకుండా నాటకానికి, తన బతుకు తనకు లేకుండా చేశారు.

ఒక్క ఉదాహరణ చూడండి చాలు –

పండితులు అభిజ్ఞాన శాకుంతలాన్ని మెచ్చుకున్న విధం ఇది : 'కావ్యాల్లో నాటకం గొప్పది; అందులో శాకుంతలం ఉత్తమం; దానిలోనూ నాలుగో అంకం అందం చెప్పలేము; అందులోనూ అంటారా – నాలుగు శ్లోకాలు, అబ్బ ఏమి గొప్పవి!'

అంటే ఏమి తేలింది? శాకుంతలం కవిత్వం అద్భుతం అన్నమాట.

నాటకంలో చూడవలసింది అదేనా అని నా ప్రశ్న – అది అలా ఉంచండి. ఈ దుస్సంప్రదాయం తెలుగులో నమ్మకంగా ప్రవేశించి నాటకాల్ని పద్యాలతో ముంచెత్తింది.

నటుడు అంటే పాటగాడు అని స్థిరపడింది.

ఒకడు విజృంభించి పాడుతూ ఉంటే తక్కిన నటుల గతి ఏమిటి? అని ఆలోచించకుండా నాటకాలు నిశ్చింతగా చూడగల రసజ్ఞులతో తెలుగురంగం నిండిపోయింది. ఇప్పుడు అసలు నాటకమంటే ఏమిటి? అది ఎలా కదలాలి? ఎలా బతకాలి? అనే జిజ్ఞాస పుడుతుంది.

అప్పుడు అభయ హస్తంతో మనకు భాసుడు ప్రత్యక్షమవుతాడు.

**ఎవరీభాసుడు?**

తప్పకుండా కాళిదాసుకు ముందువాడు.

క్రీస్తుపూర్వం 300 నాటి మౌర్య చంద్రగుప్తుని కాలంనాటివాడని విమర్శకులు నిర్ణయించారు.

భాసుడు పేరు కాదు; గోత్రనామం అన్నారు. కాని అదే పేరుతో చలామణీ అవుతున్నాడు.

1910 వరకు అతని నాటకాలు దొరకలేదు. అప్పుడు శ్రీ టి. గణపతిశాస్త్రి త్రివేంద్ర సిరజాలో భాసుని పేరిట 13 నాటకాలు ప్రకటించారు. కొందరు ఇవి భాసునివి కావన్నారు. కేరళ నటులెవరో కల్పించినవన్నారు. రచన చూస్తే గొప్ప ప్రతిభావంతుని చేయి కనబడుతుంది; కనుక భాసునివే అనడానికభ్యంతరం లేదన్నారు సద్విమర్శకులు.

**అతని నాటకాలు**

రామాయణానికి చెందినవి : రెండు – ప్రతిమ, అభిషేకం. భారతావనివి: 6, పంచరాత్రం పెద్దది (1) ఏకాంకనాటికలు – 5 మధ్యమవ్యాయోగం, దూతవాక్యం, దూతఘటోత్కచం, కర్ణభారం, ఊరుభంగం.

భాగవతానిది : 1. బాలచరితం.

ఐతిహాసికాలు : 4. సప్నవాసవదత్తం, ప్రతిజ్ఞా యౌగంధరాయణం, అవిమారకం, చారుదత్తం (అసమగ్రం)

భాసుడికి శ్రవ్యకావ్యాలంటే, దృశ్యకావ్యాలకంటే ప్రాణం. అవకాశం దొరికినప్పుడల్లా దృశ్యకావ్యం – అంటే నాటకం మీద తన మోజును, సంప్రీతిని వెల్లడిస్తాడు. అదే చూపుతో నాటకాన్ని మలుస్తాడు.

రామాయణ, భారతాల ముడివస్తువుల్ని చితగొట్టి, తన మూసలలో కరిగించి కొంగ్రొత్త నాటక స్వరూపాన్ని తయారుచేశాడు.

దూతఘటోత్కచ ప్రస్తావనలో అంటాడు–

**"లోక త్రయావిరత నాటక తంత్రవస్తు**
**ప్రస్తావన ప్రతిసమావన సూత్రధారః"**

నాటక వస్తువుకోసం ఎక్కడికో పోనక్కరలేదు. ముల్లోకాలలోనూ నిరంతరం నడిచేది నాటకమే. ఆ వస్తువును తీసుకొని నారాయణుడు సూత్రధారి అయి అద్భుతమైన నాందీ భరతవాక్యాలతో నాటకం నడుపుతున్నాడు అంటాడు.

అతడు లోకాన్నంతటినీ నాటకంగానే చూశాడు. చేతికి దొరికిన ప్రతి కథను నాటకం చేశాడు.

✧ ✧ ✧

ప్రతిమలో ప్రారంభం నాటకంతోనే జరుగుతుంది. రామపట్టాభిషేకోత్సవానికి, తగిన మంచి నాటక ప్రదర్శనం ఉండాలని రాజాజ్ఞ. సీత చెలికత్తె ఒకతె. నాటక రంగస్థలికి వెళ్ళి సూత్రధారిణితో తగాదాపడి వాళ్ళను ఏడిపించడానికి ఒక నారచీర ఎత్తుకువస్తుంది. అదిచూసి సీతమ్మ సరదాకు కట్టుకుంటుంది. అవతల పట్టాభిషేకం చెడి, రాముడు సీతదగ్గరకు వస్తే సీత, నారచీరతో ఉంటుంది. ఆ నాటక రంగంనుంచే రాముడు తానూ ఒక నారచీరను స్వీకరించి అరణ్యవాసానికి వెడతారు. కైక చేతినుంచి నారలు గ్రహించకుండా నాటకంలో నుంచి సంగ్రహించడం భాసుని చతురత!

✧ ✧ ✧

*స్వప్నవాసవదత్త అంతా నటనామయం. క్షీణించిన వత్సరాజు రాజ్యాన్ని పెంచాలంటే మగధరాజుతో సంబంధం కలవుకోవాలి. అంటే ఆ రాజుచెల్లెలు పద్మావతిని, వత్సరాజుకు పెళ్ళిచేయాలి. వాసవదత్త బతికి ఉండగా ఇంకో పెళ్ళికి వత్సరాజు ఒప్పుకోడు.*

*అక్కడనుండి మంత్రి నాటకం ప్రారంభమవుతుంది. వాసవదత్త ఊరంటుకుని అందులో కాలిపోయిందని పుకారు లేవదీసి, మంత్రి బ్రాహ్మణవేషంతో తానూ, తన చెల్లెలి వేషంలో వాసవదత్త, మగధ బయలుదేరుతారు.*

*మగధాంతఃపురంలో వాసవదత్త, చెలికత్తెగా నటించాలి. వత్సరాజుకు పద్మావతితో పెండ్లి అవుతూ ఉంటే – ఏడుస్తూ సంతోషం నటించాలి. వాసవదత్తను మరచిపోలేని రాజు పద్మావతిని ప్రేమించినట్టు నటించాలి. పద్మావతి, వత్సరాజు ప్రేమను నమ్మినట్టు నటించాలి! అంతా నాటకమే!*

*ప్రతిజ్ఞా యౌగంధరాయణంలో – మంత్రి ఉజ్జయినిలో పిచ్చివాడుగాను, అతని అనుయాయులు శిష్యులుగాను, అనుచరులు త్రాగుబోతులుగాను నటించి, వత్సరాజును వాసవతో కూడా వెల్లగించుకు వస్తారు.*

✧ ✧ ✧

చారుదత్తంలో – వసంత సేనను – 'నాటక స్త్రీ వసంత సేనా నామ గణికాధారికా' అని స్పష్టంగా ఆనాటి నాటకాభిరతిని వాచ్యంగానే చెబుతాడు.

**నాటక సామగ్రి :**

భాసుని దృష్టిలో నాటకానికి జవం వంటివి నాలుగు. వాటివల్ల నాటకం తన ప్రాణశక్తితో కదులుతుంది. 1. పాత్రలు, 2. సంఘటన, 3. సంభాషణ, 4. రసం. భాసుడికి ఉత్తమ రాజపుత్రులు, అచ్చరలవంటి రాజపుత్రికలు, విద్యావంతులు, వీరాధివీరులే పాత్రలుగా ఉండనక్కరలేదు. లోకంలో అందరూ అట్టివారే కారు గదా! కులహీనులు, అజ్ఞానులు, భీరువులు, భ్రష్టులు అయినా పాత్రలుగా పనికివస్తారు. అవిమారకంలో హరిజనుడు, (శాపంవల్లనే కానీయండి) చారుదత్తంలో వేశ్య, కులభ్రష్ట బ్రాహ్మణుడు, జూదగాళ్ళు, రాజు బావమరిదిగా చలామణీ అవుతూన్న పిరికివాడు. క్రూరుడు, ప్రతిజ్ఞలో పిచ్చివాడు, అతని పరివారం, నాటక నిర్వహణకు పనికివచ్చే ముఖ్యపాత్రలైనారు. అంతేకాదు – మూలకథలలో కుత్సితులుగా, దుష్టపాత్రలుగా ప్రసిద్ధులైనవారు భాస, సృష్టిలో హృదయం ఉన్న మానవత్వంతో చలిస్తూ కనిపిస్తారు. ప్రతిమలో కైకేయికి గొప్ప హృదయం ఉంది. అగ్గలమైన మాతృప్రేమ ఉంది. తాను నారచీర లివ్వలేదు. విధి విహితమైన దశరథ మరణాన్ని పుత్రమృతివల్ల జరగనివ్వక, పుట్టెడుదుఃఖం మనసులో అణచుకుని పుత్రవియోగంవల్ల జరిగేలా చేసింది. విజయియై తిరిగివచ్చే రామునికి

ఎదురుగావెళ్ళి అరణ్యంలోనే పట్టాభిషేకం చెయ్యడానికి ఆరాటపడింది. దూత ఘటోత్కచంలోని ధృతరాష్ట్రుడు భారతంలోని దుష్టపాత్రుడు కాడు. యుద్ధంలో అభిమన్యుడు మరణిస్తే 'భిన్నోర్జునస్య ప్రథమః ప్రవాళః' (అర్జున వృక్షపు తొలి చిగురును త్రుంచిన దుర్మార్గులు) అని మనసార పరితపించినవాడు. పంచరాత్రంలోని కర్ణుడు దుష్ట చతుష్టయంలో ఒకడుగా కనిపించడు. మహోదారుడు, ఉదాత్తచిత్తుడుగా దర్శనమిస్తాడు. 'రామేణభుక్తాం పరిపాలితాంచ సౌభ్రాతృతాం న ప్రతిషేధయామి'. రాముడు స్థాపించిన సౌభ్రాత్రమును నేను తిరస్కరించలేను, అని దుర్యోధనునకు వ్యంగ్యంగా పాండవ సౌభ్రాత్రాన్ని ప్రబోధిస్తాడు.

దుర్యోధనపాత్ర భాసునిచేతిలో అపూర్వ ఓజస్తేజస్సులతో మెరిసింది. 5 రోజులలో పాండవులు కనపడితే వారికి రాజ్యమిచ్చివేస్తానని ద్రోణునకు చేసిన వాగ్దానాన్ని అక్షరాల నెరవేర్చిన సత్యశీలి ఈ దుర్యోధనుడు.

భీముడు అన్యాయంగా తొడలు విరగగొడితే ఆ అధర్మ యుద్ధానికి మండిపడి బలరాముడు భీముని చంపుతానంటే దుర్యోధనుడు విషణ్ణ మందహాసంతో అంటాడు.

'వైరంచ నిగ్రహకథాశ్చ నయం చ నష్టాః
జీవంతు తే కురుకులస్య నివాస మేఘాః'

(వైరాలు యుద్ధాలూ అన్నీ సమసిపోయాయి. నా పనీ అంతే అయింది. కురుకుల తిలోకాదకా లివ్వడానికైనా పాండవులను బతకనీ!)

సంఘటనకు వస్తే ప్రతిమలోని ప్రతిమాగృహంవల్లనే భరతునకు దశరథ మరణం తెలియడం, రావణుడు రాముని దగ్గరకు వెళ్ళి చూస్తుండగానే సువర్ణపార్శ్వహరిణం నెపంతో వంచించడం, స్వప్ననాటకంలో మగతనిద్రలో వత్సరాజు వాసవదత్తలు కలుసుకోవడం, పంచరాత్రంలో అభిమన్యుడు కౌరవుల తరపున యుద్ధానికివెళ్ళి (గోగ్రహణంలో) భీమునకు పట్టుబడడం, మధ్యమలో భీమ, ఘటోత్కచులు ఒకరికి తెలిసీ, ఒకరికి తెలియకా, తటస్థపడడం వంటివి అపూర్వ సన్నివేశాలు.

పాత్రల స్వభావాన్ని చిటికలో పట్టియిచ్చే సంభాషణలు నడపడంలో భాసుడు చతురుడు. దూతఘటంలో ఘటోత్కచ, శకుని, దుర్యోధన పాత్రల సంభాషణ చాకచక్యం, ప్రతిజ్ఞలో గెలిచిన, ఓడిన ఉభయ మంత్రుల మాటపై మాటలు, చారుదత్తంలోని శకార, విట, హాస్య సంభాషణలు, మరుపురాని మెరపులు!

రసచిత్రణంలో భాసునికి ఒక ప్రత్యేకమైన బాణీ ఉంది. రసప్లుతికి అవకాశ మున్నచోట పాత్రల భావాలను కవితలో వ్యక్తీకరించడం అతని పద్ధతి కాదు.

సన్నివేశంలో రసం పుట్టాలి. మాటలవల్ల కాదు. కవితవల్ల కాదు. అది నాటకీయతకు పరాకాష్ఠ.

స్వప్న నాటకంలో ఎప్పుడో మరణించిందనుకున్న వాసవదత్త హఠాత్తుగా వత్సరాజుకు తటస్థపడుతుంది. అది కలో మెలకువో అతనికి నిర్ధారణ కాలేదు.

**'యది తావ దయం స్వప్నో! ధన్య మప్రతి బోధనం!**
**అథాయం విభ్రమో వా స్యాత్ ! విభ్రమో హ్యస్తు మే చిరం ॥'**
**స్వప్న స్యాంతే విబుద్ధేన, నేత్ర విప్రోషి తాంజనమ్ ।**
**చారిత్ర మపి రక్షంత్యా, దృష్టం దీర్ఘాలకం ముఖమ్ ॥**

(ఇది కలే అయితే మెలకువ రావద్దు. ఇది భ్రమే అయితే ఆ భ్రాంతే నిలిచిపోవుగాక–

కల చివర కన్నులకు కాటుకలేని, జుట్టు చెదరివున్న ఒక శుద్ధశీల ముఖం కనపడింది). ఈ మాటల వెనక ఉన్న దుఃఖం అగాధం. ఆ రెండుమాటలూ చెప్పి ఊరుకుంటే – తక్కినది నటుని పని. నటుడు ఆ సన్నివేశాన్ని ఉపయోగించుకొని రసం కురిపించవచ్చు.

తక్కిన కవులైతే ఇక్కడ కవిత కుమ్మరిస్తారు.

తొడలు విరిగిన తండ్రి దుర్యోధనుని దగ్గరకు వచ్చి కొడుకు దుర్జయుడు 'నాన్నా, నీ తొడమీద కూర్చుంటాను. అలసి వచ్చాను' అంటాడు. దుర్యోధనుడు క్రక్కదలిపోతాడు. ఇక్కడ ఒక్కటే మాట 'బాబూ, ఇంక నీ కీ తొడమీద కూర్చునే యోగం లేదు' అక్కడ ఎంతైనా కవిత పలికించవచ్చు. కాని ప్రేక్షకుల భావనకు వదలిపెట్టటం భాసుడి ప్రత్యేకత.

భాసనాటకాలు ఒకసారి కాదు. పలుసార్లు చదవాలి. మనస్సు అతని రచనాసౌందర్యంలో భావితం కావాలి. అప్పుడు తెలుగులో ఒక భాసుడు పుట్టాలి. తెలుగు నాటక రచనపై కొత్త వెలుగులు – ప్రసరించాలి.



ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి



# జీనోమ్ కథనమ్ – 4

– ము.పా.సా.

## లలాట లిఖితం

"జ్యోతిష్యానికి తార్కికతను జోడిస్తే అది సైన్సు అనిపించుకుంటుందా?"

హ్యూమన్ జీనోమ్‌ను పరిశీలించిన వారికెవరికైనా, ఈ జీవజాతిలోని విలక్షణతలకన్నా, మనుషులకు రాగల రోగాల జాబితా మొదట దర్శనమిస్తుంది. మధ్య యురోపియన్ డాక్టర్ల పేర్లే ఈ రోగాలకూ వుంటాయి. నీమన్ – పిక్ జబ్బు రావటానికి కారణం ఒక జన్యువు. వుల్ఫ్ హర్ష్ హార్న్ సిండ్రోమ్ జబ్బుకు కారణం మరొక జన్యువు. ఈ చిట్టా చూస్తే జన్యువులే రోగాలకు కారణమేమో అనిపించటం కూడా సహజమే. "ఫలాని జన్యువువల్ల మానసిక రుగ్మత వస్తుంది" అని ప్రకటిస్తుందొక వెబ్‌సైట్. డిస్టోనియావంటి కండరాల జబ్బు లేదా మూత్రపిండాల కాన్సర్, బాల్యంలో వచ్చే ఆటిజం వంటి జబ్బులకు, అల్జీమర్ వ్యాధికి యిలా ఒకటేమిటి మరెన్నో వ్యాధులకు కారణం జన్యువులే అంటున్నారు.

అయితే రోగాల భాషలో జన్యువును నిర్వచించటమంటే "తలనొప్పి వచ్చే తల" లేదా "సిరాసిస్ వచ్చేదే లివర్" అన్నట్టుంటుంది. జన్యువులు తమ పనులను సరిగా నిర్వర్తించనప్పుడు జబ్బులొస్తాయి. కాని యిది చాలా ప్రాథమిక సమాచారం మాత్రమే. "వుల్ఫ్ హర్ష్ హెర్న్ సిండ్రోమ్‌కు కారణం ఫలాని జన్యువు" అనటం తప్పు. ఆ జన్యువు అందర్లోనూ వుంటుంది. ఆ సిండ్రోమ్‌తో బాధపడేవాళ్ళలో తప్ప. అంటే జన్యువు లేకపోవటంవల్ల వచ్చిందా జబ్బు – జన్యువుల విభజన ఫలితమిది.

వుల్ఫ్ హర్ష్ హెర్న్ సిండ్రోమ్ అరుదుగా వస్తుంది. కాని చాలా ప్రమాదమైంది. పిల్లల్ని, మనుషుల్ని ఎక్కువగా బలితీసుకుంటుంది. దీనికి సంబంధించిన జన్యువు క్రోమోసోమ్ 4 కు సంబంధించింది. హింటింగ్‌టన్స్ కోరియా అనబడే మరో వ్యాధికి కూడా ఇదే కారణం. అంటే ఇది ఈ జన్యు విభజన ఫలితమే. ఇంతకూ ఈ జన్యువు వల్ల లేదా లేకపోవటంవల్ల జబ్బులు మాత్రమే వస్తాయా లేక జీవప్రక్రియలో యిది మరేదైనా భూమిక పోషిస్తుందా అన్న విషయం యిటీవలే తెలిసింది. ఈ జన్యువులో వుండే ఏకైక పదం CAG ఈ పదం ఆరుసార్లు, ముప్పైసార్లు, వందకన్న ఎక్కువసార్లు కూడా పునశ్చరణ అవుతుంది. ఈ పునశ్చరణ మీద ఆధారపడి వుంటుంది మీ అదృష్టం, మీ మానసిక ఆరోగ్యం, జీవితం ఆధారపడి వుంటాయి. ముప్పైఅయిదుకన్నా తక్కువ పునశ్చరణలుంటే ఆరోగ్యానికి ఢోకా లేదు. పదినుండి పదిహేను (పునశ్చరణలు) సర్వ సాధారణం. ఇవి ముప్పైతొమ్మిది మించితే, మధ్య వయసులో మతిస్థిమితం తప్పుతుంది. అకాల మరణం తథ్యం. మొదట కాళ్ళు, చేతులు వణకటంతో ప్రాచ్యమైన, డిప్రెషన్‌గా మారి, హేతుబద్ధంగా ఆలోచించే శక్తి తగ్గి, ఊహలే నిజమనుకోవటం ప్రారంభిస్తాం (హాట్యాసినేషన్స్ ఫలితమిది). ఈ జబ్బుకు చికిత్స లేదు. అయినా మృత్యువు కూడా త్వరగా వరించదు. పదిహేను నుండి ఇరవై అయిదేళ్ళపాటు దీనితో సావాసం చెయ్యాల్సిందే. ఇంతకన్న దారుణమైన, దయనీయమైన జీవితం మరొకటుండదు. రోగికన్నా, ఇంట్లో వున్న బంధువులు అసలు శిక్ష అనుభవిస్తారు. కుటుంబ జీవితం ధ్వంసమైపోతుంది.

జన్యువులో మ్యుటేషన్ (విభజన) జరిగితే తప్ప యిది వచ్చే అవకాశం లేదు. మరి యిది విధి – లలాట లిఖితం కాకపోతే మరేమిటి? ఈ జన్యువులు ఆడిస్తున్న

తోలుబొమ్మలం మనం. స్వయం నిర్ణయాధికారం లేదు మనకు. సిగరెట్లు కాలుస్తారా, ఆరోగ్య సూత్రాలు పాటిస్తారా, దురలవాట్లనుండి దూరంగా వుంటారా – ఇవేమీ ముఖ్యం కాదు. ఒక జన్యువు CAG అనబడే పదాన్ని ఎన్నిసార్లు పునశ్చరణ చేస్తుందనే దానిబట్టి నిర్ణయించబడుతుంది మీ మానసిక ఆరోగ్యం. నలభైరెండుసార్లు (పునశ్చరణ) జరిగితే ముప్పైఏడోఏట మతి భ్రమించటం ఖాయం (ఈ తిక్కకో లెక్కుంది).

ఏ జాతకం కూడా యింత ఖచ్చితంగా మీ భవిష్యత్తును చెప్పలేదు. ఫ్రాయిడ్, మార్క్స్, జీసస్ క్రైస్ట్ వగైరా మహానుభావులెవరూ మనిషికి ఎప్పుడేమవుతుందో యింత స్పష్టంగా చెప్పలేకపోయారు. ఈ డీ జన్యువు మీ భవిష్యవాణి. హ్యూమన్ జీనోమ్‌లో ఒక బిలియన్ ''మూడక్షరాల పదాలు''న్నాయి. కాని ఈ ఒక్క పదం (CAG) మిమ్మల్ని వున్మాదం ఆవహిస్తుందో లేదో నిర్ణయిస్తుంది.

జార్జి హంటింగ్టన్ అనబడే వైద్యుని కృషి ఫలితంగా హంటింగ్టన్స్ జబ్బు గురించి లోకానికి తెలిసింది (1872లో). వారసత్వంగా వస్తుందిది. తండ్రి నుండి సంక్రమించినప్పుడు తీవ్రత మరింత ఎక్కువ.

1970లలో ఈ రోగకారక జన్యువు గురించిన అన్వేషణ పరిశోధన ప్రారంభమైంది. 1967లో ఒక ప్రముఖ జానపద గాయకుడు వూడీ గుత్రీ మరణంతో ఆయన భార్య ఈ పరిశోధనకోసం ఒక కమిటీ ఏర్పాటు చేసింది.

మొత్తం మీద 1993లో అనేకమంది వైద్యులు, శాస్త్రజ్ఞులు కృషి ఫలితంగా విభజన (Mutation)కు మూలకారణమైన జన్యువు ఆచూకీ కనుగొన్నారు. ఆ తర్వాత అందులో వున్న ప్రొటీన్ గురించి తెలిసింది (దీనికి 'హంటింగ్టిన్' అని పేరు పెట్టారు).

అయితే ఈ వ్యాధి మొదటి ముప్పైఏళ్ళు ఎందుకు రాదన్న ప్రశ్న ఉదయిస్తుంది. అంటే, అంతకాలమూ విభజన ప్రక్రియ ప్రారంభం కాదని ఒక వివరణ.

తర్వాతి పరిశోధనల్లో CAG పునశ్చరణ (repetition) వల్ల "హంటింగ్టన్ డిసీజ్" మాత్రమే కాక, మరో అయిదు నరాలకు సంబంధించిన వ్యాధులు కూడా వస్తాయని తెలిసింది. పునశ్చరణ జరిగిన ప్రతిసారీ C, G మాత్రం అన్నింట్లోనూ వున్నా కొన్నిసార్లు ఈ రెండక్షరాల మధ్య C గానీ G గానీ (అంటే CCG లేదా CGG గా) వచ్చి చేరుతాయి.

మధ్యలో వున్న అక్షరం ఏదైనా C, G అంటే గ్లూటామైన్ (ప్రొటీన్). ఇది ఎంత ఎక్కువగా వుంటే హంటింగ్టన్స్ డిసీజ్ అంత త్వరగా వస్తుంది.

ఇదంతా యిప్పుడు మనం చెప్పుకోవటానికి ఒకే ఒక కారణముంది. కొద్ది సంవత్సరాల క్రితందాకా ఈ విషయాలెవరికీ తెలియవు. 1872 నుండి 1993 దాకా హంటింగ్టన్స్ డిసీజ్ జన్యుపరమైనదని తప్ప మరేమీ తెలియని అజ్ఞానంలో వుంది, శాస్త్ర రంగం కాని 1993 నుండే కొన్ని వేల పరిశోధనలు జరిగాయి. 80,000 జన్యువులలో ఈ ఒక్కదాన్ని వేరుచేసి చూడగలిగారు. ఇదంతా జేమ్స్ వాట్సన్, ఫ్రాన్సిస్ క్రేక్‌ల ఆవిష్కరణ ఫలితమే. DNA కు ముందు మనకు తెలిసిన జీవశాస్త్ర పరిజ్ఞానం అత్యల్పం అని యిప్పుడు అందరూ గ్రహించారు.

అయినప్పటికీ, హంటింగ్టన్స్ డిసీజ్ వచ్చిన ఒక్క రోగినీ రక్షించలేకపోయాం. మెదడులో 100 బిలియన్ సెల్స్ వుంటాయి. ఒక్కొక్క సెల్‌లో వున్న హింటింగ్టన్ జన్యువును వేరుచేసి, దానిలోని CAG పునశ్చరణల సంఖ్యను తగ్గించటం ఎలా సాధ్యపడుతుంది?

ఈ జబ్బు వారసత్వంగా సంక్రమిస్తుంది గనక, డాక్టర్లు రోగి సంతానానికి "యిది వచ్చే అవకాశం 50% ఉంటుంది" అంటారు. అది శుద్ధ తప్పు. జన్యుపరీక్షలు జరిపినా, పునశ్చరణ సంఖ్యనుబట్టి వస్తుందో రాదో నిర్ధారించగలరే తప్ప, 50% అంటూ వుండదు.

నిజానికి, ఈ విషయంలో వారసులలోని ఏ ఒక్కరికి పరీక్ష చేసినా జబ్బు వాళ్ళకొస్తుందో లేదో తెలిసిపోతుంది.

హంటింగ్టన్స్ డిసీజ్ అనేది మానవ జాతికి పట్టిన శాపం. ధనిక, పేద, ఆడ, మగ, పిల్లలు, పెద్దలు ఎవర్నీ వదలదు. చికిత్స లేదు. మీరు నాస్తికుడైనా సరే, దేవుని మీద భారమేసి బతకాల్సిందే. ఆలోచనాశక్తి నశించి, జంతువులాగ బతికినప్పుడు అస్తిత్వ సమస్యలన్నీ వాటంతటవే పరిష్కారమవుతాయి. బ్రహ్మ కూడా మార్చలేని లలాట లిఖితం హంటింగ్టన్స్ డిసీజ్.

## జీనోమ్ కథనమ్ – 5

### పర్యావరణం

నీటి మీద తేలుతుంటాయి గడ్డిపోచలు.

ఆణిముత్యాలు కావాలంటే అట్టడుగు లోతుల్లో అన్వేషించాలి.

ఇంగ్లీష్ కవి జాన్ డ్రైడెన్ – **All for Love లో :**

"జెన్‌టిక్స్ గురించి భయపడాల్సిందేమీ లేదు. దాన్ని అర్థం చేసుకోవటం చాలా సులభం. కథల్లాగ కూడా చెప్పుకోవచ్చు". జన్యువు అంటే జనం భాషలో రాసిన ఒక సులభమైన వ్యాక్యం" వగైరా కబుర్లు చెప్పుకున్నాం. ఇది చదవటానికి మిమ్మల్ని ప్రోత్సహించాలనే అలా చెప్పాను. క్షమించాలి. జెనెటిక్స్ ది డిజిటల్ భాష.

ఈ శాస్త్రానికి మెండెల్‌ను ఆద్యునిగా చెప్పుకొన్నా, ఆ పరిజ్ఞానం, ఆధునిక జెనెటిక్స్ అవగాహనకు ఏమాత్రం సరిపోదు. క్రోమోసోమ్ – 5 గురించి చర్చ ప్రారంభిస్తే చాలు, యిదెంత సంక్లిష్ట విషయమో అర్థమవుతుంది. దీనికి మనం "ఉబ్బసం జన్యువు" అని పేరు పెట్టొచ్చు. అయితే, ఉబ్బసానికి కారణం యిదొక్కటే అని చెప్పలేం. అనేక జన్యువుల ప్రభావాల ఫలితమే ఈ జబ్బు. అందరికీ ఏదో ఒక అలర్జీ వుంటుంది. అందువల్ల, ప్రాథమిక దశలో ఎవరు ఏ జన్యువు దీనికి మూలమన్నా మనం వాదించటానికేమీ వుండదు. అయితే, పర్యావరణ కాలుష్యాన్ని తట్టుకోలేక పోవటానికి ఏది కారణం?



వారసత్వంగా సంక్రమించే అనేక జబ్బులకు సంకేతం ఉబ్బసం. అలెర్జీ వల్ల ఉబ్బసం వచ్చినప్పటికీ, ఉబ్బసం రోగులందరూ ఏదో ఒక వస్తువు, విషయంపట్ల (ప్రత్యేకంగా) అలెర్జిక్‌గా వుంటారు. ఈ అలెర్జీలన్నింటికీ కారణం "ఇమ్యూనో గ్లోబ్యులిన్ – E మాలెక్యూల్స్" పదిమందిలో ఒకరికి ఏదో ఒక రకమైన అలర్జీ వుంటుంది. అలెర్జీ లేనివాళ్ళకు ఉబ్బసం వచ్చే అవకాశమే లేదు.

అయితే, ఎవరు ఉబ్బసం గురించి ఏమి మాట్లాడినా అది తప్పని నిరూపించగలిగి అవకాశాలు కూడా దండిగా వున్నాయి. ఒక అధ్యయనం ప్రకారం, గత పదేళ్ళలో ఈ జబ్బు బారిన పడినవాళ్ళ సంఖ్య అరవైశాతం పెరిగింది – (దీని వలన) మరణాల సంఖ్య మూడురెట్లు పెరిగింది. వేరుశనగల పట్ల అలెర్జీ 70% పెరిగింది. కాని మరొక అధ్యయనం యిదంతా తప్పుల తడక అంటున్నది. కొన్నిసార్లు డాక్టర్లు 'ఉబ్బసాన్ని జలుబుగా' లేదా 'జలుబును ఉబ్బసంగా' నిర్ధారించి చికిత్స చేస్తున్నారు. 1870లలో, మార్సేలోని ఒక వైద్యుడు, ఉబ్బసం రావటానికి ప్రధాన కారణం పర్యావరణ కాలుష్యమని తొలిసారి గ్రహించాడు?

కాని 'కాలుష్యం' అనేక రకాలు. ఏ కాలుష్యం వల్ల యిది వస్తుంది?

అమెరికన్ లంగ్ అసోసియేషన్ ప్రకారం, పుప్పొడి, పక్షుల ఈకలు, రకరకాల ఆహార పదార్థాలు, చలిప్రదేశాలు, మానసిక ఒత్తిడి, శృతిమీరిన శారీరక వ్యాయామం, ప్లాస్టిక్ వస్తువులు, లోహాల నుండి వచ్చే ఆవిర్లు, కలప, కార్లు వదిలే పొగ, సిగరెట్ పొగ, పెయింట్లు, స్ప్రేలు, ఆస్పిరిన్, గుండె జబ్బులకు వేసుకునే మందులు ఉబ్బసానికి ప్రధాన కారణాలు: కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో నిద్రవల్ల కూడా ఆస్మా రావచ్చు. జాబితా యింత పెద్దదైనప్పుడు వూహాగానాలకు కొదవేముంది! ఉదాహరణకు, నగరాల్లోనే ఉబ్బసంతో బాధపడేవాళ్ళ సంఖ్య ఎక్కువ. కార్లూ, తరిగిపోతున్న ఓజోన్ కూడా యిందుకు సహాయం చేస్తాయి.

శుభ్రంగా వుండేవాళ్ళు ఎక్కువసార్లు స్నానం చేసే వాళ్ళు – మురికివాళ్ళు కాదు. ఉబ్బసం బారిన పడే ప్రమాదముంది. బ్రిస్టల్‌లో జరిపిన ఒక సర్వేలో, వీళ్ళకు వుబ్బసం వచ్చే అవకాశం 25% ఎక్కువ అని తేలింది. మురికిలో వుండే మైక్రోబాక్టీరియా మన రోగనిరోధక శక్తిని పెంచుతుందట (మట్టిమనుషులం! మట్టి మన రక్షణ కవచం – కనీసం వుబ్బసానికి సంబంధించినంతవరకూ!)

ఇది జన్య సంబంధిత రోగమని డాక్టర్లెందుకు చెబుతున్నారు? దీనికో కారణం – శ్వాస నాళంలో అడ్డంకులు ఏర్పడటం. హిస్టామైన్స్ పెరగటంవల్ల యిలా జరుగుతుంది. మాస్ట్‌సెల్స్ ఈ హిస్టామైన్స్‌ను విడుదల చేస్తాయి. ఇమ్యూనో గ్లోబ్యులిన్ – E ప్రొటీన్స్‌కూ హిస్టామైన్స్‌కూ సంబంధముంది. జీవప్రక్రియలోని గొలుసు కథ యిది. ఒకరికి దుమ్మువల్లా, మరొకరికి కాఫీవల్లా ఉబ్బసం వచ్చినప్పటికీ, వాటి వెనక

వున్నది మాత్రం, దాన్ని ప్రేరేపించిన ఇమ్యూనోగ్లోబ్యూలిన్ – E వ్యవస్థ మాత్రమే.

గొలుసులాగ కనిపించే జీవరసాయన ప్రక్రియలకు కారణం జన్యువులే. గొలుసులోని ప్రతి ప్రొటీన్‌ను తయారు చేస్తుంది జన్యువు. కాని, ఇమ్యూనో గ్లోబ్యూలిన్ – E విషయంలో మాత్రం రెండు జన్యువులు ఈ పని చేస్తాయి. కొందరిలో పుట్టుకతోనే ఇమ్యూనోలాజికల్ ప్రేరణ ఎక్కువగా వుంటుంది (వీళ్ళ జన్యువులు యితర్లకన్న కొద్ది భిన్నంగా వుంటాయి). కొన్ని కుటుంబాలలో వారసత్వంగా ఉబ్బసం వ్యాధి సంక్రమించటానికి యిదే కారణం.

జన్యు విభజనే ఆస్మాకి కారణమని చెప్పుకొన్నాం. ఈ ప్రక్రియను అర్థం చేసుకోగలిగితే తగిన మందు కూడా కనిపెట్టటం కష్టమేమీ కాదు. దుమ్ములాంటి బాహిర అంశాలకన్న, జన్యుకారణాలమీద పరిశోధన పెరిగింది.

ఇంతకూ విభజన కాని జన్యువుకూ, సాధారణ జన్యువుకూ తేడా ఏమిటి? ఒక్క నిమిషం ఆగండి. ఈ ప్రశ్నకు జవాబు ఎంత జటిలమో యిప్పుడే తెలుస్తుంది.

1980లలో 'ఉబ్బసం జన్యువు' ను గురించిన పరిశోధన ముమ్మరమైంది. కాని 1998 నాటికి, దీనికి కారణమైన – ఒకటి కాదు – పదిహేను జన్యువులున్నాయని తెలిసింది. కేవలం క్రోమోసోమ్–5 కు సంబంధించినవ ఎనిమిదున్నాయి. క్రోమోసోమ్ 6, 12 ల మీద రెండేసి, 11, 13, 14 ల మీద ఒక్కొక్కటే కనిపించాయి. ఇవన్నీ కలిసిగాని దేనికదే స్వతంత్రంగాగాని ఉబ్బసానికి కారణం కావచ్చు.

అమెరికన్ లంగ్ అసోసియేషన్ ప్రకారం, పెట్రోల్ కార్ల నుండి వెలువడే పొగవల్ల పురుషులకూ, డీజిల్ ఇంజన్ల పొగతో మహిళలకూ ఆస్మా వచ్చే అవకాశముందట. పురుషులకు వుబ్బసం త్వరగా వస్తుంది. కొద్ది కాలానికి తగ్గే అవకాశమూ వుంది. "మహిళలకు మధ్య వసుదాకా యివి రాకపోవచ్చు. కాని జీవితాంతమూ వుంటుంది" అని ఒక సర్వే చెబుతోంది (ఇవి మానవజాతి అంతకూ వర్తిస్తుందని కాదు. సందర్భాన్నిబట్టి మినహాయింపులు కూడా వుంటాయి). అంతేగాక, తల్లినుండి సంతానానికి ఉబ్బసం



కాలుష్యం

సంక్రమించే అవకాశాలెక్కువ. తండ్రుల నుండి అరుదుగా వస్తుంది.

అనేక జన్యువులు ఉబ్బసాన్ని కలిగిస్తాయి, ప్రేరేపిస్తాయి అని అంగీకరించినప్పటికీ, క్రోమోసోమ్–5 కు సంబంధించిన $ADRB_2$ గురించి కొంత ఖచ్చితమైన సమాచారముంది. ఇందులో వున్న ప్రొటీన్ బీటా–2 ఆడ్రినెర్జిక్ రిసెప్టర్. ఇవి శ్వాసనాళం గట్టిపడటానికి, ఆస్మా ప్రారంభం కావటానికి అవసరమైన బ్రాంకోడైలేషన్, బ్రాంకో కన్‌స్ట్రిక్షన్‌లను నియంత్రిస్తుంది. మనం వేసుకొనే మందులన్నీ రిసెప్టర్‌కు సామాన్య స్థితికి తీసుకురావటానికి ఉద్దేశింపబడినవే.

దీన్నిబట్టి విభజన $ADRB_2$ మాత్రమే ఆస్మాకు కారణం అనుకోవచ్చా? అవును. DNA లోని 1239 అక్షరాలలో నలభై ఆరవ అక్షరం 'A' కు బదులుగా 'G' కావటమే యిందుకు కారణమని తెలిసంది. కాని రాత్రిపూట ఆస్మాతో బాధపడేవాళ్ళకు మాత్రమే యిది వర్తిస్తుంది.

జీనోమ్‌ను చదవటం సులభమే కాని యిది అత్యంత సంక్లిష్ట ప్రక్రియ అని కూడా యిప్పటికర్థమైందనుకుంటాను. అవును జీనోమ్ అంటే జీవితం. జీవితంలాగే అది అత్యంత సులభమూ, సంక్లిష్టమూ.

Matt Ridley రచన ఆధారంగా,
తెలుగు : ము.పా.సా
హైదరాబాదు.
ఫోన్ : 9177618708

# వేదిక

అక్టోబరు, 2015 సంచికలో, అంతకు పూర్వం బావరి శిష్యగణం బుద్ధుని కలిసిన విషయమై నేను వ్రాసిన వివరణపై శ్రీ ధమ్మరక్షిత భన్తే (మోక్షానంద) గారు విభేదిస్తూ వ్రాశారు. వారు సుత్తనిపాతంలోని వ్రాతలను ఉటంకిస్తూ – బావరి శిష్యులు బుద్ధుని కలుసుకోవటానికి వెళ్ళిన మార్గాన్ని సూచిస్తూ (గోదావరితీరం నుండి వైశాలికి అళక, ప్రతిష్ఠానం, మహిష్మతి, ఉజ్జయిని, గోనద్ధ, విదిశ, వనసివ్హయ, కోశాంబి, సాకేత, శ్రావస్తి, సేతవ్య, కపిలవస్తు, కుసినార, భోగనగరం మీదుగా వైశాలికి వెళ్ళినట్లుగా ఉన్న పాఠాలను వ్రాశారు. ఇవన్నీ 'పాళీ' భాషలోనివి. వ్రాతపూర్వకమైనది, అందులోనూ పాళీ భాషలోని సుత్తనిపాతం నుండి ఉదహరించినప్పుడు కాదనటం ఎలా? కనుక అంగీకరించవలసిందే! అంతేకాదు. నేను చెప్పిన కాశీకి సమీపంలోని గోదావరి తీరం నుండి బావరి శిష్యులు అప్పుడు సారనాథ్‌లోనున్న బుద్ధుని కలిశారన్నమాట పై సాక్ష్యంతో వీగిపోతోంది. ఈ విధంగా నేను వ్రాసిన వ్రాతకు ఇప్పటికిప్పుడు చూపటానికి నా వద్ద ఎలాంటి సాక్ష్యమూ లేదు. అయితే నేను చదివి వ్రాసిందే తప్ప అది నా ఊహనుండి మాత్రం వచ్చింది కాదని త్రికరణ శుద్ధిగా చెప్పగలను. ఆ గ్రంథం పేరు నాకు ప్రస్ఫుటంగా జ్ఞాపకం రావటంలేదు! దీనికి నన్ను క్షమించక తప్పదు.

ఇక పైన మోక్షానందగారు 'పాళీ' భాషలోని సుత్తనిపాతం లోనిదిగా చూపిన మార్గం నిజామాబాద్ జిల్లా పైఠాను నుండి వైశాలి వరకు చూపిన మార్గం సరియైనదేనా? పైఠాన్ నుండి వైశాలికి వెళ్ళటానికి అంత గజిబిజి మార్గంలో వారెందుకు ప్రయాణం చేసినట్లు. ఎవరైనా తిన్ననైన మార్గంలో వెళతారు తప్ప గజిబిజి (వంకర, చుట్టూ తిరిగిన మార్గాలు) మార్గంలో వెళతారా? (2) 'పాళీ' అనే భాష వుందా? అయితే ఎక్కడ! ప్రపంచంలో ఎక్కడైనా సాధారణ విషయమేమంటే – భాష, ఆ భాష మాట్లాడేవారు, వారుంటున్న ప్రాంతాల పేర్లు ఒకటిగా వుంటాయి. అయినప్పుడు పాళీ మాట్లాడిన జాతి ఏది? వారు ఏ ప్రాంతంలో వుండేవారు? ఇంతకూ సుత్తనిపాతం ఎపుడు వ్రాయబడింది? బుద్ధునికి ఎంత తరువాత? అది నమోదయింది. బుద్ధుని కాలంలో కాదుగదా! సింహళంలోగదా అని రికార్డు అయింది. మొదట రికార్డు అయింది ఏ భాషలో! బుద్ధుడు మాట్లాడిన భాష ఏది?

నా భావన ఏమంటే – పాళీ అనే భాష లేదు. ఆ పేరుతో చెప్పబడుతోంది ఆంధ్ర ప్రాకృతం. 'పాళీ' అనేది వ్రాసే పనిముట్టు (Nib). ఈ పదం మరే భారతీయ భాషలోనూ (ఆంధ్రములో) తప్ప కనిపించదు. బుద్ధుడు ఆంధ్రజాతిలోని శాక్య, గణంలోని వాడు. ఆయన తల్లి, భార్య కొటయాగణంలోని వారు, వీరు ఆంధ్రులే. 'కొటియా' అనే జాతివారు నేడు ఒక గిరిజన తెగగా అరకు లోయలో వున్నారు. వారు మాట్లాడే భాష కొటియా ఒరియా. బుద్ధుడు ఆంధ్రుడు కనుకనే ఆంధ్రులు బౌద్ధాన్ని అనుసరించారు. బుద్ధుని మహాపరినిర్వాణం తరువాత, మౌర్యుల అణచివేత కారణంగా ఆంధ్రులు ఉత్తర భారతం నుండి దక్షిణానికి ముఖ్యంగా ఒక గణం శ్రీకాకుళం నుండి నెల్లూరు వరకు వ్యాపించారు. అందువల్లనే బుద్ధస్థూపాలు తీరంవెంబడి అధికంగా కానవస్తాయి. ఆంధ్ర బ్రాహ్మణులు బౌద్ధాన్ని అనుసరించారు గనుకనే ఉత్తరాది బ్రాహ్మణులు వీరిని బ్రాహ్మణులుగా అంగీకరించరు. ఆంధ్రదేశం ఉత్తరప్రదేశ్‌కు ఎగువన నేపాల్‌కు దిగువ వుండేది. కోసల అందులో భాగం. ఆంధ్ర పదాలు ఇప్పటికీ వాడుకలో వున్నాయి. ఆంధ్రము వేరు. తెలుగు వేరు. ఇందులో ఇక్కడ మీరు చదువుతున్న భాష తెనుగు. ఆంధ్రము తెలుగుల కలయిక తెనుగు. ఆంధ్రమునే పూర్వకవులు మార్గ అని తెలుగును దేశి అని అన్నారు. ఆంధ్రము తెలుగు – రెండూ ప్రాకృతాలే. ద్రావిడ భాషలనేవి లేవు. ద్రావిడ జనులు లేరు. ద్రావిడ ఒక జీవన విధానం మాత్రమే. ఆర్య మరో పద్ధతి. అవి జనులలోని విభాగాలు కావు. జీవన శైలులలోని భేదాలు. తమిళమన్న పదమే ద్రవిడనుండి ఉత్పన్నం. ద్రవిడ సంస్కృత పదం. అంటే ధనమని అర్థం. ఇదంతా ఎందుకు చెప్పవలసివచ్చిందంటే – భారతీయ భాషలన్నీ ప్రాకృతాలే. భారతదేశం 56 ప్రాదేశిక ప్రాంతాల సమ్మేళనం. ఏభైఆరు

జాతుల జనులు, వారివారికి వేర్వేరు భాషలున్నాయి. అందులో 42 ప్రముఖంగా చెప్పబడ్డాయి. వీటిల్లో ఎక్కడా పాళీ ప్రస్తావన లేదు.

ఇక వారు చెప్పిన ప్రతిష్ఠాన, మాహిష్మతీ, ఉజ్జయిని, అశ్మక దేశం. అన్నీ ఉత్తర భారతంలోవే. ఆంధ్రులు దక్షిణాపథానికి వచ్చినపుడు, అవే పేర్లు తాము ఏర్పరచుకున్న క్రొత్త ప్రాంతాలకు పెట్టుకున్నారు. కోసల కూడా అలావచ్చిందే. రాజమహేంద్ర వరం నుండి భద్రాచలం వరకు గల భూభాగానికి కోసల అని పేరు. కొండవీడుకు కుండిన నగరమని పేరు. సింహాచలానికి వారణాసీ కటకమని పేరు. మథుర, బృందావనాలు శ్రీకాకుళం జిల్లాలో వున్నాయి. సబ్బవరం, సబ్బయ, భావయ్య బౌద్ధ సంబంధనామాలు. అలాగే ప్రియ అగ్రహారం, భావనారాయణుడు, సత్యనారాయణుడు బుద్ధుని రూపాలే. శ్రీకాకుళం ఆంధ్ర నాయకుడు కూడా. కనుకనే వీరి వార్షిక ఉత్సవాలు వైశాఖ పున్నమినాడు జరుగుతాయి. శంఖచక్రాల అమరిక వ్యత్యస్తంగా వుంటుంది. మీసాలు కూడా వుంటాయి. గాంధార శైలిలోని బుద్ధునికి మీసాలున్నాయి.

ఇక గోదావరి విషయం భారతదేశంలో మొత్తం ఎన్ని గోదావరులున్నాయో నాకు ఇదమిత్థంగా తెలియదు. నాకు తెలిసినవి 1. గంగలో కాశీవద్ద సంగమించిన గోదావరి (ఇప్పుడు లేదు. మేటవేసింది. కాని గోదావరి నది పేరుతో ఒక బజారు వుంది. కేదార ఘాట్ వెళ్ళే దారి అని గుర్తు) 2. తెలంగాణా ఆంధ్ర దేశాలలో ప్రవహిస్తున్న గోదావరి. 3. రాయఘడ్‌ను చుట్టి ప్రవహిస్తున్న గోదావరి. 4 జబల్పూర్ దగ్గర వున్న గోదావరి 5. గుంటూరు జిల్లాలో సీతానగరంవద్ద కృష్ణ నుండి ఒక పాయ చీలింది (నేటి పడమటి డెల్టా మెయిన్ కృష్ణాకాలువ) దాని పేరు తుంగభద్ర. చిలువూరు, తుమ్మపూడి. సంగం జాగర్లమూడి, మున్నంగివారిపాలెం, చుందూరుల మీదుగా ప్రవహించి – ములుకుదురువద్ద – మరో ప్రవాహాన్ని కలుపుకొని నిజాంపట్నం ప్రాంతంలో సముద్రంలో సంగమిస్తుంది. దీనినుండి మెల్లెంపూడి వద్ద మరో పాయ చీలి, నూతక్కి మీదుగా ప్రవహించి పెదపాలెం వద్ద తిరిగి కృష్ణలో కలుస్తుంది. ఇది మరి ఒక గోదావరి. కాగా కర్నూలు శాసనాల్లో కృష్ణానది గోదావరిగా చెప్పబడింది. మంజీరా, తుంగభద్ర, బాహుద ఇవన్నీ ఉత్తర భారతదేశంలో వున్నాయి. గంగలో కలుస్తాయి. యమునకు కృష్ణ అని పేరు. నేపాల్‌లో మరో కృష్ణ ఉంది. కనుకనే వ్యాసుడు కృష్ణద్వైపాయనుడు. ఆంధ్రుల రాకతో, నదుల పేర్లన్నీ దక్షిణాపథానికి వచ్చాయి. గోదావరి, గోద, వరి శబ్దాల కలయిక వల్ల ఏర్పడింది. గోద – గొడ్డు గోదాలోనిది. గొడ్లు ఎనుములు, గోద – గోజాతి పశువులు. వరి అంటే నీరు. పోల్చి చూడు వరిబీజం (హైడ్రోసిల్, బుడ్డ) నీటి అవసరం ఎక్కువైన పంట గనుక అది వరి. వరి ఆంధ్రుల ఆహారమని ఋగ్వేదం చెప్పిన మాట. గోదావరి అంటే గోవులు దిగి దాటి వెళ్ళగలిగిన రేవు గల ప్రవాహం అని అర్థం. Oxford అంటే కూడా అదే అర్థం.

ఇక సుత్తనిపాతంలో సూచించిన మార్గం గజిబిజిగా ఉండటానికి గల కారణాలు భావరి శిష్యులు, గోదావరి తీరం నుండి బుద్ధుని కలుసుకోవడానికి వెళ్ళారన్న విషయం మాత్రమే తెలిసినవారు. ఎంతో కాలం తరువాత వారు (సుమారు మూడు శతాబ్దాలు) బుద్ధుడు నడయాడిన ప్రాంతాలు కొన్ని తెలిసినవారు. భౌగోళిక స్వరూపం తెలియనివారు వ్రాసిన వ్రాతల వలన అలాంటి స్థితి ఏర్పడింది.

మొదలు ఈ విషయమై నేను పట్టించుకోవడానికి కారణం సుమారు 18, 19 ఏళ్ళకు పూర్వం బుద్ధుడు ఆంధ్రుడా! అనే ప్రసంగం సేలంలో భారతీయ స్థల నామ సంస్థ వార్షిక సదస్సులో చేయబడింది. విషయ సేకరణలో వుండగా తిరుపతి నుండి అప్పటికి కొన్నేళ్లకు పూర్వం ఆచార్య కొత్త సచ్చిదానంద మూర్తిగారు ఢిల్లీలో బుద్ధుని విషయమై చేసిన ప్రసంగ పాఠ ప్రతిని శ్రీ గూడపాటి సాంబశివరావుగారు పంపారు. దానిలో శ్రీ మూర్తిగారు మోక్షానందగారు చెప్పిన విషయమే చెప్పారు. ఆ విషయమై శ్రీ మూర్తిగారికి ఉత్తరం రాస్తూ నేను చదివిన గ్రంథం (ఇప్పుడు పేరు మరచిపోయానని ముందు చెప్పాను) గ్రంథాన్ని ఉటంకిస్తూ తాము ఇలా చెప్పారేమి అని వ్రాశాను. దానికి వారు సమాధానం వ్రాస్తూ అది తాము విన్న విషయమేనని, అది వ్రాయాలంటే భారతదేశపు ప్రాచీన భూగోళ శాస్త్ర పరిజ్ఞానం అవసరమని దానిలో తనకు ప్రవేశం లేదని నేను చేస్తున్న కృషికి – అభినందనలు అని వ్రాశారు. ఈ విషయమై నాకు తెలిసినది ఇంత మాత్రము. సత్య సర్వం ప్రతిష్ఠితమ్. మి

యార్లగడ్డ బాలగంగాధరరావు

# అట్టమీది బొమ్మలు

'ఒక్క సిరా చుక్క లక్ష మెదళ్ళకు పదును పెడుతుంది.'

నేషనల్ లైబ్రరి కలకత్తా వారు విజయవాడ బుక్ ఫెస్టివల్ వారి ఆధ్వర్యంలో, 'సెమినార్ ఆన్ డెలివరీ ఆఫ్ బుక్స్ & న్యూస్‌పేపర్స్' పేరున ఒక సదస్సు నిర్వహించారు. విజయవాడ లయోలా కాలేజీ వారు తమ ఆవరణలో పీఠాధిక సేవలందించారు. పొద్దుట 10.00 గం॥ల నుంచి మధ్యాహ్నం 1.30 ని॥ల వరకు ఒక సెషన్, ఆ తరువాత లంచ్. తిరిగి 2.30 ని॥ల నుండి సాయంత్రం 5.00 గం॥ల వరకు ఒక సెషన్. ఇలా నవంబర్ 27, 28 తేదీలలో రెండురోజుల పాటు సుమారు 50 మంది ప్రతినిధులతో చర్చలు కొనసాగించారు (మిసిమి తరఫున సంపాదకులు అశ్వినీకుమార్, ఉపసంపాదకులు కాండ్రేగుల నాగేశ్వరరావు హాజరయ్యారు).

క్రమేపీ తగ్గుతూ వస్తున్న పాఠకుల రీడబిలిటీ మూలిగిపోతూ కాంతివిహీనమవుతున్న చదువుల తల్లి ప్రాంగణమైన గ్రంథాలయాలకు తిరిగి పునఃవైభవం గావించటంకోసం 14 సంవత్సరాల సుదీర్ఘ నిర్లిప్తత అనంతరం కేంద్ర ప్రభుత్వం దృష్టి సారించటం చదువరులైన పాఠకులకు ఒక శుభ సందేశాన్నందించింది.



నేషనల్ లైబ్రరి, కలకత్తా

పబ్లిషర్లు తగ్గిపోతూ రచయితలే తమ పుస్తకాలను తామే అచ్చువేసుకొని ప్రచురించుకుంటున్న ఈ రోజుల్లో తమ పుస్తకాలయొక్క రెండు ప్రతులను నేషనల్ లైబ్రరీకి పంపవలసి వుంది. లేకుంటే అపరాధ రుసుము విధించబడుతుంది.

**మరి దీనివల్ల రచయితలకు కలిగే లాభం ఏమిటి?**

మొదటిది ప్రభుత్వ ఆధీనంలో మీ పుస్తక ప్రతి శాశ్వతంగా కొన్ని వందల సంవత్సరాల పాటు భద్రపరచబడుతుంది. రెండు ఆధునిక టెక్నాలజీ సాయంతో డిజిటలైజ్ చేయబడి మరింత ఉపయోగంలోకి వస్తుంది. అంతేకాకుండా పుస్తకపు యొక్క విలువను స్టార్ రేటింగ్ ఇచ్చి పదిమందికీ తెలియపరుస్తుంది. నేషనల్ లైబ్రరీ డిప్యూటీ డైరక్టర్ అయిన శ్రీమన్ సర్కార్ ఈ విషయాలను విశదీకరించి, అందరి సందేహాలు తీర్చారు.

ప్రపంచంలో ఎన్నో గొప్ప గ్రంథాలయాలున్నాయి. అక్కడ పుస్తకాలతోపాటు ఆ పరిసరాలను కూడా సుసంపన్నం చేసే కళాకృతులు కూడా ఉన్నాయి. వాటికన్‌లోనున్న చర్చి ప్రాంగణం లోని లైబ్రరీ హాలులో రేఫెల్ చిత్రించిన 'స్కూల్ ఆఫ్ ఎథెన్స్' ప్రపంచపు 10 గొప్ప చిత్రాలలో ఒకటిగా నిలిచింది.

ఆధునిక యుగంలో వాషింగ్‌టన్‌లోనున్న జెఫర్ సన్ లైబ్రరీ ఈ కోవకు చెందింది. ప్రజాస్వామ్య ప్రభుత్వంగా పేరొందిన అమెరికాలో కొంత కాలం వరకూ డెమోక్రటిక్ పార్టీ ఒక్కటే ఉండేది. ప్రభుత్వ నిర్ణయాలలోని లోటుపాట్లను, వాటి అమలులో జరిగే ఉదాసీనత, అసంఘత్వం ఎత్తిచూపటానికి ప్రతిపక్షం అవసరం ఎంతైనా వుంది. డెమోక్రటిక్ పార్టీకి వ్యతిరేకంగా కొందరు స్వతంత్ర అభ్యర్థులు పోటీ చేసేవారు. ఎవరికి వారే యమునా తీరే అనే రీతిలో విమర్శలు సాగుతుండగా నిర్మాణాత్మక ప్రతిపక్షంగా 'డెమోక్రటిక్ రిపబ్లికన్' పేరుతో ఒక పార్టీని స్థాపించి, మొదటిసారిగా ఆ పార్టీ తరఫున అధ్యక్ష స్థానాన్ని అధిష్టించిన వ్యక్తి అతనే. జెఫర్‌సన్ సహాయ సహకారాలతో ఈ లైబ్రరీ 1802 వ సంవత్సరంలో 5,000 డాలర్ల ఖర్చుతో ప్రారంభం కాబడి, అనేక బాలారిష్టాలను దాటుకుంటూ (1812 ఒకసారి, 1915 మరొకసారి అగ్ని ప్రమాదానికి ఆహుతై 35 వేల పుస్తకాలు తగలబడిపోయాయి) 1859 వ సంవత్సరంనాటికి అమెరికాలోనే కాక ప్రపంచంలోనే అగ్రగామి లైబ్రరీలో ఒకటిగా పేరుగాంచింది. 1897 వ సంవత్సరంనాటికి సేకరించబడిన మొత్తం పుస్తకాలు 8 లక్షల 40 వేలు కాగా 1939 నాటికి 10 లక్షల 40 వేల పుస్తకాలు నమోదయ్యాయి. 2014 లెక్క ప్రకారం అందులో ఉన్న మొత్తం పుస్తకాలు 160 మిలియన్లు. అంటే 1 కోటి 60 లక్షలు. చూపులద్వారా సౌందర్యాన్ని, మనసు ద్వారా మానవతా చైతన్యాన్ని రగిలిస్తూ రెండు విధాలా హృదయాన్ని రంజింపచేయటం ఈ లైబ్రరీలో మనకు ప్రత్యక్షంగా కనబడుతుంది. ఇందులో అలంకరించబడిన చిత్రాలు రినైజాన్స్ ఆర్ట్ కు కొనసాగింపు.

**ముఖచిత్రం : మినర్వా ఆఫ్ పీస్.**

**చిత్రకారుని పేరు : Elifu Vedder**.

మినర్వా చదువులకు, కళలకు కేంద్రబిందువైన మన పురాణాలలో సరస్వతిలాంటి దేవత. **రెండవ అట్ట : కాలపురుషుడు.** ఇది నేషనల్ ఆర్ట్ గ్యాలరీలో ఉన్నది. చిత్రకారుడు Elifu Vedder.



జెఫర్‌సన్



జార్జి లూకాస్

**మూడవ అట్ట : నిర్మాణం.**

ఈ చిత్రం నేషనల్ ఆర్ట్ గ్యాలరీలో ఉన్నది.

**నాలుగవ అట్ట : Guinevere.**

**జార్జి లూకాస్ ఆర్ట్ గ్యాలరీ – షికాగో –**

ఈ ఆర్ట్ గ్యాలరీ 2018లో ప్రారంభించబడుతుంది. ఇందులో ముఖ్యంగా ఇలస్ట్రేటివ్ ఆర్ట్ కు పెద్దపీట వేస్తున్నారు. అదే కాకుండా ఆ చిత్రాలన్నీ వివిధ చలన చిత్ర ఆర్ట్ డిపార్ట్‌మెంట్ వారు ఉపయోగించినవే. స్టార్‌వార్స్ అనే ట్రియాలజీ, ఇండియానా జోన్స్ లాంటి చిత్రాలు తీసిన జార్జి లూకాస్ అత్యంత ఖరీదైన ప్రజారంజక చిత్రకారుడుగా పేరుగాంచాడు. తాను సంపాదించిన ఆస్తిలో సగ భాగం దానం చేయాలని నిర్ణయం తీసుకున్నారు. బిల్‌గేట్స్ వారెన్ బఫెట్ మార్గంలో ప్రయాణిస్తున్న మరో వితరణశీలి అతను. దీనిలో భాగంగా ఈ మ్యూజియ నిర్మాణం కొనసాగుతుంది. జార్జి లూకాస్ రైటర్, ప్రొడ్యూసర్, డైరక్టర్. చిన్నతనంలో ఫొటోగ్రఫీ అంటే చాలా ఇష్టం. మొదట్లో కొన్ని అవ్యక్త, ఆధునిక ఇంగ్లీషు గేయాలను 16 ఎమ్ఎమ్ లో చిన్న చిన్న చిత్రాలుగా నిర్మించి ప్రదర్శించారు. ఒక నీగ్రో అమ్మాయితో కలిసి, ముగ్గురు అమ్మాయిలను దత్తత తీసుకున్నారు. వీరంతా స్టార్‌వార్స్ చిత్రంలో నటించారు. అతనికి జన్మించిన ఒక కొడుకు, ఒక కూతురు ఉన్నారు. మొదటి భార్య విడాకులు తీసుకున్న తర్వాత, 2013 సంవత్సరంలో, 70 ఏళ్ళ వయసులో మెలెడీ హాబ్‌సన్ ను వివాహం చేసుకున్నారు. జనరంజక చిత్రాలు తీయాలని ఆశించిన ల్యూకాస్ తన చిత్రాలలో లాజిక్‌కు ప్రాధాన్యత ఇవ్వరు. అందుచేతే 1983 లో తీసిన స్టార్‌వార్స్ చిత్రానికి గాను ఉత్తమ చిత్రం, ఉత్తమ దర్శకుడు, ఉత్తమ స్క్రీన్‌ప్లే రైటర్‌గా ఆస్కార్ నామినేషన్ పొంది, ఉత్తమ చిత్ర నిర్మాతగా అవార్డు గ్రహించారు. అదే సంవత్సరం, అదే సినిమాకి చెత్తలో చెత్త అనే అవార్డుల పంపకంలో పేరుగాంచిన గోల్డెన్ రోస్‌బెరీ అవార్డు ఉత్తమ చెత్త చిత్రం, ఉత్తమ చెత్త దర్శకుడుగా నామినేషన్ పొందటం ఒక వింత.

**నేషనల్ లైబ్రరి ఆఫ్ కాంగ్రెస్, జెఫర్‌సన్ బిల్డింగ్, వాషింగ్‌టన్ డి.సి. :**

ఎన్నో అద్భుతమైన చిత్రాలతో ఈ లైబ్రరీ గోడలన్నీ అలంకరించారు. అందులో ముఖ్యంగా – ప్రజా ప్రభుత్వము, పరిపాలనా విధానాలు ప్రపంచానికి ఏ విధంగా మేలు చేస్తాయో, అవినీతి, ఆశ్రిత పక్షపాతం ఎంత వికృతంగా తాండవిస్తుందో కళ్ళకు కట్టినట్టు చూపించారు. అలాగే ప్రజలకు సంపద, శాంతి ఉంటే ఏ విధంగా ఉంటుందో అది కూడా తైలవర్ణ చిత్రాలలో ప్రదర్శించాడు.

(పుటలు 4, 6, 35 లోని రేఖాచిత్రాలు : వెంటపల్లి సత్యనారాయణ)



ప్రభుత్వం



అవినీతిమయ ప్రభుత్వం



అరాచకం



సుపరిపాలన



శాంతి, సంపద

# వేదనాదం

– దాశరథి రంగాచార్య

వేదంలోనే సకలమూ – సమస్తమూ – సర్వమూ ఉందనే సనాతనలున్నారు.

వేదంలో ఏమీ లేదు. అదంతా అవాస్తవం – మిథ్య – దోపిడీ అనే ప్రగతివాదులూ ఉన్నారు.

ఈ ఉభయుల్లో ఎవరూ వేదం చదివి ఈ నిర్ణయానికి రాలేదని నా అభిప్రాయం.

ఒకరు కేవలం విశ్వాసంమీద ఆ అభిప్రాయం ఏర్పరచుకున్నారు. మరొకరు భారతదేశంలో చెప్పుకోదగింది ఏదీ లేదనే సిద్ధాంతంమీద, పాశ్చాత్యులు రచించిన గ్రంథాల ఆధారంగా – తిరుగులేని అభిప్రాయాలు ఏర్పరచుకున్నారు.

ఇరవయ్యో శతాబ్దపు నాలుగు, అయిదు దశకాల్లో సమాజవాద సాహిత్య ప్రభావంతో నేనూ ప్రగతివాద భావాలనే నిశ్చయంగా నమ్మాను. 'మంచి గతమున కొంచెమేనోయ్' అనుకున్నాను. "గతానికి మతానికి కళ్ళు లేవు. మనిషికి మనసుకూ కళ్ళు లేవు" అన్నాను. వేదమూ, పురాణాదులూ బ్రాహ్మణులు, ప్రభువులను, వారి దోపిడీని బలపరచడానికి సృష్టించిన అభూత కల్పనలు అనుకున్నాను.

'సత్యం' మానవునికి అందేదికాదు. వాస్తవంకూడ తెలియడం దుస్తరం. వాస్తవం ఉపనిషత్తులందలి 'బ్రహ్మము' వంటిది. దానికి విద్వాంసులు ఏ రూపాన్నిస్తే సామాన్యులు ఆ రూపాన్నే చూడగలరు.

భారత చరిత్రలో బ్రాహ్మణులు – మేధావులు – ఏ నాడూ ప్రభువుల దోపిడీకి సహకరించలేదు. ప్రభువుల దుశ్చర్యలను ఖండించడానికీ, వారిని సక్రమ మార్గాన నడిపించడానికి తమ శక్తియుక్తులను ప్రయోగించారు – ఉపయోగించారు.

అందుకు స్వస్తి ప్రజాభ్యః – ప్రజలకు శుభం కలగాలి. 'పరిపాలయంతాం న్యాయ్యేన మార్గేణ మహీ మహీశాః' – పాలకులు ఈ భూమిని న్యాయమార్గాన పరిపాలింతురు గాత! అనే నినాదం నిదర్శనం. విపులంగా చర్చించడానికి ఇది సందర్భంకాదు.

భారత సాహిత్య, సంస్కృతులను అధ్యయనం చేసిన పాశ్చాత్య విద్వాంసులు తమ చరిత్ర, నాగరకతలను దృష్టిలో ఉంచుకొని మన వాటిని వ్యాఖ్యానించారు. ఆంగ్లేయులు మనను రాజకీయ బానిసలను మాత్రం కాదు – సాంస్కృతిక బానిసలను చేశారు. మనం వదిలించుకున్నది రాజకీయ బానిసత్వాన్ని మాత్రమే!

భారతదేశంలో మతం – ప్రభుత్వం ఎన్నడూ కలిసిలేవు. ఈ 'మతం' అనే పదం కూడా పడమటి దిగుమతియే! మనది ధర్మం. 'ధర్మం' 'ప్రభుత' రెండు ప్రత్యేక వ్యవస్థలుగా వర్ధిల్లాయి. విశ్వామిత్రుని వృత్తాంతం ఇందుకు నిదర్శనం. అతడు ప్రభుత్వాన్ని వదిలి ధర్మాన్ని వరించాడు. అలాంటి రాజర్షులు అనేకులు ఉన్నారు.

అనంత భారత చరిత్రలో 'ప్రవక్త'లను హింసించిన, ఉరితీసిన, శిలువలకు ఎక్కించిన ఉదంతాలు మచ్చుకైనా లేవు. క్రైస్తవం సుమారు బౌద్ధానికి అనుకరణమే! వేదాలను నిరసించినా – బుద్ధ భగవానుని, మహావీర వర్ధమానుని సకల భారతజాతి గౌరవించింది. వారి ముందు మోకరిల్లుతుంది. ప్రభుత్వాలు వారికి దాసోహం అన్నాయి. భారతజాతి తాత్త్విక చరిత్ర – రాజకీయ చరిత్ర కాదు.

జాబాలి, చార్వాకులు నాస్తికులు, హేతువాదులు. అయినా, భారతజాతి వారిని శిక్షించలేదు. వారి ఆలోచనా విధానాన్ని నహితం తుడిచిపెట్టలేదు. తనలో ఇముడ్చుకుంది!

క్రీస్తు, మహమ్మదు ప్రవక్తలకు ముందు చరిత్ర లేదా? ఉంటే – ఆ చరిత్రను ఆయా మతాల రంగు పులిమి అధ్యయనం చేయడం వాస్తవమగునా? సత్యమగునా? ఇది సంకుచితం కాదా?

నాకు మతద్వేషమే కాదు – ఏ ద్వేషమూ లేదనే విషయం 'జీవనయానం' పాఠకులు గ్రహించి ఉంటారు. నేను నిత్యాన్వేషిని. నా అన్వేషణ ఈ జన్మతో మాత్రమే

మొదలైంది కాదు. ఈ జన్మలో నిలిచిపోదు. నేను ద్వేషాన్ని ద్వేషిస్తాను. ప్రేమను ప్రేమిస్తాను.

*ఇష్క్ కోయీకిసీకె మర్నేసె మర్‌జాతానహీ*

*రూహ్‌మెఁ ఘుమ్‌బన్కె రహజాతాహై జాతానహీ*

*(వలపు ఏ ఒక్కని చావుతోనో చచ్చేది కాదు.*

*మనసులో వలపు గూడు కట్టుకుంటుంది పోదు.)*

నా అన్వేషణమూ ఒక వలపే.

భారతదేశపు ఉదార తాత్త్వికతను పాశ్చాత్యుల సంకుచిత దృష్టితో పరిశీలిస్తే అర్థం కాదు అనే విషయం సమాజవాదపు కోట ద్వారాలు తెరుచుకొని బయటపడ్డాక అర్థం అయింది.

అప్పుడు నాకు హిమవదున్నత భారత తాత్త్విక చింతన దర్శనం ఇచ్చింది. గంగవలె నిరంతరం నిర్మలంగా ప్రవహిస్తున్న భారత సంప్రదాయం దర్శనం ఇచ్చింది. గగనతలం కన్నా విశాలమైన సాహిత్యం దర్శనం ఇచ్చింది. సముద్రంకన్న లోతైన భారత ఆలోచనా విధానం దర్శనం ఇచ్చింది.

ఇది మహా విశ్వదర్శనం. ఇది అనంత దర్శనం. ఇది అనాది దర్శనం. ఇది నన్ను చకితుణ్ణి చేసింది. సంభ్రమాశ్చర్యాల్లో ముంచింది. ఉక్కిరి బిక్కిరి చేసింది. సచేతనుణ్ణి చేసింది.

ఆ ప్రభావంతో – ఆ స్ఫూర్తితో – ఆ జ్ఞానంతో – ఆ చైతన్యంతో వాల్మీకి రామాయణం (1963), వ్యాస భాగవతం (1968), వ్యాస మహాభారతం (1994) సరళ తెలుగు వచనంలో సవ్యాఖ్యానంగా ప్రచురించాను. నన్నయకు ముందునుంచి నేటివరకు ఈ మూడు గ్రంథాలను ఒకే రచయిత రచించిన నిదర్శనాలు అరుదు. ఇది భగవానుడు ప్రసాదించిన శక్తి – కేవలం భగవదనుగ్రహం. కాకున్న నాలాంటి సామాన్యునికి ఇది దుస్సాధ్యం – అసాధ్యం.

హరివంశ సహిత శ్రీమహాభారత రచన, ప్రచురణ తరువాత భగవానుడు వేదాలను అనువదించే సంకల్పం కలిగించాడు. భగవానుడే సంకల్పం కలిగించాడని ఎందుకంటున్నానంటే – వేయేళ్ల ఆంధ్ర సాహిత్య చరిత్రలో ఈ సంకల్పం కలిగిన జాడ అరుదుగానైనా కనిపించదు. నేను సామాన్యునికి అర్థం అయ్యే సరళ ఆంధ్ర వచనానువాదం సంకల్పించాను.

నన్నయ భట్టారకుడు శ్రీ మహాభారత ఆంధ్రానువాదాన్ని స్వచ్ఛందంగా చేపట్టలేదు. సంస్కృతం నుంచి అనువదించడానికి వెనుకాడాడు. ఒక రాజకీయ ప్రయోజనం కోసం రాజు అర్థించగా చేశాడు. తిక్కనామాత్యుడు ఆంధ్ర మహాభారత రచన సాగిస్తూ, భగవద్గీతను అనుసరించడానికి జంకాడు. కేవలం 42 గద్యపద్యాల్లో ముగించాననిపించాడు.

అలాంటప్పుడు అనేక విధి నిషేధాలున్న వేదాలను సామాన్య పాఠకులకు అర్థం అయ్యేలా తెలుగులో అనువదించ సంకల్పించడం ఎంత సాహసమో గ్రహించాలి. అందుకే ఇది కేవలం భగవంతుడు కలిగించిన సంకల్పం అని విన్నవించాను.

అసలు సవ్యాఖ్యానంగా నాలుగు వేదాల్ను సంపాదించడం గగనం అయింది. తెలుగులో లేవు. దేవనాగరి సంస్కృతంలో అన్ని వేదాలనూ ఒకే ప్రచురణ సంస్థ ప్రచురించలేదు. గ్రంథాలు సాధించడమే ఒక యజ్ఞం అయింది. ఆ మహాయజ్ఞ విషయం శ్రీమదాంధ్ర వచన ఋగ్వేదసంహిత పీఠికలో వివరించాను.

యజ్ఞయాగాది క్రతువుల జోలికి పోలేక కేవలం భగవారాధన చేసి, భవ పుష్య పౌర్ణమి 16–1–95 న ఋగ్వేద సంహిత ఆంధ్రవచనానువాదం ప్రారంభించాను. నిద్రాహారాలు పట్టించుకోక నిరంతరం రోజుకి పది, పన్నెండు గంటలు శ్రమించి కృష్ణ యజుర్వేద సహితంగా నాలుగు వేదాల ఆంధ్ర వచనానువాదం ఈశ్వర పుష్య శుక్ల ఏకాదశి 24–1–98 ఉదయం 9.15 కు ముగించినప్పటి మహాదానందం అనుభవించాల్సిందే! అక్షరానికి అందదు. ఆనాడు సకుటుంబ బాంధవంగా జీడికంటి రామచంద్రస్వామిని దర్శించుకొని, మరుసటిరోజు యాదగిరి లక్ష్మీనరసింహస్వామి వారి కళ్యాణం చేయించాం. చేయించడానికి మనం ఎంతటివారలం? ఆ స్వామియే చేయించుకున్నాడు.

ఇంత తొందరేల? అంటే, నేను 70 ఏళ్లవాణ్ణి. జీవితపు చరమాంకంలో ఉన్నాను. వేదాలను అనువదించి, ఆంధ్రులకు అందించకుండా వెళిపోతానేమోనని భయం! "క్షుద్రం హృదయం దౌర్బల్యం" అన్నాడు కృష్ణపరమాత్మ. భగవంతుడే నీతో పూర్తి చేయించదలచినాక భయమేల? అంటే, అజ్ఞానం! నేను మానవమాత్రుణ్ణే!! ఈ మహదనువాద

కార్య మహాయజ్ఞంలో ఏ ఒక్కరూ నాకు సాయపడ్డవారు లేరు. వారించిన, ఆటంకపరచిన, దుష్పరిణామాలు చూపి భయపెట్టిన మహానుభావులున్నారు. కనీసం పుస్తకం వెదికి అందించినవారు లేరు. వ్యాస భగవానునికి గణపతి వ్రాయసకాడయినాడు. నాకు వ్రాయసగాడూ లేడు. ఈ వయసులో, అంతంత మాత్రపు ఆరోగ్యంలో అయిదువేల పేజీలు వ్రాశాను! ఇది సామాన్యం కాదు!! ఇదీ ఈశ్వరుడు ప్రసాదించిన శక్తియే!!

ఒకే వ్యక్తి ఆధునిక సాహిత్యపు నవలలు మున్నగునవి వ్రాసి; రామాయణ, భారత, భాగవతాలూ నాలుగు వేదాలూ అనువదించిన నిదర్శనాలు భారత సాహిత్య చరిత్రలోనే కొదువ! యావద్భారతంలోనూ ఒక్కడే నాలుగు వేదాలు అనువదించడం అరుదాతి అరుదు. ఇది వాస్తవాలు తెలియపరచడానికే! నాకు గర్వం లేదు. ఏలనన–

*పలికెడిది భాగవతమట / పలికించు విభుండు రామభద్రుండట నే*
*బలికిన భవహరమగునట / పలికెద వేరొండుగాథ బలుకగనేలా!*

నాది పోతన మార్గం. నన్ను నేను కర్మయోగిని అనుకుంటాను. నాది శ్రీనాథుని దారికాదు. కావుననే భగవదనుగ్రహం తప్ప అన్యం అంతగా ఆర్జించినవాణ్ణి కాదు. అయినా గ్రాస వాసో దైన్యం జాడలేదు.

**అనువాద యజ్ఞం :**

అనువాదం కష్టం. వాదం సులభం, అనువాదం దుస్తరం. అందునా వేదానువాదం అసాధ్యం కాకున్నా దుస్సాధ్యం. 'సంస్కృతం' సొంతం ఒకే భాష కాదు. కావ్య, వైద్య, జ్యోతిష, పురాణాది సంస్కృతాలు వేరు వేరు. ఎవరికి వారికి వారి శాఖాసంస్కృతమే తెలుస్తుంది. సమస్త సంస్కృతం తెలిసినవాడుండడు.

నాకు కావ్య సంస్కృతం తెలుసు. ఆ పరిజ్ఞానం కరదీపిక అవుతుంది కానీ పదార్థం కాదు. కాబట్టి వేద సంస్కృతం అర్థం చేసుకోవడానికి అహరహం కృషి చేశాను. అయినా అది నాకు పరిపూర్ణంగా ద్యోతకం అయింది అనజాలను. సాయణాచార్య, మహీధర, ఉపటాచార్యుల వ్యాఖ్యానాల, అన్య అనువాదాల ఆధారంగా అనువదించాను. 'వేదం' సామాన్యం కాదు. పౌరుషేయం కాదు. అపౌరుషేయం. వేద మంత్రపు లోతు తెలియడం అసాధ్యం. అనువాద యజ్ఞం వంటరిగా చేస్తున్నప్పుడు ఒక్కొకసారి ఏడ్చాను. ఇంత మహత్కార్యానికి ఎందుకు పూనుకున్నట్లు? ఆ మేరు పర్వతాన్ని ఈ సామాన్యుడు మోయగలడా? అలాంటి దిగజారుడు, మానసిక బలహీనత, హృదయ దౌర్బల్యంలో ఒక తేజోకిరణం దర్శనం ఇస్తుంది. 'ఆగకు, సాగు' అన్నట్లు బోధిస్తుంది. కన్నీరు తుడుస్తుంది. ముందు నడుస్తుంది. నన్ను నడిపిస్తుంది!

నేను ప్రతి మంత్రాన్నీ అర్థం చేసుకోవాలి. అనుమానాలను నివృత్తి చేసుకోవాలి. మంత్రం తన పరిపూర్ణజ్యోతితో నాకు దర్శనం ఇవ్వాలి. నాకు అర్థం కానిది నేను చెప్పలేను. అర్థం అయిన దాన్ని అనువదించాలి. తేటతెనుగులో అందరికీ అర్థం అయ్యే సరళభాషలో చెప్పాలి. అందుకు నేనొక తపస్సు చేశాను. రోజుకు పది, పన్నెండు గంటలు శ్రమించాను. ఇరవై నాలుగ్గంటలు – నిద్రలో సహితం – మంత్రాల మననం. అర్థం వెదకడానికి పలవరింపులూ సహజమైపోయాయి! ఈ స్థితిని ఎవరు సహిస్తారు? కమల సహించింది!

వేదం ముందుంచుకొని కూర్చుంటాను. భయం – ముందు మహారణ్యం కనిపిస్తుంది. సింహాలు, పులులు, సర్పాలూ, మహా మృగాలు కనిపిస్తాయి. అందులో అడుగుపెట్టలేం అనిపిస్తుంది. కాగితంమీద కలం పెడ్తాను. మహారణ్యం రమ్య ఉద్యానం అవుతుంది. సింహాలు, పులులు, సర్పాలూ, మహామృగాలు – లేళ్లు కుందేళ్లు, నెమళ్లు, రంగురంగుల పక్షులు అవుతాయి. రాచబాటలు, పూపొదరిండ్లు, వృక్షచ్ఛాయలు, తామరల కొలనులు అవుతాయి. రచన అనాయాసంగా సాగిపోతుంది. ఏదో మహత్తమ శక్తి నాతో వ్రాయిస్తున్నట్లనిపిస్తుంది! వ్రాస్తున్నంతసేపు ఏదో చల్లని వెలుగు నన్ను నడిపిస్తుంది! కలం సాగుతుంది! మనసు పొంగుతుంది! ఉప్పొంగుతుంది! మహదానందం! 'ఆనందో[బ్రహ్మ!' ఎన్ని విచిత్ర, వింత, విశిష్ట సంఘటనలు! ఒక్కొక్కసారి వాక్యం ప్రారంభిస్తాను. ముందుకు సాగదు. అయోమయం! లిప్తలో కలం వెంట వెలుగు పాయు! వాక్యం పూర్తవుతుంది! అది నాకే ముద్దొచ్చేంత ముద్దుగా ఉంటుంది.

శ్రీమదాంధ్ర మహాభాగవతంలోని 'సిరికింజెప్పడు' పద్యం సాక్షాత్తు శ్రీరామచంద్ర మూర్తియే పూరించాడంటారు. అలాంటి ప్రత్యక్ష అనుభవాలు నాకు కొల్లలు. స్వామి దర్శనం ఇచ్చాడని అబద్ధం చెప్పలేను. కాని, ఆ స్వామియే వ్రాయించిన అద్భుత, ఆశ్చర్యకర,

అనిర్వచనీయ అనుభూతులు అనేకానేకం! అవి అక్షరాల్లో పట్టవు. పిల్లలమర్రి పినవీరభద్రునివలె 'వాణి నా రాణి' అనే సాహసం చేయజాలను. కాని, పోతనవలె సరస్వతిని 'మదంబ' - మా అమ్మ అని సగర్వంగా చాటగలను. నేను ఈ వేదానువాదానికి కర్తను కాను - ద్రష్టను మాత్రమే అనిపిస్తుంది. అనిపించటం ఏమిటి? అదే సత్యం, అదే నిజం, అదే వాస్తవం! ఒక్కొక్కసారి మంత్రం నన్ను ముప్పతిప్పలు పెడ్తుంది. సాయణుని వ్యాఖ్య, అనువాదాలు కరదీపికలు కాలేవు. సతమతం అవుతాను. కొండ నెత్తిన కూలినట్లవుతుంది. ఇహ అనువాదం సాగదు అనిపిస్తుంది. గుబులు పుడుతుంది. అలాంటపుడు నిశ్శబ్దంగా ధ్యానంలోనికి సాగిపోతాను. పరిసరాల ధ్యాస ఉండదు.

అప్పుడు ఒక కాంతి బిందువు కనిపిస్తుంది! అది కాంతి బింబం అవుతుంది! కళ్లు తెరుస్తాను. మంత్రం అర్థం అవుతుంది! వివరణ విదితం అవుతుంది! అనువాదం వెలుగు వాగులా సాగిపోతుంది! భగవానుడు అంతటి కృపాకటాక్షం కురిపించకుంటే ఇంతటి మహాయజ్ఞం, ఇంత కొద్ది వ్యవధిలో పూర్తి కావటం అసాధ్యం - అనితరసాధ్యం - దుస్సాధ్యం!

**అనన్తావై వేదాః :**

'వేదం' ఏకవచనం. వేదం 'పవిత్రవిద్య' అని అథర్వవేదం, శతపథబ్రాహ్మణం, తైత్తరీయ బ్రాహ్మణం చెపుతున్నాయి.

'వేదాః బహువచనం' -

'చత్వారోహ ఇమే వేదా ఋగ్వేదో యజుర్వేదో సామవేద, బ్రహ్మవేద ఇతి' అని గోపథపూర్వము. వేదాలు నాలుగు. అవి ఋగ్వేద, యజుర్వేద, సామవేద, బ్రహ్మవేదములు. బ్రహ్మవేదమే అథర్వవేదము. యజుర్వేదం శుక్లయజుర్వేదం, కృష్ణయజుర్వేదం అనేది. ఏవమిమే సర్వేవేదా నిర్మితాః ససంకల్పాః, సరహస్యాః, సబ్రాహ్మణాః, సోపనిషత్కాః, సేతిహాసాః, సాన్వాఖ్యానాః, సపురాణాః, సస్వరాః, ససంస్కారాః, సనిరుక్తాః, సానుశాసనాః, సానుమార్జనాః, సవాకోవాక్యాః - అని గోపథ బ్రాహ్మణం. వేదాలన్నీ సంకల్పం, రహస్యం, బ్రాహ్మణాలు, ఉపనిషత్తులు, ఇతిహాసాలు, వ్యాఖ్యానాలు, పురాణాలు, స్వరాలు, సంస్కారాలు, నిరుక్తాలు, అనుశాసనాలు, అనుమార్జనాలు, వాక్కు యొక్క వాక్యాల సహితంగా నిర్మించబడినవి. "అనన్తావై వేదాః" "ప్రాజాపత్యోవేదాః" అని తైత్తరీయం. వేదాలు అనేకం. వేదం ప్రాజాపత్యం. 'ప్రజాః సృష్ట్వాపాలయస్వేతి తస్మాత్ప్రజాపతి రభవత్' అని గోపథ పూర్వం. ప్రజలను సృష్టించి పాలించడంవల్ల ప్రజాపతి అయినాడు. వేదాలుసహితం ప్రజాపతి కార్యాన్నే నిర్వర్తిస్తున్నాయి. "అపరిమితోషి ప్రజాపతిః" - ప్రజాపతి అపరిమితుడు. కావున వేదాలు అపరిమితాలు - అనన్తావై వేదాః!

**వేదమేకం చతుర్విధం:**

వేదాలు అపరిమితాలు - అనంతాలు. అట్లయిన వేదాలు నాలుగు ఎట్లయినవి?

*"ఏవం చకార భగవాన్ వ్యాసః కృపణవత్సలః*
*వ్యవధాత్యజ్ఞసంతత్యై వేదమేకం చతుర్విధం"* - అంటుంది శ్రీమహాభాగవత పురాణం.

కృపావాత్సల్య పూర్ణుడగు వ్యాస భగవానుడు అజ్ఞులు, అవ్యవధానులగు సంతతుల కోసం ఒకే వేదాన్ని నాలుగుగా విభజించాడు. వ్యాస భగవానుడు త్రికాలజ్ఞుడు. రానున్న తరాలవారు కేవలం భౌతికావాదులూ, విరామం లేనివారూ అవుతారని గ్రహించి, "చకార వేదమేకం చతుర్విధం" అన్నాడు. 'చకారవేదమేకం చతుర్విధం' అని ఒక్క వాక్యంలో చెప్పాడు వ్యాసుడు. కాని మానవ కళ్యాణమే ధ్యేయంగా తన జీవితాన్నంతటినీ కప్పురంలా అర్పించిన వ్యాసుడు అందుకు ఎంత శ్రమించిందీ చెప్పుకొనలేదు!

అనంతములు, అపరిమితములగు వేదాలను నాలుగు 'వేదసంహితలు'గా విభజించడం మానవమాత్రులకు సాధ్యం అయ్యేపనిమాత్రం కాదు. వ్యాసభగవానుడు - సూర్యదేవునివలె - మధ్యన ఆసీనుడై, గ్రహనక్షత్రాదులవంటి శిష్యగణము పరివేష్టించి ఉండగా ఒక్కొక్క మంత్రానీ, సూక్తాన్నీ ఎందరో చదువుతుండగా నిర్ణయించి పరిష్కరించి ఉండవచ్చు. మనోఫలకంమీద వెలసిన ఆ దృశ్యమే అద్భుతం! ఆశ్చర్యకరం!! ఆనందకరం!!!

వ్యాసభగవానుడు ఎన్ని రాత్రులు, ఎన్ని పగళ్లు, ఎన్ని మాసాలు, ఎన్ని సంవత్సరాలు నిరంతరం కృషిచేసి వేదసంహితలు నాలుగని నిర్ణయించినాడో! ఇవి మాత్రమే వేదములు, అన్యములు కావు అని వప్పించడానికీ వ్యాసమహర్షి, అతని అపార శిష్యగణము ఎంత శ్రమించినారో!! అందును గురించి కనీసం అంచనా

వేయగల శక్తిస్తోమతలు మనకు లేవు. మనది అల్పబుద్ధి! మనం అల్పాయుష్కులం!! వ్యాసభగవానుడు మానవజాతికి చేసిన అనంత సేవను గురించి చెప్పుకునే శక్తి లేదు ఈనాటి దౌర్భాగ్య కృతఘ్న మానవాళికి!! వ్యాసుడు భరతవంశం అంతరించకుండా రక్షించాడు. పంచవేదమగు శ్రీమహాభారతాన్నీ, అందులో అమృత తుల్యమగు శ్రీమద్భగవద్గీతను కృష్ణపరమాత్మచే ప్రవచింపచేశాడు. మానవజాతికి శాంతిప్రదమగు భక్తిని శ్రీమద్భాగవతంలో ప్రవచించాడు. అనేక పురాణాలు రచించాడు. వ్యాసుడు సంఘసంస్కర్త అయినాడు. భిషగ్వరుడు అయినాడు. రాజకీయవేత్త అయినాడు.

అతడుకానిది ఏది?

అతడు సర్వస్వమైనాడు!

ఇంతచేసిన వ్యాసుడు తనకోసం ఏమీ చేసుకోలేదు! అతనికి కనీసం తన పుత్రుడు దక్కలేదు. ఏ గుడిశలోనో, ఏ చెట్టుకిందనో ఉండి, పిడికెడు మెతుకులు తిని ఇన్ని ఘనకార్యాలు సాధించి, కనీసం చెప్పుకొనలేదు. ఆ మహర్షికి మనం ఏమి ఇవ్వగలం?

*వ్యాసం వశిష్ఠ నప్తారం శక్తేః పుత్రమకల్మషం!*

*పారాశరాత్మజం వన్దే శుకతాతం తపోనిధిం!!*

వ్యాసభగవానుడు దర్శనం ఇస్తే అతని పాదారవిందములను చుంబించాలని ఉంటుంది. నాకుగల అసాధ్యమైన ఆశ అది!

**వేద సంహితలు :**

వేదాల్లోని సూక్తులను అనేకమంది ఋషులు వారివారి సమయాల్లో దర్శించారు. ఋషులు మంత్రాలకు సూక్తాలకు ద్రష్టలు, స్మర్తలు మాత్రమే. స్రష్ఠలుమాత్రం కారు. పరాత్పరుడు ప్రవచించిన దానిని వారు విన్నారు. స్మరించారు – లిఖించారు. తరువాత వచ్చిన మత ప్రవక్తలంతా ఈ విధానాన్నే అవలంబించారు. బైబిల్, ఖురాన్ మున్నగు గ్రంథాలనుకూడా భగవంతుడు వెలువరించగా ప్రవక్తలు దర్శించి మానవాళికి అందించారు.

వేదాలకు ఇతర మతగ్రంథాలకు ఒక ప్రధానమైన భేదం ఉంది. వేదం ఏ ఒక్క దేశ, ప్రాంత, మతానికి సీమితం అయిందికాదు. ఇది సకల మానవాళికి చెందింది. వేదాన్ని ఏ ఒక్క ప్రవక్తమాత్రం దర్శించలేదు. అనేకమంది ఋషులు దర్శించారు. సాయణాచార్యుడు ఋషిని 'అతీంద్రియదర్శి' అన్నాడు. సాధారణ ఇంద్రియములను మించి దర్శించువాడు అని అర్థం. అట్టివారే అపౌరుషేయ వాక్కును దర్శించ సమర్థులు. ఆ విధంగా అనేకమంది ఋషుల సూక్తాలను ఏర్చికూర్చినది 'సంహిత'. దీనినే మనం సంకలనం అంటున్నాం. వ్యాస భగవానుడు ఆ విధంగా నాలుగు వేదాలను సంహితలుగా కల్పించాడు.

1. ఋగ్వేద సంహితలో 10,589 మంత్రాలున్నాయి. ఋగ్వేదసంహిత దేవతల గుణగణాలను స్తుతిస్తుంది.

2. యజుర్వేద సంహితలో 1975 మంత్రాలున్నాయి. యజుర్వేదసంహిత వివిధ యజ్ఞవిధానాలను నిర్దేశిస్తుంది.

3. సామవేద సంహితలో 1875 మంత్రాలున్నాయి. ఇది దేవతలను ప్రసన్నులను చేయు గాన విధిని నిర్ణయిస్తుంది.

4. అథర్వవేద సంహితలో 5977 మంత్రాలున్నాయి. ఇది బ్రహ్మజ్ఞానం సంహితగా అనేకానేక లౌకిక విషయాలను వివరిస్తుంది.

వేదద్రష్టలగు ఋషులపేర్లు పురాణ ఋషుల పేర్లలో సామ్యం ఉన్నా వారూ, వీరు ఒక్కరు కారు. వేదాలకూ పురాణాలకూ కాలవ్యత్యాసం చాల ఉంది. వేద విశ్వామిత్రునికీ – రామాయణ విశ్వామిత్రునికీ – పురాణ విశ్వామిత్రునికీ పేరులో తప్ప సామ్యం కనిపించదు.

**దేవతలు :**

వేదసంహితలు దేవతలకు సంబంధించినవి. దేవతలను వివిధ రీతులుగా చెప్పడం జరిగింది. అయితే ముఖ్యంగా 'దేవామహిమానః' దేవతలు మహిమలు గలవారు. "అమృతాదేవాః" దేవతలు అమృతులు అని చెప్పుకోవచ్చు.

"దేవతావావత్రయంస్త్రిణోశోష్టావసవః ఏకాదశరుద్రాః ద్వాదశాదిత్యాః ఇమేఏవ ద్యావా పృథివీ" 8 మంది వసువులు 11 మంది రుద్రులు + 12 మంది ఆదిత్యులు + 1 ద్యావా + 1 పృథివీ = 33 మంది.

ఈ ముప్పది ముగ్గురిలో:

11 మంది అగ్ని మున్నగు భూలోకవాసులు

11 మంది ఇంద్రాది అంతరిక్షవాసులు

11 మంది సూర్యచంద్రాది ద్యులోకవాసులు.

దేవతల సంఖ్య ఇంతటితో ఆగినట్లు కనిపించదు.

రోలుమండుకము, సోమము, ఋభువులు, రాజులనుకూడ దేవతలుగా పేర్కొన్నారు. ''యస్యవాక్యం సఋషిః యతేనోచ్యతేసః దేవతా'' అన్నాడు కాత్యాయనుడు. చెప్పినవాడు ఋషి – చెప్పబడినవాడు దేవత. ఈ సకల చరాచర ప్రకృతి ఏ శక్తులవలన, ఏ పదార్థములవలన జీవిస్తున్నదో వారందరు దేవతలే. వీరు రెండు విధములవారు. ఒకరు స్వయం దేవతలు – సూర్యచంద్రాదులు, పృథివి, ఆకాశము, వాయువు, నీరు మున్నగువారు. రెండు – కర్మవలన దేవత్వమును సాధించినవారు. ఇంద్రుడు, అశ్వనులు, ఋభువులు మున్నగువారు. భారతదేశం 'కర్మభూమి'. 'కర్మ' అంటే అదృష్టాన్ని నమ్ముకొని చేతులు జోడించి కూర్చోవడం కాదు. 'కర్మ' అంటే శ్రమ, కృషి, నైపుణ్యం, కృషివలన దేవతలైన ఋభువులు మున్నగువారున్నారు. భారతీయ తాత్త్విక చింతన ప్రకారం మానవుడు దైవత్వాన్ని సాధించగలడు. 'అహం బ్రహ్మాస్మి' అంటుంది ఉపనిషత్తు. దైవత్వాన్ని సాధించడం అంటే ఈ లోకాన్ని గెలవడం కాదు – తనను గెలవడం.

**"లోకములన్నియున్ గడియలోన జయించినవాడవింద్రియా**
**నీకము జిత్తమున్ గెలువ నేరవు"**

అంటాడు ప్రహ్లాదుడు– తండ్రి హిరణ్యకశిపునితో. చరాచర ప్రపంచంలోని సకల పదార్థాలకూ ప్రాణముందని భారతీయుల విశ్వాసం. "ఆత్మవత్సర్వభూతాని" – సమస్త ప్రాణులను నిన్నువలెనే భావించు. వానిని బాధించకు అనే సూక్తంమీదనే సమస్త ప్రకృతి శక్తులకు హాని కలిగించక ఆరాధిస్తూ మానవ జాతి లక్షల సంవత్సరాలు సుఖంగా జీవించింది. పాశ్చాత్యుల సైన్సు అనే దురాశాపూరిత వర్తకానికి నేడు ప్రకృతి శక్తులు బలియై, మానవజాతి స్వవినాశము దరిదాపులకు చేరుకున్నది. దేవతలకు రూపాలు, ఆయుధాలు, వాహనాలు, స్థానాలు వేదంలో నిర్దేశించబడినాయి. చెట్టు, పుట్ట, గుట్ట నుంచి ఇంద్రాగ్ని, సూర్యచంద్రాది దేవతలను యజ్ఞం ద్వారానే పూజించడం, స్తుతించడం, ఆరాధించడం జరిగింది. ఆరాధనలన్నీ కోర్కెలు తీర్చుకునే కామ్య కర్మలే. కామ్య కర్మలు సాధారణంగా యజమానులు చేయరు. పురోహితులు వారితో చేయిస్తారు. కామ్య కర్మలన్నీ కాయకములు. మనసుతో వాటికి పని ఉండదు. మనసును గురించి వేదంలో చెప్పబడింది. కాని, ఉపనిషత్తులలో మనసునకు ఇచ్చినంత ప్రాధాన్యత ఇవ్వబడలేదు. దేవతలు పురాణాలలోవలె ప్రత్యక్షంకారు – వరాలివ్వరు. తమ మహత్తులు చూపరు. ఒకరితో ఒకరు కక్ష సాధించడానికి యుద్ధాలు చేయరు. వారి అస్తిత్వం మాత్రమే కనిపిస్తుంది కాని ఆర్భాటాలు కనిపించవు. వేదంలో వాస్తవాలే ఉన్నాయి. కాని, ఆధునిక కాల్పనిక సాహిత్యంలో ఉన్నట్టి అవాస్తవాలు లేనే లేవు. దేవతలు చచ్చినవాణ్ణి బ్రతికించటం, కోపించి ఒకణ్ణి అణగదొక్కటం, ప్రసన్నులైన ఒకనికి అమాంతపు సంపద ప్రసాదించడం చేయరు. వేదంలో – మనం అనుకుంటున్నట్లు వైరాగ్యం ఎక్కడా కనిపించదు. ఇహమును గురించే ఎక్కువగా చెప్పబడింది. యజమానులు దేవతలను సుఖసంపదలే అర్థిస్తారు. పరలోకాన్ని గురించి ప్రార్థించేది తక్కువ. స్వర్గాన్ని గురించీ, అమృతాన్ని గురించీ వేదంలో చెప్పబడింది. కాని పురాణాల్లోవలె స్వర్గభోగాలు, రంభా ఊర్వశులు పరిష్వంగాలు కనిపించవు. నరకము – అందులోని యాతనల వర్ణనలేదు. 'అకము' అనగా వ్యాధులు, దుఃఖాలు. అవి లేనిది 'నాకము'. స్వర్గము 'నాకం'గా చెప్పబడింది.

ఇంద్రుని రాజ్యము స్వరాజ్యం. స్వరాజ్యంలో దుఃఖాలూ, బాధలూ ఉండవు. కాబట్టి మానవుడు అలాంటి రాజ్యం కోరుకున్నాడు – "స్వరాజ్య్ బైరాజ్యం" అన్నారు. వేదాల్లో వైరాగ్యం లేనట్లే, ఉపనిషదాదుల్లోకూడా వైరాగ్యం లేదు. మానవుని జీవితాన్ని సుఖసంతోషాలతో నింపడానికే భారత తాత్త్వికత, భారతసాహిత్యం నిరంతరం కృషి చేసింది. వేదాంతానికి వైరాగ్యం అనే అర్థం కూడా స్వప్రయోజనపరుల కల్పనయే! వైరాగ్యాన్ని గురించి చెప్పినా అది ఇహసుఖం కోసమే, పరలోకం కోసం కాదు. సుఖశాంతులతో కూడిన సమాజాన్ని ఏర్పరచటమే భారతీయ మేధావుల, ఋషుల, మునుల, మహాత్ముల, యోగుల, పరమ యోగుల పరితాపం, కృషి, తపస్సు!

వేదాల్లోని దేవతలు వేరువేరుగా గాని, అందరు కలసిగాని పరాత్పరుడు, ఈశ్వరుడు, సర్వేశ్వరుడు, భగవానుడు కాజాలరు. పరమాత్మ సత్యస్వరూపుడు. మానవజాతి సత్యసాక్షాత్కారం – పరమాత్మ సాక్షాత్కారం కోసం – దేశకాలవ్యత్యాసాలు లేక నిరంతరం అన్వేషిస్తున్నది. సృష్టి, స్థితి లయకారకుడగు ఆ పరమాత్మ

అనిర్వచనీయుడు, అగమ్యగోచరుడు. అతడు – ఆమె అందరు. అందని పరాత్పరునికోసమే అన్వేషణ. అందని, చూడని ఆ స్వామిని సాకారుడని, నిరాకారుడని నిరూపించుటకు నిష్ఫలయత్నము చేసినాడు, చేస్తున్నాడు అల్పుడు మానవుడు. మానవుని జ్ఞానము పరాత్పరుని ఎరుగుటకు అపర్యాప్తము. ఆ భగవతి – భగవంతుడు మహాసాగరము. మానవుడు కనీసము దోసిలి కాజాలడు. అతడు వంగిన నింగివరకే సముద్రాన్ని చూడగలరు. సముద్రాన్ని దర్శించజాలడు.

ఆ పరమాత్మ – పరమేశ్వరియే ఈ సమస్త చరాచర ప్రపంచాన్నీ 'యద్దృశ్యతే, శ్రూయతేపినా' కంటికి కనిపించే, చెవికి వినిపించే వానిని సృష్టించారు. ఆధారము లేకనే భూమినీ సూర్య, చంద్ర, గ్రహ నక్షత్రాదులను నిలిపి ఉంచినారు.

ప్రకృతిని – తన ప్రకృతిని – ఎరుగలేని దుర్బల మానవుడు అన్నీ ఎరిగినానని బీరాలు పలుకుతాడు. మానవుడే అన్వేషణ – అన్వేషణయే మానవుడు! ఈ నిరంతర అన్వేషణ ఫలితమే దేవతలు! అయితే మహాత్ములు, మహర్షులు చూపిన దేవతలను ఆరాధించడం తప్పుకాదు. అతడు అందడు. వారు అందినవారిని దర్శనము చేయించినారు.

పరమాత్మ సత్యము. దేవతలు విశ్వాసము
సత్యదర్శనము కానపుడు విశ్వాసమే మహత్తం.

దేశంలో ప్రభుత్వం అంతటా ఉంటుంది. గ్రామస్తునికి గ్రామాధికారే ప్రభుత్వం. అతనికిచ్చిన పన్ను ప్రభుత్వానికి అందుతుంది. గ్రామాధికారులవంటివారే దేవతలు!

మనం బహుదేవతారాధకులం. వేదం ఇది మనకు నేర్పింది. క్రీస్తుకు ముందు ప్రపంచం సాంతం బహు దేవతారాధన చేసింది.

మనం బహుదేవతారాధకులం. నాకు రామకృష్ణా ద్యవతారాలతోపాటు ముత్యాలమ్మ, మరిడమ్మ, పోశమ్మ దేవతలే! ఈ విషయంలో మనం సిగ్గుపడాల్సిన అవసరంలేదు. ఏ ఒక మతాన్నో సంతోషపెట్టడానికి మనం ఏకేశ్వరోపాసకులం అని నిరూపించ ప్రయత్నించనక్కరలేదు.

"ఏకం సద్విప్రాబహుధావదంతి" – ఒకే సత్యాన్ని పండితులు బహువిధాలుగా చెప్తున్నారు – అనే వేద వచనాన్ని పట్టుకొని మనం ఏకేశ్వరోపాసకులం అని నిరసించడం మారేడుకు మసిపూయడంలాంటిది మాత్రమే! ఒక విషయం స్పష్టం – సత్యం – ఋతం – ఒక్కొక్క మతానికి ఒక్కొక పరమాత్మ, పరాత్పరుడు, భగవానుడు ఉండడు.

ఉన్నది ఒకే పరమాత్మ
ప్రవక్తలు అనేకులు.

ఏ ప్రవక్తా తనను పరమాత్మునిగా చెప్పుకోలేదు. ప్రవక్తలు, అవతారాలు, మహాత్ములు, పరమహంసలు, పరమాత్ములు అంశామాత్రులు మాత్రమే!

'ఏకోవై బ్రహ్మనా ద్వితీయం' – బ్రహ్మము ఒక్కడే – రెండవవాడు లేడు.

**వేదార్థం:**

కౌత్సఋషి వేదానికి అర్థం ఉండదనీ, తెలిసికోరాదనీ అన్నాడు.

క్రీస్తుకు వెయిసంవత్సరాల పూర్వపు 'యాస్కుడు' "నైవస్థాణోరవరాధః యదేనం అంధోనవశ్యతి. పురుషాపరాధః సభవతి' – స్తంభాన్ని చూడకపోవడం స్తంభపు తప్పు కాదు, మనిషి తప్పు అన్నాడు.

**స్థాణురయం భారవాహః కిలాభూత్**
**అధీత్యవేదాన్ నవిజానాతి యో–ర్థమ్!**
**యోఽ అర్థజ్ఞఇత్ సకలం భద్రమశ్నుతే**
**నాకమేతిజ్ఞాన విధూతి పాప్మా!!**

వేదం చదివి అర్థం తెలిసికోనివాడు తెలియని బరువు మోయు యంత్రంలాంటివాడు. వేదం చదివి అర్థం చేసికొన్నవాడు జ్ఞానియై, పాపరహితుడై, స్వర్గాన్ని చేరుకుంటాడన్న యాస్కుడు రచించిన నిరుక్తమే నేటికీ వేదార్థానికి ఆధారం. తరువాత స్కందస్వామి, ఉద్గీత, వేంకట మాధవులు వేదాన్ని వ్యాఖ్యానించారు. స్కందస్వామి వల్లభి నివాసి. వల్లభి ఖమ్మంజిల్లాలోని గ్రామం. కావున స్కందస్వామి తెలుగువాడని గర్వించవచ్చు.

వేదాలకు సాధికారిక వ్యాఖ్య రచించిన తెలుగువాడు ఆచార్య సాయణుడు (1315–1387). నేటి ప్రాక్, పాశ్చాత్య వ్యాఖ్యాతలందరు సాయణాచార్యుల వ్యాఖ్యాదర్పణంతోనే వేదాన్ని దర్శిస్తారు. పాశ్చాత్య ప్రభావంగల వేద విద్వాంసులు సాయణాచార్యుడు చెప్పిన వినియోగంకోసం అతన్ని విమర్శించడం కాదు – నిందిస్తారు. అయితే, గమనించాల్సిందేమంటే – ప్రతి వినియోగానికీ అతడు పూర్వప్రమాణం ఉదాహరించాడు.

వినియోగం అంటే వాడుక. ఏ సూక్తం దేనికోసం వాడాలో చెప్పడం వినియోగం. ఇందును గురించి ఎంతో చెప్పాల్సి ఉంది కాని ఇది సందర్భంకాదు.

సాయణుడు శుక్లయజుర్వేదాన్ని వ్యాఖ్యానించలేదు. మహీధర – ఉవటాచార్యులు వ్యాఖ్యానించారు.

నేను ఆంధ్రానువాదానికి సాయణ, మహీధర, ఉవట వ్యాఖ్యలనే అనుసరించాను.

దక్షిణాపథంలో అన్యమతస్థుల రాజ్యాలు స్థిరపడి విస్తరిస్తున్నప్పుడు విద్యారణ్యుడు హరిహర బుక్కరాయలచేత విజయనగర సామ్రాజ్యాన్ని స్థాపింపచేశాడు. బుక్కరాయలు వేద ధర్మాన్ని ఉద్ధరించదలచి సాయణాచార్యులను వేదాలకు భాష్యం చెప్పమని అర్థించాడు. వేదవ్యాఖ్య మధ్యలో ఉండగానే బుక్కరాయులు అస్తమించాడు. రెండవ హరిహరరాయలు కూడా తన తండ్రివలె వేదవ్యాఖ్య బృహత్కార్యానికి సర్వవిధాల సహకరించాడు.

సాయణుడు ఆంధ్ర బ్రాహ్మణుడు. అతనిది భరద్వాజస గోత్రము. బోధాయన సూత్రము. మాయన – శ్రీమతి అతని తల్లిదండ్రులు. అతడు వేదసంహితలనేకాక 1. తైత్తిరీయ బ్రాహ్మణము 2. తైత్తిరీయ అరణ్యకము 3. ఐతరేయ బ్రాహ్మణము 4. ఐతరేయ అరణ్యకము 5. శతపథ బ్రాహ్మణము 6. తాండ్య బ్రాహ్మణము 7. సద్వింస బ్రాహ్మణము 8. సమవిధాన బ్రాహ్మణము 9. ఆర్షేయ బ్రాహ్మణము 10. దేవతాధ్యాయు బ్రాహ్మణము 11. ఉపనిషద్ బ్రాహ్మణము 12. సంహితోపనిషద్ బ్రాహ్మణము 13. వంశ బ్రాహ్మణములను వ్యాఖ్యానించాడు.

పదాల్లో అన్నింటినికాని కొన్నింటినిగాని వ్యాఖ్యానించిన పాశ్చాత్య విద్వాంసులు మాక్సుముల్లర్, కీత్, గ్రిఫిత్, పిశల్, గ్లేడ్నర్, త్సరర్, వేవర్, ఓల్డన్‌బర్గ్, బ్లూమ్‌ఫీల్డ్; భారతీయ వ్యాఖ్యాతలు మహర్షి దయానందసరస్వతి, మహర్షి అరవిందులు సాయణాచార్యుల వ్యాఖ్యానంమీదనే ఆధారపడ్డారు.

విచిత్రం ఏమంటే – బుద్ధుడు, ఆదిశంకరుడు, శ్రీమద్రామానుజులు మున్నగువారు వేదకర్మలను నిరసించినా వేదప్రకాశం వసివాడలేదు.

**వేదం – సర్వం:**

వేదానికి సర్వం ఉంది. దానికి శాస్త్రం ఉంది. పదపాఠ, క్రమపాఠ, జట మున్నగునవి స్వర పద్ధతులు. స్వరంతో చదివిన వేదమంత్రానికి నాదం ఉంది, గుణం ఉంది, మహిమ ఉంది.

వేదం శృతి. వినిపించడంలో ఆనందం ఉంది. వినడంలో అమృతం ఉంది. అనువాదం అర్థం అవుతుందే కాని ఆనందం కాజాలదు – అమృతం కాజాలదు.

స్వరబద్ధమైన వేదనాదం మనసును కదిలిస్తుంది. మంచి కలిగిస్తుంది. శాంతిని ప్రసాదిస్తుంది.

వేదం గగన సదృశం.

నేను అద్దంలో దాన్ని చూపగలిగాను.

అంతకు మించిన అవకాశం ఇచట లేదు.

మనిషి జీవించి ఉన్నపుడూ, విగతాత్మ అయినపుడూ శాంతికోసం తపిస్తున్నాడు. శాంతి అతనికి మరీచిక, గగనకుసుమం అవుతున్నది. శాంతిని గురించి వేదం ఇలా నినదిస్తున్నది :

*ద్యేఃశాన్తిరన్తరిక్షశ్శాంతిః పృథివీశాన్తి రాపఃశాన్తి*
*రోషధయః శాన్తిః*
*వనస్పతయః శాన్తి ర్విశ్వే దేవాఃశాన్తిర్బ్రహ్మశాంతిః*
*సర్వమ్ శాన్తిః శాన్తిరేవశాన్తిః సామాశాన్తిరేధి ।*

ద్యులోకమునకు శాంతి, అంతరిక్షమునకు శాంతి, పృథివికి శాంతి, ఓషధులకు శాంతి, వనస్పతులకు శాంతి, విశ్వేదేవతలకు శాంతి, బ్రహ్మకు శాంతి, సర్వమునకు శాంతి, శాంతికే శాంతి. అలాంటి శాంతి నన్ను వర్థిల్ల చేయునుగాత!

ఇన్నింటికి శాంతి – శాంతికి సహితం శాంతి ఉంటేనే మానవజాతి వర్థిల్లుతుంది!!

ఓం శాంతిః శాంతిః శాంతిః

(జీవనయానం)

మి



దాశరథి రంగాచార్య

# రామాయణం

*– సాయి పాపినేని, జయశ్రీ నాయని*

ఇంతవరకూ పురాణ సంప్రదాయం ఆధారంగా త్రేతాయుగానికి చెందిన సంఘటనల వెనుక వాస్తవిక నేపథ్యాన్ని వివరించాము. త్రేతాయుగాంతంలో సంభవించిన రామాయణం పరిణత హరప్పాయుగం చివరిదశకి (క్రీపూ.2000) చెందినది అని పురాణ వంశానుక్రమణికల కాలనిర్ణయంద్వారా పరిష్కరించాము. కావ్యరూపంగా మనకి లభ్యమయ్యే వాల్మీకి రామాయణం, భాషా పరిణామ శాస్త్రాన్ని అనుసరించి చూస్తే క్రీపూ. 500, క్రీశ. 300 మధ్య కాలానికి చెందినది. రామాయణంలో విస్తారంగా కనిపించే భౌగోళిక జ్ఞానం, చరిత్రలోని హేతువుల ద్వారా పరిశీలిస్తే, ఈ తదుపరికాలానికే చెందుతుంది. ఇక వాల్మీకి కావ్యం రాతప్రతులు గుప్తయుగం (క్రీశ. 300) తరువాతివే. లిఖితపరంగా తక్షశిల ప్రాంతంలో దొరికిన చంద్రగుప్త మౌర్యుని కాలానికి చెందిన శాసనంలో 'రామదోతె' అనే పేరులో రామ శబ్దం మొట్టమొదట కనిపిస్తుంది. వైదిక వాఙ్మయంలో మొదటిదైన ఋగ్వేదంలో రాముని ప్రసక్తి లేదు. ఋజువులు లేని కారణంగా చారిత్రకులు, రామాయణం ఒక అభూత కల్పనగా, కవి సృజనగా తేల్చివేసారు. ఒకవేళ మూలకథలో కొంత నిజమున్నా, బౌద్ధయుగానికి ముందు గంగా మైదానంలోని పరిస్థితులను బట్టి అది సర్జూ నదీ తీరంలో పెద్దగా ఎన్నదగని సంఘటనగా నిరూపించే ప్రయత్నం చేసారు.

కానీ, ఇతిహాసపురాణ సంప్రదాయంలో రామాయణానికి ఉన్న స్థానం తెలిసినదే. ఆసియా ఖండంలోని ప్రాచీన సంస్కృతుల్లో, జానపద, లలిత కళారూపాల్లో, సాహిత్యంలో, రామాయణ గాథకు ఉన్న ప్రాముఖ్యత చరిత్రలో మరే గ్రంథానికీ లేదు. రామాయణంలోని ముఖ్య పాత్రలైన , రాముడు, హనుమంతుడి దేవాలయాలు లేని ఊరు దేశంలో లేదు. భారత ఉపఖండంలో, ఆగ్నేయాసియా దేశాల్లో దాదాపు పదివేలకు పైగా ఆలయ, స్థల పురాణాల్లో, ఆ ప్రదేశాలకు రామాయణ కావ్యంలోని సంఘటనలతో పరోక్షమైన సంబంధం, ఆ కావ్యం యుక్క జనాదరణను నిరూపిస్తుంది.

కావ్యరూపమైన రామాయణానికి, పురాణ వంశావళులు నిరూపించే త్రేతాయుగానికీ మధ్య దాదాపు 2000 సంవత్సరాల అంతరం ఉంది. అంతకాలం ప్రజల మస్తిష్కాలలో చరిత్రలోనే అత్యుత్కృష్ట దశగా నిలిచిన రామరాజ్యం, ఆదికావ్యమనే మహావృక్షానికి బీజమయింది. పురాతత్వ శాస్త్రం కూడా క్రీపూ. 2600–2000 భారతీయ కాంశ్యయుగంలో ఉచ్ఛదశగా నిరూపించడం, ఇతిహాసపురాణ సంప్రదాయంలోని వాస్తవికతను సూచిస్తుంది. గత సంచికలో గంగావతరణం, విశ్వామిత్రుని యాగరక్షణ ఉదంతాల ద్వారా, వ్యావసాయిక క్షేత్రాల అభివృద్ధికి ఆనాటి రాజులు చేసిన ప్రయత్నాలను నిరూపించాము. ఈ అభివృద్ధి కార్యక్రమాల జ్ఞాపకాలే గ్రామీణ ప్రజల మనసుల్లో రామరాజ్యాన్ని ఒక 'వెల్ఫేర్ స్టేట్'కి ప్రతిరూపంగా నిలిపాయి. బ్రాహ్మణిక వ్యవస్థలోని ధర్మాధర్మాలకు రామాయణ ఇతివృత్తాలు నిదర్శనంగా చూపేందుకు అనేక ప్రక్షిప్తాలు కావ్యంలో చోటుచేసుకొన్నాయి. కనుక వాల్మీకి రామాయణం కావ్యరచనా కాలం నాటి సామాజిక, భౌగోళిక నేపథ్యాన్ని ప్రతిబింబిస్తుందే గానీ, మూలకథలోని సంఘటనల నేపథ్యం కాదు.

**రామాయణం అంటే రాముడు నడిచిన మార్గం :**

శ్రీ రామ జననం, విశ్వామిత్రుని యాగరక్షణ, సీతాస్వయంవరం, వనవాసం, సీతాపహరణం, వానరులతో స్నేహం, సీతాన్వేషణ, లంకాపురి ముట్టడి, రావణునితో యుద్ధం, రామాయణ గాథకి ముఖ్య ఘట్టాలు. రామాయణంలో వాస్తవాలు అన్వేషించేందుకు, మూలకథకి చెందిన భౌగోళికాంశాల పరిశీలన అవసరం.

కావ్యరచనాకాలానికి (క్రీపూ. 500 – క్రీశ. 300), మధ్య గంగా మైదానం నాగరికతకి కేంద్రం. సాంప్రదాయకంగా కోసలను గోగ్రా నదీ తీరంలో, కేకేయ

దేశంఎగువ సరస్వతీ ప్రాంతంలో, విదేహ రాజ్యం గండక్ నదీ ప్రాంతంగా నిర్ణయించారు. వనవాసకాలంలోని ముఖ్య మజిలీలైన చిత్రకూటం, పంచవటీ, కిష్కిందలను నాటి దక్షిణాపథంలో సూచించారు.




క్రీపూ. 800 అనంతరం గంగా మైదానంలో పట్టణీకరణ విస్తరణ చూస్తాం. పురాణ వంశానుక్రమణికలను బట్టి, రామాయణం, మహాభారతానికి ముందు కాలాలకు చెందింది. భారతకథకి కేంద్రమైన కురు పాంచాల దేశాలు ఎగువ గంగ, సరస్వతీ మైదానాల్లోనూ, రామాయణానికి కేంద్రస్థానాలైన కోసల విదేహ దేశాలు, మధ్య గంగామైదానంలో చూస్తాము. నాగరికత విస్తరణ పశ్చిమం నుండి తూర్పుకు సాగింది కనుక, కొందరు చరిత్రకారులు రామాయణంలోని సంఘటనలు మహాభారత యుద్ధానంతరం జరిగినవిగా సిద్ధాంతీకరించారు. ప్రొ. సంకాలియా మొదలైన చరిత్రకారులు రామాయణంలోని సంఘటనలు గోగ్రా నదీ ప్రాంతంలోని కోసల జనపదంలో క్రీపూ 800 ప్రాంతంలో జరిగిన చిన్న రాజకీయ సంక్షోభంగా ప్రతిపాదించి, రామాయణ కథకి ముఖ్యమైన లంకానగరం, మధ్యప్రదేశ్ జబల్పూ కర్ ప్రాంతంలో నర్మదా నదిమధ్య చిన్న లంకగా తీర్మానించారు.




పై రెండు ప్రతిపాదనలూ వాస్తవానికి దూరమే.

వాల్మీకి రామాయణంలోని ప్రదేశాలు బౌద్ధయుగానికి పూర్వం గంగామైదానం నుండి దక్షిణ భారతదేశానికి బ్రాహ్మణిక సంస్కృతి విస్తరణను సూచిస్తాయి. వానరుల సీతాన్వేషణ వృత్తాంతాల్లో క్రీస్తు శకారంభంలో ఆగ్నేయాసియా ఐరోపాల మధ్య విస్తరించిన భారతీయుల సముద్రవాణిజ్యం, వారి భౌగోళిక జ్ఞానాన్ని కొంత చూడవచ్చు. ఆర్యులవలససిద్ధాంతాన్ని అనుసరించి రామాయణాన్ని ఒక స్థానిక అప్రముఖ సంఘటనగా నిరూపించే ప్రయత్నం పూర్తిగా అసంబద్ధం. ముందుగా కథనానికి అత్యావశ్యకమైన ప్రదేశాల క్రమాన్ని, మూలకథలో సూచించిన కాలపరిమితులతో, క్రీపూ. 2000 నాటి సాంస్కృతిక, సాంకేతిక నేపథ్యంలో నిర్ధారించుకోవాలి.

సింధునాగరికతకి ముఖ్య నగరమైన హరప్పాయే అయోధ్యగా ముందు సంచికల్లో (మిసిమి-జులై 2015) నిరూపించాము. సరయూ (రావీ) తీరంలోని అయోధ్య (హరప్పా) కేంద్రంగా వనవాసంలో ప్రస్తావించిన ప్రదేశాలకు ప్రత్యమ్నాయాలు పరిశీలిద్దాం.

**శృంగభేరపురం :**

పారంపరికంగా శృంగభేరపురాన్ని కౌశాంబికి దగ్గరలో చూపారు. చారిత్రక యుగంలో దక్షిణాపథం కౌశాంబి నుండే మొదలై, ఉజ్జయిని వద్ద నర్మదను దాటి మహారాష్ట్ర, తెలంగాణ, కర్నాటక రాష్ట్రాల సరిహద్దుల వెంట సాగేది. కనుక రాముని వనవాసంలోని మొదటి మజిలీ కౌశాంబి ప్రాంతంగా చూపడంలో ఆశ్చర్యంలేదు. నాగరికత కౌశాంబి ప్రాంతానికి విస్తరించక ముందరి కాలంలో, దక్షిణాపథం మొదళ్లు సప్తసింధు ప్రాంతంలో వెదకాలి.

హరప్పాకి దక్షిణంగా అతి పెద్ద నదియైన సరస్వతి (సత్లూజ్) పైన గుహుని శృంగభేరం ఆనాటి కోసల రాజ్యానికి సరిహద్దు. నదికి ఆవల అడివి. సాంప్రదాయకంగా థార్ ఎడారికి, ఆరావళి శ్రేణికి మధ్య ప్రదేశానికి కురుజాంగలం అని పేరు. నేటిరాజస్తాన్లోని బికనీర్ – జోధ్పూర్ ప్రాంతం ఆనాటి హరప్పా నాగరికత ప్రాంతానికి సరిహద్దు. క్రీపూ. 2000 నాటి సాంస్కృతిక పరిథులను బట్టి, రాముని వనవాసం ఈ ప్రాంతంలోనే ఆరంభమై ఉండాలి.




**చిత్రకూటం :**

గుహుని సహాయంతో నదిని దాటిన రాముడు, చిత్రకూటంలో పది సంవత్సరాలు నివసించాడు. భరతుడు అయోధ్యలోని అశేష జనానీకంతో రాముడిని కలవడం, ఈ ప్రదేశం నదికి ఆవల రాజధానికి దగ్గరలోనే ఉన్నదనే అభిప్రాయాన్ని బలపరుస్తుంది. కనుక చిత్రకూటాన్ని సత్లూజ్ నదికి దక్షిణాన బికనీర్, జోధ్పూర్ల మధ్య ఊహించాలి. పదేళ్ల తరువాత అగస్త్యుని ప్రోత్సాహంతో రాముడు దండకారణ్యం ప్రవేశిస్తాడు. వనవాసక్రమంలో దక్షిణభారతదేశం కావ్యంలోప్రక్షిప్తంగా జొరబడిందనేందుకు అగస్త్యుని వృత్తాంతమే నిదర్శనంగా చూపవచ్చు. ద్రవిడ భాషా ప్రాంతాల్లో బ్రాహ్మణ సంప్రదాయ విస్తరణోద్యమంలో అగస్త్యుని పాత్ర విశేషమైనది. శ్రీరాముడిని దక్షిణ దేశంలో ప్రవేశింపజేయడంలో ఉద్దేశ్యం బ్రాహ్మణ సంస్కృతిలో అత్యంత జనాదరణ పొందిన రాముడిని దక్షిణాదికి పరిచయం చేయడమే.

**పంచవటి :**

దక్షిణదేశంలో అతిపెద్ద నదియైన గోదావరిని రాముని వనవాసంలో ముఖ్య మజిలీగా చూపడంలోనూ ఆశ్చర్యమేమీ లేదు. బౌద్ధయుగంవరకూ, గోదావరీ తీరంలోని అశిక, అశ్మక ప్రాంతాలు జనపదాలుగా పేరొందలేదు. కనుక క్రీపూ. 2000 నాటికే పౌరాణిక సంస్కృతి దక్షిణదేశం ప్రవేశించిందనడం హేతుబద్ధం కాదు. కనుక శ్రీరాముని ప్రవాసంలో తదుపరి మజిలీయైన పంచవటిని మరోచోట వెదకాలి. బికనీర్ నుంచి దక్షిణదిశగా ప్రయాణిస్తే అజ్మీర్, జైపూర్ ప్రాంతంలో, తూర్పుదిశగా ప్రవహించే చంబల్ ఉపనదులు తగుల్తాయి. ఇది దట్టమైన అటవీప్రాంతం. మధ్యభారతదేశంలోని వింధ్యాటవులకు మొదటి మెట్టు. నిర్దిష్టంగా చెప్పలేకపోయినా, రామాయణంలోని పంచవటిని శబర్మతీ మూలస్థానానికి దగ్గరలో ఊహించవచ్చు.

పంచవటి దాపులలోని జనస్థానం ఆ ప్రదేశంలో నివసించే జనజాతులను సూచిస్తుంది. వీటిని క్రీపూ. 2000 ప్రాంతంలో ఆరావళీ ప్రాంతంలో కనిపించే ప్రత్యేకమైన తామ్రశిలాయుగపు 'అహర్' సంస్కృతిగా ఊహించవచ్చు. అహర్ ప్రాంతం తగరం, రాగి వంటి ఖనిజ సంపదకు పేరుగాంచింది. భారతదేశంలో ఇనుము వాడకం మొట్టమొదట క్రీపూ 2000 ప్రాంతంలో అహార్ నేపథ్యంలోనే కనిపిస్తుంది. రావణుని లంక రేవు పట్టణమైతే,

ఖర దూషణుల వృత్తాంతాలలో, ఖండాంతర్భూమిలోని ఖనిజవనరులను దోచుకోవడం అనే వ్యవస్థను చూడవచ్చు. పంచవటిలో మూడు సంవత్సరాల మజిలీలో ఖరదూషణవధ, శూర్పణఖ వృత్తాంతాలు రామరావణుల వైరానికి కారణమై సీతాపహరణానికి దారితీసాయి.

**శబరి :**

సీతాపహరణం వనవాసం ఆఖరి సంవత్సరంలో జరిగింది. కావ్యంలో ఒక నదీమతల్లిగా వర్ణించబడ్డ 'శబరి' సీతాన్వేషణకి బయలుదేరిన రాముడికి కిష్కిందకు మార్గం చూపుతుంది. ఆరావళీ శ్రేణిలో పుట్టిన రెండు నదులు, ఆ ప్రదేశం నుంచి సముద్రానికి (కాంబే సింధుశాఖ) దారి చూపుతాయి. అవి శబర్మతీ, మాహి నదులు. శబర్మతీ నదినే శబరిగా ఊహిస్తే, ఆ నదీ మార్గమే శబరి చూపిన మార్గంగా భావించవచ్చు. కావ్యంలో రామలక్ష్మణులు శబరి మార్గాన్ని అనుసరించి వర్ష ఋతువుకు ముందు కిష్కింద చేరుతారు.

నేడు సూచిస్తున్నసంప్రదాయంలో గోదావరీ తీరంలోని పంచవటికి (నాసిక్), తుంగభద్రా తీరంలోని కిష్కింద (హంపి) ప్రాంతానికీ మధ్య దూరం 800 కిలోమీటర్లు. కాలినడకన రోజుకి 11 కిమీ (యోజనం) ప్రయాణిస్తే కిష్కింద చేరేందుకు రెండు నెలలకు పైనే పడుతుంది. పైగా అందుకు ఏ నదీ దారి చూపదు. రాముడిని మానవుడిగా, రామాయణ గాథ వాస్తవంగా భావిస్తే పంచవటిని గోదావరీ తీరంలోనూ, హంపీ ప్రాంతాన్ని కిష్కిందగానూ ఊహించడం కష్టం.

వాలివధ, సుగ్రీవుని పట్టాభిషేకం వర్షర్తువుకు ముందు జరిగిన ఘటనలు. వర్షాకాలం గడిచిన అనంతరం, సుగ్రీవుడు వానరులను సీతాన్వేషణకు పంపుతాడు. రామాయణంలో సుందరకాండం, యుద్ధకాండాలు వర్ష ఋతువు తరువాత మొదలై, దీపావళికి ముగుస్తాయి. దక్షిణ దేశంలో వర్షాకాలం, దీపావళి వరకూ ఉంటుంది. కనుక రామాయణ గాథ దక్షిణభారతదేశంలో ఊహించడం కష్టమే కాదు అసంభవం కూడా. గుజరాత్, రాజస్తాన్‌లు వర్షాభావ ప్రాంతాలు. నైఋతీ ఋతుపవనాలు గుజరాత్లో జూన్ మాసాంతంలో ప్రవేశించి ఆగస్ట్ చివరిరోజులకు వర్షాకాలం దాదాపు ముగుస్తుంది. కనుక పంచవటీ, కిష్కిందలను రాజస్తాన్, గుజరాత్ ప్రాంతాల్లో వెదకడం ఉచితం.

**కిష్కింద :**

శబర్మతీ నది ఆరావళి శ్రేణినుండి గుజరాత్ రాజస్తాన్ సరిహద్దులోని బనస్కాంథ కొండల మధ్య ప్రవహించి అహ్మదాబాద్ నగరంగుండా కాంబే సింధుశాఖలో సముద్రాన్ని కలుస్తుంది. బానస్కంథ ప్రాంతంలో పుట్టిన రూపెన్ నది నైఋతిగా కచ్ సింధుశాఖ వరకూ ప్రవహించే వర్షాధారపు నది. బనస్కాంథ బానస్ అనే జనజాతి నివాసం. 'వానర' పదాన్ని కోతులుగా కాక, 'వన+నర' అంటే ఆటవిక జనజాతిగా ఊహిస్తే, వారి ఉనికి బానాస్ అనే పదంలో కనిపిస్తుంది. రూపెన్ నదిలో పడవలో ప్రయాణిస్తే, అక్కడనుండి కచ్ ఉప్పుపర్రకు (Rann of Kutch) రెండు వారాలలో పోయిరావచ్చు. క్రీపూ. 2000 ప్రాంతంలో పరిణత హరప్పా నాగరికతకు చెందిన రెండు రేవుపట్టణాలు ఈ దారిలో కనిపిస్తాయి. అవి సుర్కోటడ, ధోలవీర. కనుక ఆగస్ట్ చివర్లో సీతాన్వేషణకు బయలుదేరిన హనుమంతుడు, సెప్టెంబర్ మధ్యకాలానికి కిష్కిందకు తిరిగి రావచ్చు.

**లంకాపురి :**

రామాయణంలో లంకాపురి వర్ణనలు అదొక మహానగరంగా చూపుతాయి. సురస, సురకోట అనే పేర్లకూ 'సుర్కొటడ'కూ సామ్యంవల్ల, అది లంకాపురికి వెళ్ళే హనుమంతునికి మార్గమధ్యంలో తారసపడే 'సురస'గా, లంకకు వెళ్ళే దారిలోని జనావాసంగా అనుమానించవచ్చు. కచ్ సింధుశాఖలోని కదీర్ బెట్ ద్వీపంపైనున్న ధోలవీర పరిణతహరప్పా నగరం. రామాయణంలో వర్ణించిన లంకాపురిలాప్రాకార శోభితమైన జలదుర్గం. హరప్పా, మొహెంజొదారో వంటి స్థావరాలతో పోల్చదగ్గ నగరం. (పటం) పరిణత హరప్పా నాగరికతకు చెందిన ధోలవీర పట్టణమే లంకాపురి అనేందుకు కొన్ని నిదర్శనాలు మన పురాణ సంప్రదాయంలో కనిపిస్తాయి.



మొహెంజొదారో

వాయుపురాణంలో మేరువులో ఒక శిఖరం క్షీరసాగరంలో విసిరివేయబడి మంధరగిరిగా పిలువబడిందని, సాగరమథనం వృత్తాంతంలో విష్ణువు కచ్ఛప రూపంలో దానిని మోసాడనీ చెప్తుంది. కచ్ కదలిమలుపే క్షీరసాగరమన్న అభిప్రాయాన్ని ముందు సంచికల్లో (మిసిమి ఏప్రిల్ 2015) వెల్లడించాం. రామాయణంలో అదే మంధర గిరిపై, కుబేరుడు లంకాపురిని నిర్మించాడనీ చెప్పబడింది.

గోవాలోని సముద్రాంతర పురాతత్వ కేంద్రానికి చెందిన ప్రొ. గౌర్, ప్రొ. వోరా ప్రభృతులు హరప్పా యుగంలో కదీర్ బెట్ చుట్టూతా కచ్ ఉప్పుపర్రలు సంవత్సరం పొడుగునా 3–6 మీటర్ల లోతు నీటిలో మునిగి ఉండేవని పరిశోధనల ద్వారా వెల్లడించారు. అక్టోబర్ మాసంలో శరన్నవరాత్రులకు ముందు, నైఋతీ ఋతుపవనాలు వెనుదిరిగి ఈశాన్యపు గాలులు వీచడం, సముద్రపు నీరు వెనక్కి వెళ్లడంవల్ల, కదీర్ బెట్ వరకూ పొడినేల కనపడుతుంది. సేతు నిర్మాణానికి శ్రీరామునికి సముద్రుడి సహకారంలోని వాస్తవికత ఈ ప్రకృతి పరిణామంలో చూడవచ్చు.

లంకాదహనం వల్ల ఎర్రబడిన ఆకాశం సింధూనదీ ముఖం వరకూ కనిపించిందని వాల్మీకి చెప్పాడు. ధోలవీర నుంచి సింధు, సరస్వతుల ముఖద్వారం 50 మైళ్లు. వాతావరణ కాలుష్యంలేని ఆ రోజుల్లో అది సాధ్యమయేందుకు అవకాశం లేకపోలేదు. మరో ముఖ్య విషయం – క్రీపూ 2000 ప్రాంతంలో ధోలవీర ఆకస్మికంగా పతనమైంది. నిర్దిష్టంగా తెలియకపోయినా యుద్ధం ఒక కారణంగా ఊహించవచ్చు.

**తిరుగు ప్రయాణం :**

ప్రక్షిప్తాలు ఎన్ని చేర్చినా కవికి రామాయణ మూలకథనంలోని కాలక్రమాన్ని మార్చవలసిన అవసరం కనబడదు. రాముడు విజయదశమి నాడు రావణుడిని చంపి దీపావళికి ఒకరోజు ముందు నందిగ్రామం చేరాడని చెప్పబడింది. అది సాధ్యమా? పుష్పకవిమానం ఉంటే సమస్య లేదు. వేదకాలంలో విమానాలూ, గ్రహాంతర విహారాలూ ఉన్నాయనే వారితో వాదించలేము. అటువంటి విమానాలు లేకుండా కచ్ సింధుశాఖ నుండి పంజాబ్‌లోని హరప్పా ప్రాంతానికి 20 రోజుల్లో వెళ్లడం ఎలా? గాలిలో తేలిపోక పోయినా నీటిపై తేలే నావలో, నదీమార్గంలో సాధ్యమే. రేవుపట్టణం కనుక నదీయానానికి నావలూ నావికులూ కూడా లభించవచ్చు. ఈత, ఎగురుట అనే పదాలకు ప్రత్యేకార్థాలు ఉన్నా, తేలుట, తైర్ వంటి పదాల మూలాలు ఒకటే. కనుక రావణుని పుష్పకాన్ని ఒక నావగా ఊహిస్తే, మనం ప్రతిపాదించిన భౌగోళిక ప్రదేశాలను కావ్యంలోని కాలక్రమానికి అనువదించవచ్చు.

**ముగింపు :**

రామాయణాంతంతో త్రేతాయుగం ముగిసి, ద్వాపరయుగం ఆరంభమౌతుంది. క్రీపూ. 2000తో పరిణతహరప్పా దశ పతనమయింది. నాగరికతకి కేంద్రమైన దిగువ సరస్వతీ, సింధు మైదానాల నుండి ప్రజల వలసలు మొదలయ్యాయి. పరిణతహరప్పా పరిధుల్లో కొత్త జనావాసాలూ, పట్టణాలూ పుట్టాయి. ఎగువ సరస్వతీ, యమునా మైదానంలో, గుజరాత్ మాల్వా ప్రాంతాల్లో విస్తరించిన రెండు నిర్దిష్టమైన తుదిహరప్పా సంస్కృతులు మరో 600యేళ్లు హరప్పా వారసత్వాన్ని కొనసాగించాయి. మన వంశానుక్రమణికల్లోని కాలమానం ప్రకారం ద్వాపరయుగం, తుదిహరప్పాయుగంతో సరితూగుతుంది. తుదిహరప్పాయుగంలో వచ్చిన భౌగోళిక, సామాజిక పరిణామాలను, ద్వాపరయుగానికి చెందిన మహాభారత ఇతిహాసం నేపథ్యంలో త్వరలో పరిశీలిద్దాం.

అయితే ఈలోగా, క్రీపూ 2వ సహస్రాబ్దిలో జరిగినట్లు ప్రధానస్రవంతి చరిత్రకారులూ, ప్రముఖులూ ఆమోదించిన, ఆర్యులవలసలపై ఒక నిర్దిష్టమైన అభిప్రాయానికి రావలసిన అవసరం ఉంది. గత రెండు శతాబ్దాలుగా ప్రాచుర్యంలో ఉన్న వలసల సిద్ధాంతాలని, పెరిగిన సాంకేతిక ఉపకరాల, పద్ధతుల నేపథ్యంలో పురాజన్యుశాస్త్రం, చారిత్రక భాషాశాస్త్రం, పర్యావరణ, పురావాస్తు శాస్త్రాల్లో పొడజూపిన కొత్తవెలుగులని, ప్రత్యమ్నాయాలను వచ్చే సంచికలో వివరించే ప్రయత్నం చేస్తాం. మి



సాయి పాపినేని
బెంగళూరు.
ఫోన్: 09845034442



పద్మశ్రీ ఆర్. నాగేశ్వరరావు గారి (తెలంగాణ రాష్ట్రం) డ్రామా నటులు

# జానపద నాటక సాహిత్యం

– ఎన్. భక్తవత్సల రెడ్డి

ఆచార్య ఎస్వీ జోగారావుగారు ప్రస్తావించిన యక్షగానాలు 802. అందులో లభ్యమయినవి 542. డా॥ పొద్దుటూరి ఎల్లారెడ్డి తెలంగాణలోనే సేకరించిన యక్షగానాలు 326. అందులో ముద్రితాలు 193, అముద్రితాలు 133. ఎస్వీ జోగారావుగారు వివరించిన ఆంధ్రప్రాంత కవులు 176 మంది. దక్షిణ దేశ కవులు 36 మంది, తెలంగాణ కవులు 47 మంది, వీరేగాక పరిశిష్టము కింద 65 మంది, అనుబంధంలో మరో 140 మందిని గుర్తించారు. అంటే మొత్తం 465 మంది కవులు, 802 యక్షగానాలు చలామణిలో ఉన్నట్లు లెక్క. ఇది 1956 నాటి పరిస్థితి. తెలంగాణలో కేవలం 47 మందినే ఆచార్య జోగారావు ప్రస్తావిస్తే, దాన్ని మరింతగా శోధించి 326 యక్షగానాల్ని గుర్తించారు. డా॥ పొద్దుటూరి ఎల్లారెడ్డి. వీరే గాకుండా డా॥ ఉమారామారావుగారు, ఇంకా కొంతమంది ఈ యక్షగానాల మీద పరిశోధించినవారు ఉన్నారు.

తెలుగులో యక్షగానాల వ్యాప్తి అసంఖ్యాకం. అయితే ఇందులో కొన్ని మాత్రమే జానపదుల మక్కువని చూరగొన్నాయి. అందులో ప్రధానంగా తెలంగాణ ప్రాంతంలో చెర్విరాల బాగయ్య, చిత్తూరు జిల్లాలో కొత్తూరు రామలింగకవి, వేములపల్లె వేంకట సుబ్బయ్యల పాత్ర ప్రత్యేకంగా చెప్పుకోవలసి ఉంది.

చెర్విరాల బాగయ్యగారు శతాధిక గ్రంథకర్త. ముప్పైనాలుగు దాకా యక్షగానాల్ని రచించినారు. చిందు యక్షగానాలుగా వ్యాప్తిలో ఉన్నవాటిలో ఈయన రచనలే ఎక్కువగా ఉన్నాయి. అలాగే చిత్తూరు జిల్లాలో జరిగే ద్రౌపది తిరణాలలో భాగంగా ప్రదర్శించే వీధినాటకాలలో కొత్తూరు రామలింగ కవి, వేములపల్లె వేంకట సుబ్బయ్య రచనలు ప్రధానం. యక్షగానాలలోని వస్తువు వైవిధ్యభరితం. పౌరాణికాల నుంచి, వ్రతాలు, పతివ్రతలు – పేరంటాళ్ళు, సామాజిక కథానాయకులు, సంఘం కోసం ఆత్మార్పణం కావించుకొన్న జీవితాలదాకా ఆ వస్తువు పరివ్యాప్తమయింది.

తెలుగులోని జానపద కళారూపాలలో 'నాటకాల'కు ప్రత్యేక అస్తిత్వం ఉంది. కులవృత్తి కళాకారులు, వృత్తి కళాకారులు, ప్రవృత్తి కళాకారులు ఈ నాటకాల ప్రదర్శనలలో పాల్గొంటున్నారు. యక్షగానం, భాగవతం, భోగాతం, వీధిభాగోతం, వీధినాటకం, బయలాట లాంటి పేర్లతో ఆంధ్రదేశంలో చలామణిలో ఉన్న కళారూపం ఒక్కటేనా లేక వేరువేరా అన్నది పరిశోధకుల చర్చల్లో ఇంకా సజీవమే. ఇక కులం పేరుతో వ్యాప్తిలో ఉన్న చిందు యక్షగానం లేదా చిందు భాగవతం, నేతగాని భాగవతం, దాసరి భాగవతం, గోంధళే వీధిభాగవతం, యానాది భాగవతం, మిత్తిలి నాటకాలు; ప్రదర్శనలలో 'గంటె' దీపాలు ఉపయోగించటంవల్ల ఆ సాధనంతోనే వ్యాప్తిలో ఉన్న 'గంటె భాగవతం', మేలట్టూరు వాస్తవ్యులు ప్రదర్శించే 'మేలట్టూరు భాగవతమేళ' కూచిపూడి ప్రదర్శనతో సంబంధమో, సామ్యమో, మాతృకో అన్నంతగా చర్చల్లో ఉన్న 'తూర్పు భాగవతం' కూచిపూడి వారితో సంబంధం ఉన్న కలాపాలు, పారిజాతాలు ఈ కోవలోకే వస్తాయి.

తమిళంలోని 'ఉలా' ప్రబంధ లక్షణాల సాన్నిహిత్యంతోపాటు, ఈ సందర్భంలో ప్రస్తావించుకోవలసిన తమిళనాడులో బహుళ ప్రచారంలో ఉన్న 'తెరుక్కూత్తు', అందులోని శైలీభేదాలయిన 'భారతక్కూత్తు', 'నాట్టైక్కూత్తు' 'కట్టైక్కూత్తు', కర్ణాటక ప్రాంతంలో వ్యాప్తిలో

ఉన్న యక్షగాన శైలీభేదాలు 'మూడల పాయ' 'తెంకు తిట్టు' సంప్రదాయాలు, 'బయలాట', 'దొడ్డాట', కళారూపాలు; కేరళంలోని 'చవిట్టు నాటకం, కాక్కారిశ్శినాటకం, కొంతవరకు 'ముడియేట్టు' 'కాళీయూట్టు', 'కథకళి' ప్రదర్శన రూపాలు ఉన్నాయి.

**జానపద నాటకాలు - వస్తువు**

తెలుగులోని 'కథాగానాలని', ప్రదర్శనలో ఉపయోగిస్తున్న 'కథాగానాలని' దృష్టిలో పెట్టుకుంటే ప్రధానంగా మూడు రకాలుగా వర్గీకరించవచ్చు. ఒకటి 'పారంపర్య కథాగానం', రెండు 'ప్రదర్శనపాఠ్యం' ఆధారంగా సాగే 'ప్రదర్శన కథాగానం', మూడుప్రదర్శనలో పాల్గొని నేర్చుకొనేది (Customary Text) పారంపర్య కథాగానం (Conventional Text) ప్రధానంగా కథాగానాన్ని కులవృత్తిగా స్వీకరించిన కళాకారులు ఉపయోగించు కొంటున్నది. ఇది ఆయా కళాకారులకు పారంపర్యంగా అందిన ఆస్తి. ఈ పారంపర్య కథాగానం చేయడానికి నిర్దిష్ట కళాకారులు ఉన్నట్టే, వినడానికి కూడా నిర్దిష్ట శ్రోతలు ఉంటారు. వారిద్దరి మధ్య సాంస్కృతిక, ఆర్థిక సంబంధాలు ఉంటాయి. 'పారంపర్య కథాగానం'లో సాధారణంగా కథని వివరించి చెప్పడం ఉంటుంది. కథలో వచ్చే ఆయా పాత్రల స్వరూప స్వభావాల్ని వివరించే సందర్భాలలో కథకుడే ఆయా పాత్రల్ని పోషించే విధంగా ఆ కథాగానం సాగుతుంది. ఇందులో 'వారానువర్తనాలు' (Common Places), ఆవర్తనాలు (Refrains) ఉంటాయి. ఈ కథాగానాలు వారు ఉపయోగించే వాద్యాలు, పటం లాంటి మాధ్యమాలు కులవృత్తిగా స్వీకరించిన కులాల పేరుతో చలామణిలో ఉన్నాయి.

డక్కలి పటం కథలు, గుర్రపు వాళ్ల పటంకథలు, గౌడజెట్టి, ఏనోట్టి వాళ్ల పటం కథలు, కాకిపడిగెల పటం కథలు, మాసయ్య పటం కథలు, కూనపులి పటం కథలు, అద్దపు సింగుల పటం కథలు, కొర్రాజుల, పూజరిపటం కథలు ఆ కోవలోనివి.

మందెచ్చు కథలు, కొమ్ముల కథలు, పొడపాత్రపు కథలు, బైకాని కథలు, పిచ్చుక గుంట్ల కథలు, భట్టు కథలు, దాడీల వంశ చరిత్రలు – పటం కళాకారుల లాగే వీరికథలు కూడా కులం పేరుతోనే చలామణిలో ఉన్నాయి. పైన వివరించిన వారందరికీ 'త్యాగం' సంప్రదాయం ఉంది. 'త్యాగం' సంప్రదాయం లేకపోయినా, కథాగానం చేయడమే కులవృత్తిగా స్వీకరించే చెప్పే బైండ్ల కథలు, దుబ్బుల వారి కథలు, ఒగ్గుకథలు, పంబాల కథలు, జంగాల కథలు, ఆసాది కథలు కులం పేరుతో చలామణిలో ఉంటే, వారు ఉపయోగించే వాద్యం పేరుతో చలామణిలో 'శారదకథలు' ఉన్నాయి. కులం పట్టింపులు లేని బుర్రకథలు, హరికథలు ఉన్నాయి.

జానపద నాటకాలలో ప్రధానంగా ప్రదర్శన కులవృత్తిగా స్వీకరించిన వారు ప్రదర్శించే నాటకాలు, కులం పట్టింపులు లేకుండా ప్రదర్శనని ప్రవృత్తిగా మలచుకొన్న వృత్తి కళాకారులు, ఔత్సాహిక కళాకారులు ప్రదర్శించే నాటకాలు ఉన్నాయి. వీరందరూ కూడా 'ప్రదర్శన పాఠ్యం (Performance Text)ని ఉపయోగించుకునేవారే.

'పారంపర్య కథాగానా'నికి (Conventional Text) గ్రంథకర్తృత్వం మీద స్పష్టమయిన వివరాలు తెలియవు. ఎవరు, ఎపుడు రచించారో అది ఏయే కాలాల్లో ఎలా మార్పు చెందిందో స్పష్టంగా చెప్పడానికి ఆధారాలు లేకపోయినా ఇరవయ్యో శతాబ్దంలో వచ్చిన వివిధ మాధ్యమాల ప్రభావం వల్ల కొంతమంది కళాకారులు తమ కథాగానాలలో చొప్పించిన మార్పుల్ని చూడవచ్చు.

'ప్రదర్శన పాఠ్యం' (Performance Text) రచయిత ఎవరో స్పష్టంగా తెలుస్తుంది. అయితే అతను రచించిన గ్రంథాన్ని యథాతథంగా గాకుండా తాము ప్రదర్శించే సమయం, సందర్భం దృష్టిలో పెట్టుకొని మార్పు చేర్పులు ఉంటాయి. ఇందులో విదూషక పాత్రకి అనుకూలత ఎక్కువ. 'ప్రదర్శన పాఠ్యం'లో రాగ, తాళాలకు ప్రాధాన్యం ఉంటుంది. పారంపర్య కథాగానంలో రాగానికి స్థానం లేకపోయినా, ప్రస్తుతం వస్తున్న మార్పుల్లో 'రాగచ్ఛాయ'ల్ని చూడవచ్చు.

'ప్రదర్శన పాఠ్యం' (Performance Text) ఆధారంగా ప్రదర్శన కులవృత్తిగా మలచుకున్నవారిలో చిందువాళ్లు, దాసరి, నేతగాని, గోంధళేలు, యానాదులు, గంటె భాగవతులు, మిత్తిలి అయ్యావారు లాంటి కులాలు ఉన్నాయి. ప్రవృత్తిగా మలచుకున్న వృత్తి కళాకారులు ప్రదర్శించే వీధి నాటకం, వీధి భాగోతం, యక్షగానం లాంటి కళారూపాలకు కూడా 'ప్రదర్శన పాఠం' ఆధారం. కులవృత్తిగా కల్గినవారు చిన్నప్పటినుంచి ప్రదర్శనలో పాల్గొనటంవల్ల

నేర్చుకున్నవారు అయితే, ప్రవృత్తిగా కల్గినవారు గురుముఖతః అభ్యసించినవారు. కులవృత్తి వారికి వినికిడి జ్ఞానం ప్రధానం – కనుక ఉచ్చారణలో ప్రమాదాలు దొర్లడం ఎక్కువగా ఉంటుంది.

తెలుగులోని జానపద నాటకాలు ఎక్కువభాగం 'అనుష్ఠాన' నేపథ్యంతో ముడిపెట్టబడినవి. అందుకే 'కథ' ఒక్కటే అయినా ఒక్కో కళారూపాన్ని ప్రదర్శించేవారి చేతిలో అది పలు పోకడలు పోతుంది. అనుష్ఠాన సంప్రదాయం సంక్లిష్టభరితం. అందులో జరిగే ప్రతి అంశం మరో అంశంతో సన్నిహిత సంబంధం కలిగి వుంటుంది. అలా అనుష్ఠానం, విభిన్న అంశాల పరస్పర పరిపోషిత స్వభావం కలిగి, ఒక సంక్లిష్ట పరిపూర్ణ రూపంగా కనబడుతుంది. ఆ నేపథ్యంలో ప్రదర్శించే నాటకాలకు కూడా 'సంక్లిష్టత, పరిపూర్ణత' ఉంటాయి. అయితే వాటి స్వరూప స్వభావాల్ని గుర్తించడంలోనే అసలు సమస్య ఉంటుంది.

అనుష్ఠాన నేపథ్యంలో ఆయా దేవతలకు జరిగే ఉత్సవాలు, అక్కడ భక్తిపారవశ్యంతో చేసే పూజాది కార్యక్రమాలు, వాటితోపాటు దేవతలు మహిమలు వివరించే కార్యక్రమాలు ఉంటాయి. భక్తులు తమ కోరికలు తీర్చమని లేదా తీర్చినందుకు దేవునికి అర్పించే మొక్కుబళ్ళు, బలులు, ప్రధాన భూమిక పోషిస్తాయి. తాము పండించుకున్న ధాన్యాన్ని వండి దేవునికి సమర్పించుకొనే 'పొంగళ్ళు', 'బోనాలు' కార్యక్రమాల వెను 'ముందు దేవునకు తర్వాత మనకు' అన్న జానపదుల మనస్తత్వం, నమ్మక వ్యవస్థ కనబడుతుంది. మొక్కుబళ్లల్లో ఇంకా వస్త్రాలని, వేషభూషణాలని, ఆయా దేవుళ్ల ప్రతిమల్ని, వారు ధరించే ఆయుధాల ప్రతిమల్ని, ఇంకా చెప్పాలంటే ఆ దేవునితో సంబంధం ఉన్న ప్రతి వస్తువు, ప్రతి నమ్మకం, మొక్కుబళ్ళలో భాగం అవుతుంది. కొన్ని నేపథ్యాలలో 'సంగీతాలాపన', సంగీతోపకరణాల అర్పణం ఉంటాయి. తిరుపతి 'గంగజాతర', కేరళలోని కొడుంగల్లూరు భరణి మహోత్సవంలో ఇతరులు 'బూతు' అనుకునే పాటలు మొక్కుబళ్ళలో ప్రధానంగా కనబడుతాయి. ఆవులు, దూడలు, ఎద్దులు, ఏనుగులు మొదలయిన జంతువులతో పాటు 'మాత' 'బసిమి'లాంటి సంప్రదాయాల్లో మానవులను సమర్పించడం కూడా కనబడుతుంది. 'పొర్లుదండాలు', 'అగ్నిగుండం', 'సప్పరాలు', 'సిరిమాను'లాంటి వాటిలో తమను తాము శిక్షించుకొని దేవునికి ప్రీతి కల్గించడం కనబడుతుంది.

అలాగే ఈ అనుష్ఠాన నేపథ్య వైవిధ్యంతో అందులో జరిగే ప్రతి ప్రదర్శనతనూ అనుభవం ఉన్న ప్రజలు ఉంటారు. వీరిని 'సహృదయ ప్రేక్షకులు'గా గుర్తించవచ్చు. వీరు కళాకారులతోపాటు అక్కడ కథాక్రమంలో జరిగే అనుష్ఠానాలలో పాల్గొంటూ, దాన్ని ఒక 'ఉమ్మడి ప్రదర్శన' వ్యవస్థగా మార్చుతుంటారు. వీరు కథాక్రమం, సన్నివేశాలు, ఆయా సన్నివేశాలు, జరిగే అనుష్ఠాన సంప్రదాయాలు మొదలయినవాటిలో స్పష్టమయిన అవగాహన కల్గి ఆయా సన్నివేశాలకనుగుణంగా స్పందిస్తుంటారు. ఇలాంటి 'సహృదయ ప్రేక్షకుల' పాత్ర అనుష్ఠాన నేపథ్యంలో స్పష్టంగానూ, అర్థవంతంగానూ ఉంటుంది.

ఇలాంటి సంక్లిష్ట, వైవిధ్యభరిత అనుష్ఠాన సంప్రదాయంలో భాగంగా ప్రదర్శించే కళారూపాలు కూడా ఆ నేపథ్యానికి అనుగుణంగానే ఉంటాయి. 'ప్రదర్శన పాఠ్యం' అసలు ప్రతి ఒకటే అయినా కళాకారులు సమయం సందర్భాల కనుగుణంగా మలచుకొనే రీతిలో ఎవరి ప్రత్యేకత వారికే ఉంటుంది.

తెలంగాణ జిల్లాల్లో, ప్రత్యేకించి వరంగల్లు జిల్లాలో ప్రచారంలో ఉన్న 'చిందు యక్షగాన' ప్రదర్శనలో జి. లక్ష్మణస్వామి, చెర్విరాల బాగయ్య, గాది హన్మంతకవి, యాదవ దాసు, వేంకటదాసు మొదలయినవారు రచించిన నాటకాలను వాడుకొంటున్నట్లు కళాకారులు చెప్తున్నారు. వీరు ప్రదర్శించే నాటకాలలో హరిశ్చంద్ర, శకుంతల, భీష్మవిజయం, గజగౌరి వ్రతం, కంసమర్దన, మయాసుభద్ర, కీచకవధ, శ్రీకృష్ణార్జున యుద్ధం, గయోపాఖ్యానం, బభ్రువాహన, డాగ్నేయోపాఖ్యానం, శశిరేఖాపరిణయం, మాయాశశిరేఖ, రామనాటకం, మైరావణ, భూకైలాస్, శంబరాసురవధ, సుగ్రీవ విజయం, లవకుశ, భక్తప్రహ్లాద, తారాచంద్ర, భద్రసేనావిలాసం, చంద్రకళావిలాసం, సతీతులసి, సతీ అనసూయ, భక్తసిరియాళ, నాగార్జున, భక్తమార్కండేయ, మాంధాత లాంటివి ప్రధానంగా చెప్పుకోవాలి. ఇవేకాకుండా కాంతామణి, జయంత జయపాల, ఆరెమరాఠి, అల్లీఅర్జున, బాలనాగమ్మ, కాంభోజరాజు కథ, గరుడాచలం, సత్యవర్మ, ఎల్లమ్మ చరిత్ర, సతీసావిత్రి లాంటి కథల్ని కూడా ప్రదర్శిస్తున్నట్టు కళాకారులు

చెప్తున్నారు. ఎవరైనా చనిపోయిన సందర్భాలలో కథని చెప్పమన్నప్పుడు సతీసావిత్రి నాటకాన్ని ప్రదర్శిస్తారు.

వీరు సంక్రాంతి నుంచి వినాయక చవితి దాకా తమకు 'త్యాగం' కట్టడి ఉన్న ఊర్లలో ప్రదర్శనలు ఇస్తుంటారు. దినాలకు / కర్మక్రియల రోజున, మాసికాలతోపాటు వినోదం కూడా. అడిగినవారి కోరిక మేరకు ప్రదర్శనలు వేస్తారు. త్యాగం ఉన్న ఊర్లకు వెళ్లి పాలి వాళ్ళందర్ని ఒకచోట చేర్చి బొట్టుపెట్టి, తాము వచ్చిన విషయాన్ని చెప్పి, త్యాగం ఇంత ఇవ్వమని అడుగుతారు. అలా కట్టడి నిర్ణయం అయినాక వారి కోరిక మేరకు ప్రదర్శించాల్సిన నాటకాలని నిర్ణయించుకొని, అందర్నీ దీవించి వెళతారు.

తర్వాతి రోజు నుంచి రోజు మార్చి రోజు నిర్ణయించుకొన్న నాటకాలని ప్రదర్శిస్తారు. రెండుమూడు రోజులయినాక గోసంగి (జాంబవంత), బ్రాహ్మణవేషాలు వేసుకొని జాంబపురాణం చెపుతారు. నిర్ణయించుకొన్న ప్రదర్శనలన్నీ పూర్తి అయినాక "ఎల్లమ్మవేషం" ప్రధాన భూమిక వహిస్తుంది. ఆ కళాకారుల కుటుంబంలోని ఒక స్త్రీ ఎల్లమ్మ వేషం ధరిస్తుంది. వేషధారణలో గవ్వల తొంగాలు, ముఖానికి పసుపు రాసుకొని ముఖమంతా కుంకుమబొట్లు పెట్టుకొని, కుడిచేతిలో కత్తి, ఎడమచేతిలో వేపకొమ్మలు పట్టుకోవడం కనబడుతుంది. ఎల్లమ్మ 'త్యాగం' సంప్రదాయం ఉన్న ప్రతి ఇంటి లోపలికి వెళ్ళి ఆ ఇంటిలో ఉన్న కూరాడు కుండలో చేయి పెట్టి రావడం ప్రధాన కార్యక్రమం. మంగళ, బుధ, ఆదివారాల్లో మాత్రమే ఈ ఎల్లమ్మ వేషం ధరిస్తారు. ఈ ఎల్లమ్మ వేషం ఇంకా ఆ ఊరిలో అనారోగ్యంతో బాధపడేవారిని, గవ్వల తొంగాలతో తుడిచి బొట్టుపెడుతుంది. అలా పెడ్తే ఆరోగ్యం కుదుటపడుతుందని వారి నమ్మకం. పిల్లలు లేని స్త్రీలు ఎల్లమ్మను కౌగిలించుకొంటే పిల్లలు పుడతారని నమ్మకం.

ఈ కార్యక్రమం అటు కళాకారుల్ని, ఇటు వారిని పోషించే ప్రజల్ని ఒకటిగా చేసి పరస్పర ఆధార, పరస్పర పోషిత స్వభావం పెంపొందించేటట్టు చేస్తుంది. ఇక్కడ యక్షగానాలు ప్రదర్శించడమనేది ఒక మిషమాత్రమే. ఆ ప్రదర్శనలు చిందువారి, వారిని పోషించే మాదిగవారి సాంస్కృతిక నేపథ్యానికి అనుగుణంగా ఒదిగిపోతాయి. ఒక్కోసారి 'ప్రదర్శన పాఠ్యం'లో లేని పద్యాలు కూడా వచ్చేస్తుంటాయి. ప్రేక్షకులు తెలిసినా వాటిని అధిక్షేపించరు. ఒకరకంగా ఆ ప్రదర్శనలు వారి సాంస్కృతికాంశాల్ని నిదాన (Symbolic) రూపంలో చూపిస్తూ ఒక సందేశాన్ని పంపే వాహికలుగా మాత్రమే వుంటాయి. వర్తమాన నాటక రంగంలోలాగా వాస్తవికతకి టెక్నిక్‌కి అక్కడ ప్రాధాన్యం లేదు. ఒకే ఒక్క 'సీను'తో నాటకం మొత్తం ప్రదర్శింపబడుతుంది. అలాగే 'త్యాగం'లో భాగంగా వచ్చిన బట్టల్ని అవసరమయితే ప్రదర్శనలో వాడుకొంటారు. బూరుగ చెక్క లేదా అట్టలతో వేషభూషణాలు తయారు చేసుకొని వాటికి అద్దాలు, పూసలు అలంకరించి ఉపయోగించుకొంటారు. గణపతి ప్రార్థనతో ప్రారంభించి, మంగళంతో ముగించటం సంప్రదాయం. ప్రదర్శన మధ్యలో కానుకలు సమర్పించినవారిని ప్రత్యేక పద్ధతిలో (Formula type) దీవిస్తారు.

మిత్తిలి నాటకాలని 'మిత్తిలి అయ్యవార్లు'గా పిలువబడుతున్న 'మిత్తిలి' వారు ప్రదర్శిస్తారు. మిత్తిలి వారు 'మన్నెపోళ్ల'ను మాదిగవారిని ప్రధానంగా ఆశ్రయించి ప్రదర్శనలు ఇస్తారు. ఇతర ప్రజల దగ్గర కూడా ప్రదర్శనలు ఇస్తారు. వీరికి 'త్యాగం' సంప్రదాయం లేదు. అయినా నాటకాలని ప్రదర్శించడం తమ కులవృత్తి. సంక్రాంతి నుంచి మూడు నెలలపాటు ఊరూరు తిరిగి ప్రదర్శనలు ఇస్తారు. దినానికి, కర్మకాండలకు, పండుగలకు, పెండ్లిండ్ల సమయంలో కూడా వీరు ప్రదర్శనలు ఇస్తారు.

వీరు ప్రదర్శించే నాటకాలలో విరాటపర్వం (కీచక వధ), పాండవ వనవాసం, సత్యహరిశ్చంద్ర, సతీసావిత్రి, సత్యవతి, దాగ్నేయోపాఖ్యానం, రంభరంపాల, కర్ణయుద్ధం, శశిరేఖా కళ్యాణం, కర్ణ దుశ్శాసన, మహి రావణ లవకుశ, కూచకొండ రామాయణం, భక్తప్రహ్లాద, సావిత్రీ పరిణయం, సారంగధర, విషాద బాలనాగమ్మ, చిరుతొండ మారాజు కథ, ఆరెమరాఠి ప్రధానమైనవి.

పెండ్లిండ్లలో పెండ్లి ప్రస్తావన ఉన్న కథల్ని ప్రదర్శిస్తే, కర్మకాండలపుడు సత్యహరిశ్చంద్ర, రామదాసువంటి భక్తి కథల్ని ప్రదర్శిస్తారు. చెర్విరాల బాగయ్య, తోరమామిడి మల్లయ్యల రచనల్ని వీరు వాడుకొంటారు. గణపతి ప్రార్థనతో ప్రదర్శన ప్రారంభమవుతుంది. పగలు తొమ్మిది గంటలకు మొదలుపెడితే సాయంత్రం నాలుగు వరకు, రాత్రి తొమ్మిది గంటలకు మొదలుపెడితే తెల్లవారి నాలుగు గంటల వరకు ప్రదర్శన జరుగుతుంది.

గంటె భాగవతాలని దాసరి కులంలోని ఒక తెగవారు ప్రదర్శిస్తారు. ప్రదర్శనకోసం గంటెలో నూనెపోసి, ఒత్తులు వేసి దీపంలాగా వాడుకొంటారు. అందుకని వీరిని గంటె భాగవతులుగా పిలుస్తున్నారు. ఇందులోని విదూషకులు, బంగారక్క, గంధోళిగాడు.

వీరు ప్రదర్శించే నాటకాలలో శంబరాసుర, శ్రీరామపట్టాభిషేకం, లక్ష్మణ పరిణయం, లవకుశ, బకాసుర, బభ్రువాహన, శశిరేఖ, అల్లీరాణి హరిశ్చంద్ర, భక్తప్రహ్లాద, భక్తిపుండరీక, ధర్మాంగద, సతీ తులసి, సతీసావిత్రి బాలనాగమ్మ లాంటివి ప్రధానంగా ఉన్నాయి.

గోంధళే భాగవతాన్ని, ఆరె కులంలో ఉపభాగం అయిన 'గొంధళే'లు ప్రదర్శిస్తారు. 'గొంధళే' అంటే కొలుపు అని అర్థం. కొలుపులు చేసేవారు కాబట్టి గొంధళేలు అయినారు. వీరు భవానీ మాతకు కొలుపులు చేస్తారు.

గోంధళేలు ప్రదర్శించే నాటకాలలో ఏక్‌తంగ్‌కథ, జయరాణి, మౌనశీల కథ, రాధాబాయి, బాలవంతి, నీలకంత, కాళోజీ కథ, కళింగ మహారాజు కథ, అర్జున వనవాస కథ, అభిమన్యు స్వయంవర కథ, భట్టి విక్రమార్క కథ మొదలైనవి ఉన్నాయి.

అంబ భవాని ప్రార్థనతో ప్రదర్శన ప్రారంభమవుతుంది. ఇందులోని ప్రధాన పాత్రలన్నీ 'ఆరె' భాషలోనే ప్రదర్శన నిర్వహిస్తాయి. విదూషక పాత్ర మాత్రం ఆరె భాషలోని ఆ పాటల్ని, పద్యాల్ని, వచనాన్ని తెలుగులో విపులీకరించి చెప్తాడు. నాటకం మొత్తం వేదికమీద కనబడే పాత్ర అదే.

కులవృత్తి కళాకారులేగాకుండా, ఆంధ్రదేశంలో నాటక ప్రదర్శన ప్రవృత్తిగా చేసుకొన్న కళాకారులు, దాన్నే వృత్తిగా మలుచుకొన్న కళాకారులు వున్నారు. కులవృత్తి కళాకారులు ప్రదర్శించే నాటకాలు ఆయా కులాల పేరు మీద చలామణిలో వుంటే వీరి నాటకాలని భోగాతాలని, వీధి భోగాతాలని, వీధి నాటకాలనీ, యక్షగానాలనీ, 'ఆట'లనీ ప్రాంతీయంగా వివిధ పేర్లతో చలామణిలో ఉన్నాయి. ఈ నాటకాలు 'ద్రౌపది తిరణాలలో' తప్ప మిగతా సందర్భాలలో ప్రదర్శిస్తున్నప్పుడు అనుష్ఠాన పరంపర ఉన్నట్లు కనబడటంలేదు.

చిత్తూరు జిల్లాలో, తమిళనాడులోని పాత ఉత్తర ఆర్కాడు జిల్లాలో ద్రౌపదీ సమేత ధర్మరాజాదులకు దేవాలయాలున్నాయి. చిత్తూరు జిల్లాలోనే తొంభయికి పైగా దేవాలయాలున్నట్లు పరిశోధకులు గుర్తించారు. ఈ దేవాలయాల్లో ప్రతి ఏటా ద్రౌపది, ధర్మరాజుల తిరణాల పేరుతో ఉత్సవాలు జరుగుతున్నాయి. ఈ తిరణాలలో పగటిపూట కథాగానం, మహాభారతంలోని కొన్ని సన్నివేశాలకు అనుగుణంగా అనుష్ఠానాలు, రాత్రుళ్లు 'ఆట'లుగా ప్రచారంలో ఉన్న భోగాతం ఆటలు నాటకరూపంలో ఉంటాయి.

తిరణాల ప్రధానంగా పద్దెనిమిది రోజులు జరపటం ఆనవాయితీ. అయినా ఆర్థిక వనరుల్నిబట్టి ఏడునుంచి నలభై రోజుల దాకా జరిపించడం ఉంది. తిరణాల పద్దెనిమిది రోజులు జరిగితే అప్పుడు శ్రీకృష్ణలీలలు, కురుపాండవ జననం, హిడింబాసుర వధ, బకాసుర వధ, ద్రౌపదీ కల్యాణం, చిత్రాంగద విలాసం, సుభద్రపెళ్లి, ద్రౌపది మానసంరక్షణ, అరణ్యపర్వం, గయోపాఖ్యానం, శశిరేఖా పరిణయం, యక్షప్రశ్నలు, కీచకవధ, దక్షిణ గోగ్రహణం, ఉత్తర గోగ్రహణం, ఉత్తరాభిమన్యుల పెళ్లి, శ్రీకృష్ణ రాయబారం, మహాబారత యుద్ధం లేదా కురుక్షేత్రం ఉంటాయి. ఒకవేళ ఏదైనా అవాంతరం జరిగి ముందురోజు నాటకం జరగకపోతే మరునాడు రెండు నాటకాలని కలిపి ప్రదర్శిస్తారు. అప్పుడు ప్రదర్శన సంగ్రహంగా ఉంటుంది.

వేములపల్లె వేంకట సుబ్బయ్య ఉషాపరిణయం, విరాటపర్వం, ద్రౌపది కళ్యాణం అన్న మూడు నాటకాలని రచించి, వేములపల్లె ధాముడైన శ్రీ వేంకటేశ్వరునకు అంకితమిచ్చినాడు. ఈ మూడు నాటకాలు క్రీ.శ. 1894 సంవత్సరంలో బరూరు త్యాగరాయశాస్త్రిగారు గీర్వాణ భాషా రత్నాకర, ముద్రిత శాల యందు ముద్రించబడ్డాయి. వేములపల్లె నాటకాలుగా చిత్తూరు జిల్లాలో ఈ నాటకాలు చలామణిలో ఉన్నాయి.

వేములపల్లి విరాటపర్వ నాటకాన్ని రెండు రాత్రుల కథగా రచించారు. మొదటిరాత్రి కథ పాండవులు అరణ్యవాసంలో తమతో కూడా ఉండిన సైన్యాన్ని, ప్రజల్ని రాజధానికి వెళ్ళిపొమ్మని, తమ అజ్ఞాతవాసానికి భంగం కలగకుండా సహకరించాలని కోరి వారిని పంపించివేసినాక అజ్ఞాతవాసాన్ని ఎలా గడపాలి అని చర్చించుకునే సన్నివేశంతో ప్రారంభమౌతుంది. అలాగే కీచక వధానంతరం సుధేష్ణ సైరంధ్రిని పిలిచి, కీచకుడిని, నూర్గురు

తమ్ముళ్ళి చంపితివి, ఇంక ఈ ఇంట నుండొద్దు ఎక్కడికయినా వెళ్లమంటుంది. సైరంధ్రితో మాట్లాడిన తర్వాత గంధర్వుల బలంతో నా భర్తను రక్షించి, నాకు పతిభిక్ష పెట్టమంటుంది. సైరంధ్రి మా వల్ల నీ భర్తకు మంచే జరుగుతుంది, అని చెప్పి మరికొన్ని రోజులుండి వెళతాం, అంతవరకు నాకు అనుజ్ఞ ఇవ్వవలసిందిగా కోరుతుంది. దీంతో మొదటిరాత్రి కథ పూర్తవుతుంది.

రెండోరోజు కథ, చోపుదారి ప్రవేశించి దుర్యోధన మహారాజు కొలువు కూటమునకు ఏతెంచుచున్నాడు, నగరవీథుల్ని అలంకరించి ఆహ్వానం పలకండి అంటూ చెప్పడంతో ప్రారంభమవుతుంది. దక్షిణ గోగ్రహణం, ఉత్తర గోగ్రహణం, ఉత్తరాభిమన్యుల పెండ్లితో రెండో రాత్రి నాటకం పూర్తి అవుతుంది.

ద్రౌపది కల్యాణ నాటకము కూడా రెండురాత్రుల కథగానే రచించారు. మొదటిరాత్రి కథ, దృతరాష్ట్రుడు ధర్మరాజుకు యువరాజు పట్టాభిషేకం కట్టాలని తలపోయడం, దుర్యోధనుడు వచ్చి "దాయాదుల నమ్మరాదు నాయనా! ధృతరాష్ట్ర నృపాలా!... వైరిజనులు నణువులనుచు చేరదియ్యరాదెట్లన్న గోరంత యగ్ని కణము కొండలెల్ల గాల్ప లేదె!... కావున దాయాదులైన పాండవులతో కలిసియున్న మనకు కీడు సంభవించునట్లు గాకుండ వారల హస్తినాపురంబు వెడలించి వారణావత పురంబున కాపురంబుంచుము నాయనా! ధృతరాష్ట్ర మహీపాలా! అని దుర్యోధనుడు తన తండ్రిని వేడుకొనే సన్నివేశంతో ప్రారంభమవుతుంది. 'ఘటోత్కచుడు సద్యోగర్భంబున కామరూపధరుండై పుట్టిన తక్షణంబు నవయౌవనుండును, ననేకాస్త్ర శస్త్ర కుశలుండును, నపరిమిత రాక్షస, పిశాచ, బలపరివృతుండునునై తండ్రుల దగ్గరికి వస్తాడు. ధర్మరాజు అతనికి తాము వారణావతానికి రావడం, అక్కడ లక్క ఇంటిలో నుండి తప్పించుకోవడం తదితర వివరాలు తెల్పడంతో మొదటిరాత్రి కథ పూర్తవుతుంది. రెండోరోజు కథ పాండవులు తమ తల్లితో కూడా ఏకచక్రపురం చేరరావడంతో ప్రారంభమవుతుంది. ద్రౌపది వివాహ మహోత్సవము ప్రకటించి, నగరాన్ని అలంకరించి, తలంటుపాట, నలుగుపాట, సుంకులు దంచుపాట, సువ్వాలపాట, శోభనపు పాటతో శోభనం చేయించడం, మూడోరోజు సభాపూజ, అయిదోరోజు నాకబలి ఆచరించి పెండ్లి కార్యక్రమాల్ని పూర్తి చేసుకోవడంతో పూర్తవుతుంది. అయినా ధృతరాష్ట్రుడు పాండవులను తమ రాజ్యానికి పిలువనంపి అర్థరాజ్యం ఇచ్చి, ఇంద్రప్రస్థపురాన్ని నిర్మించి ఇచ్చి పాండవులను అక్కడికి పంపడం దాకా చెప్పడం, చివరి ద్విపదలోని వృత్తాంతం.

ద్రౌపది తిరణాలలో ఆడే వీధినాటకాలలో ఉపయోగించుకునే మరో గ్రంథం శ్రీ కొత్తూరు రామలింగా రెడ్డి రచించిన శ్రీమహాభారత నాటకము. ఇందులో ఆది, సభా, అరణ్య, విరాట, ఉద్యోగ, భీష్మ, ద్రోణ, కర్ణ, శల్య, గదా పర్వాలన్న పది పర్వాలున్నాయి.

శ్రీమహాభారత నాటకం ప్రారంభం ఇలా ఉంది. 'జనమేజయ మహారాజు విలసచ్ఛ్రేయముతో, దేవేంద్రుడు అమరావతి పరిపాలిస్తున్నట్లు పరిపాలిస్తున్నాడు. సర్పయాగం చేసినాక అతని చేతులు, ఒడలు అంతా తెల్లగా పూసిన విబూదియట్లు వ్రణముల్ జనియించినాయి. వాటినిచూసి, మనసులో కలతచెంది, పెద్దలను, ఆప్తుల్ని పిలిచి మీరలు ఆత్మతత్త్వజ్ఞులు, నాకు ఈ వ్యాధి రావడానికి కారణమేమి? తెలియచెప్పండి అని వేడుకొంటాడు. ఆర్యులు యోచించి ఇది సర్పముఖ దోషంవల్ల పుట్టింది, దీన్ని తొలగించుకోవచ్చు అంటారు. మహా భక్తితో భారతం వింటే ఈ వ్యాధి పోతుందంటారు. అప్పుడు జనమేజయుడు వారిని చూసి అలాగే భారతకథను వింటాను. దాన్ని చెప్పేవారెవరో తెల్పండని విన్నవించుకొంటాడు. అలా వినమ్రుడై అడిగిన జనమేజయుని చూసి వైశంపాయను వలన మహాభారతాన్ని వినమని వారు ఉపదేశిస్తారు.'

శిష్ట మహాభారతంలో రాజరాజనరేంద్రుడు తనకు 'అనవరతంబును శ్రీ మహాభారతంబునందు యభిప్రాయము పెద్దయై యుండు, సతతంబు నాయెడ గరంబిష్టములై యుండు... ''భారత శ్రవణాసక్తియు'', అంతేకాక పూరు, భారతదేశ కురుప్రభువు పాండుభూపతుల్ క్రమముగా మా వంశకర్తలు, మా వంశంలో ప్రసిద్ధులైన పాండవోత్తముల చరిత్ర నాకు సతతము వినంగ నభీష్టమెంతయున్' అని ''కృష్ణద్వైపాయన ముని వృషభాభిహిత మహాభారత బద్ధ నిరూపితార్థమేర్పడదెనుగున రచియింపు"మని నన్నయను అడుగుతాడు.

శ్రీ మహాభారత నాటకంలో జనమేజయుడు తనకు సోకిన రోగాన్ని మాపుకోవటానికి మహాభారతం వింటాడు.

ప్రారంభంలోనే మహాభారత కథ వినడంవల్ల చేకూరే ప్రయోజనాన్ని చెప్పడం ఈ కృతి విశేషం. ఈ నాటకంలో కౌరవ పాండవ వంశక్రమాన్ని చాలా సంక్షిప్తంగా చెప్పారు.

"విను జనమేజయ, ఖ్యాతి హృదయ జననీ యీ మీ పెద్దల చారిత్రమెల్ల. పరబ్రహ్మంబునందు పరామణువు మహోకృతి జనియించెన్ యొరని యాకృదతియు ముమ్మూర్తులగాంచె ననఘుడౌ యా బ్రహ్మ కా నవ బ్రహ్మలు ఉదయించి – రందులో నొనయ తిబ్బకంట కనులకి పైనట్టి చంద్రుండు పుట్టె... ఇందుని భార్య రోహిణి గర్భమందు పొందుగా ధీశాలి బుధుడుద్భవించె, నా బుధునకు పురూరాన్వియు దొడలె నా పురూరవు దూర్వశియందు గనియె యాయువు యనువాని నధిక మోదంబున ప్రాయక నహుషంబు భజమొందెనట్టి కుగలేశ్వరునకు పుట్టె కొడుకు యయాతి. యదన జనియించే నంత భూరుండు యతడు మోదమునం దుష్యంతుని గనియె నతడు శకుంతల యను కన్య వలన భరతుని గాంచె నా భరతుని యందు పురసత్త్వు సంహ్మరుడొగి జాతమైయె వానికి పుట్టె తర్వాక కురుండు బూని యా రాజునకు పుట్టు ప్రదిపుడా భూపతికి పుట్టునట సంతనుండుశ్రీభవు బోలు నాక్షితిపాలకునకు విరివితో విచిత్ర వీర్యుండు పుట్టు అరుదార యతనికి యంబీయంబాలికల పుట్టు నా పాండురాజు అందగ్రజుండు పుట్టును తొలుత గాంధారి యనుదాని గరహవరించి నంతట పాండురాజతి వేట్కమీర కుంతి మాద్రుల మదిగోరివరించె తరుణులిద్దరు దయనేలుకొనుచు మరియును యువరాజ్యములు తానేలుచుండె."

తర్వాత పాండురాజు కొలువు కూటముతో కథ ప్రారంభమవుతుంది.

పరబ్రహ్మం – ప్రకృతి – ముమ్మూర్తులు – బ్రహ్మకు నవ బ్రహ్మలు – ఒక నవ బ్రహ్మకు చంద్రుడు – బుధుడు – పురూరవుడు – ఆయువు – నహుషంబు – యయాతి – పూరుడు – దుష్యంతుడు – భరతుడు – పురసత్త్వుడు – కురుండు – ప్రదిపుడు – శంతనుడు – విచిత్ర వీర్యుడు – పాండురాజు, అతని అగ్రజుడు – అలా వంశ మూలపురుషులు అవుతారు. అగ్రజుడు గాంధారిని పెండ్లి చేసుకొంటాడు. పాండురాజు కుంతి మాద్రులను వరించి యువరాజుగా రాజ్యాన్ని ఏలుతున్నాడు. చంద్రుడి నుంచి తీసుకుంటే పదునైదవ తరంలో ధృతరాష్ట్ర పాండురాజులు ఉన్నారు. అదే శిష్ట భారతంలో ఇది విశాలంగా సాగుతుంది. అందులో కొంతమంది పేర్లు కేవలం నామమాత్రమే. చంద్రుడి నుంచి పూరుడి పుట్టుక దాకా రెండింటిలోనూ ఒకేవిధంగా ఉంది. పూరుడికి పద్దెనిమిదవ తరం వాడు దుష్యంతుడు. భరతునికి ఏడో తరం వాడు కురుండు. పురసత్త్వుని ప్రస్తావన లేదు. కురుడికి అయిదో తరం వాడు ప్రదిపుడు. అతని రెండో తరం వాడు శంతనుడు. అంటే శిష్ట భారతంలో వంశావళి అరవైకి పైగా ఉంటే అది ఇరవై లోపు కుదించబడింది వీధి బాగొతంలో.

**జానపద నాటకాలు – ప్రదర్శన విధానం :**

కులవృత్తి కళాకారులకి, వృత్తి కళాకారులకి, ఔత్సాహిక కళాకారులందరికీ కూడా ప్రచురించబడిన నాటకాలే ఆధారం. వీటిలో చాలాభాగం క్రీ.శ. ఇరవయ్యోశతాబ్ది తొలి నాళ్లలోనో, అంతకు ముందో ప్రచురణ పొందినవే. ఆ ప్రతులు ఎన్నో ముద్రణలు పొందాయి.

ఈ నాటకాలలో దరువులు, ద్విపదలు, వచనాలు ప్రధానంగా ఉంటాయి. రాగం, తాళం ప్రధాన భూమిక వహిస్తాయి. భాష చాలా చోట్ల సంస్కృత సమాసభరితంగా ఉంటుంది. దీన్ని నేర్చుకొనే కళాకారుల్లో అధికశాతం విద్యాభ్యాసం ఎక్కువగా కలిగినవాళ్ళు కాదు. ఆ దరువుల, ద్విపదల అర్థాన్ని తెలుసుకొని పాడేవాళ్ల సంఖ్య స్వల్పం. తాళ జ్ఞానానికి పెద్ద పీట వేయటంవల్ల పాదం విరుగుడు ఒక్కసారి అర్థవిహీనమో, విపరీతార్థం స్ఫురించడానికో హేతువవుతుంది. ఇది చాలదన్నట్లు ప్రచురించిన గ్రంథాల్లో కూడా అచ్చుతప్పులు తక్కువలేవు. 'చెప్పవే రాకేందునిభాస్యా', ఒకే గ్రంథంలో (విరాటపర్వ నాటకము – వేములపల్లి వేంకట సుబ్బయ్య) 'చెప్పవే రాకేందు నిభాస్యా' అని, 'చెప్పవే రాకేందుని భాస్యా' అని ప్రచురింపబడింది. అలాగే మహాభారత నాటకం (కొత్తూరు రామలింగారెడ్డి)లో తాళానికి ప్రాధాన్యం ఇవ్వడంవల్ల పాదం విరుపు అర్థవంతంగా లేదు. 'యింద్రుని భార్య రో–హిణి గర్భమందు', నా బుధునకు పురూరాన్వియుదొడలె' యతడు మోదమునం దు – ష్యంతుని గనియె', వానికి పుట్టెత – ర్వాక కరుండు" అన్న పాదాల్లో విరుగుడు ఎలా ఉందో అలాగే పాడడం పరివ్యాప్తిలో ఉంది. ఈ దోషాల్ని పరిహరిస్తే 'వీధినాటకం' ఒక మహత్తరమైన నాటకంగా ఉంటుందనటంలో అతిశయోక్తి ఉండదు. వీధినాటకాలలోని

ప్రదర్శన పాఠ్యంలో దరువులు, ద్విపదలు, వచనం, కందార్థాలు, సీసాలు, ద్విపదార్థాలు ఉంటాయి. ప్రతిదాని దగ్గర అది ఏ రాగంలో, ఏ తాళంలో పాడాలో నిర్దిష్టంగా ఉంటుంది. దరువు పాడే పాత్రని, సందర్భాన్నిబట్టి అది ఉంటుందన్న విషయాల్ని అక్కడ చూడగలం. ఒకరకంగా కళాకారుడికి అది ఒక Ready Reckoner లాంటిది. భోగాతాలలో ఒక పాత్రని గురించి, అతని గొప్పతనాన్ని గురించి, అతని మనోభావనల్ని ఇంకొక పాత్ర వివరించేటపుడు 'ద్విపద'లని, అదే విషయాన్ని పాత్రే చెప్పేటప్పుడు 'దరువు'లని ఉపయోగిస్తున్నట్టు తెలుస్తుంది. అలాగే దేవతలని వేడుకొనే 'తేవారం', 'కొచ్చిగం' సంప్రదాయాలు కూడా మెండుగా ఉన్నాయి.

ప్రవేశ దరువుకు ముందు 'జతికట్టు'లను ఉపయోగించుకోవడం ఉండేదని తెలుస్తుంది. వీటిమీద ప్రదర్శనల ఆధారంగా పరిశోధన జరిగితే శిష్టపద్ధతికి, వీరి ప్రదర్శనలకి మధ్య వున్న మార్పుల్ని గ్రహించడానికి వీలవుతుంది. శిష్టపద్ధతిలో దరువులు, ద్విపదలు, కందము, సీసము, జాతి, కందార్థాలులాంటివి ఎలా ఉంటాయో పెద్దలు డా॥ నటరాజ రామకృష్ణగారు (దాక్షిణాత్యుల నాట్యకళా చరిత్ర), డా॥ ఉమారామారావు గారు (శహాజీ యక్షగాన ప్రబంధాలు) వివరించి ఉన్నారు.

ముద్రితప్రతి ఉన్నా కళాకారులు దాన్ని యథాతథంగా ఉపయోగించుకొంటున్నారా, లేక అవసరమనుకొన్నచోట ఏమయినా చొప్పిస్తున్నారా అన్నది కూడా చూడవలసి ఉంది. మహాభారత నాటకాల్ని ద్రౌపది తిరణాలలో భాగంగా ప్రదర్శించేటపుడు రాత్రి పదినుంచి తెల్లవారేదాక ప్రదర్శించాలన్న నియమం ఉంది. అలాంటప్పుడు 'మార్పులు, చేర్పుల' పాత్ర ఎక్కువగా ఉంటుంది.

'బూరుగు చెక్క'తో లేదా అట్టలతో వేషభూషణాలని తయారుచేసుకొని వాటికి అద్దాలు, పూసలు అలంకరించి కొంతమంది చిందు కళాకారులు వాడుకొంటున్నారు. కీర్తిశేషులు చిందుల ఎల్లమ్మ బృందం వేషధారణ ప్రత్యేకంగా ఉంటుంది. చిత్తూరు జిల్లాలోని వీధినాటకాలలో ఒకప్పుడు రేకులతో తయారుచేసిన కిరీటాలకి చెమ్కీలు అద్ది వాడుకొనేవారు. నేడు చాలావరకు అట్టలతో చేసిన కిరీటాలే ప్రధానంగా కనబడుతున్నాయి. బుగ్గ అగ్రహారం, సూరేకాపురం కళాకారులు వాడే వేషభూషణాలలో భుజకీర్తులు, చెక్కలతో చేసిన కిరీటాలు ఉన్నాయి. వీరి వేషధారణకి తమిళ 'తెరుక్కూత్తు' సంప్రదాయానికి సన్నిహిత సంబంధం ఉంది.

వర్తమాన నాటకంలో 'టెక్నిక్' 'వాస్తవికత' ప్రాధాన్యం వహిస్తే అది నిదానరూపం (Symbolic)లో మాత్రమే జానపద నాటకాలలో కనబడుతుంది. వర్తమాన నాటకంలో 'వేదిక' స్థల కాలాదుల కనుగుణంగా ఉంటే, జానపద నాటకాలు ఒకటి, రెండు తెరలతోనే పూర్తి అవుతాయి.

వీధినాటకాలలోనూ, కులవృత్తి నాటకాలలోనూ 'పైమేళం' ప్రత్యేకంగా ఉంటుంది. వేదికమీద పాత్ర పాడిన దరువుని ఇతర పాత్రలు ఎత్తి పాడటం అక్కడ చూడగలం. ఇందులో కళాకారులందరూ పాల్గొంటారు. అందువల్ల అందరికీ అన్ని పాత్రలకి సంబంధించిన కథతో, కథాగమనంతో పరిచయం, అభినివేశం ఉంటాయి. ఇది రానురాను తగ్గుతుంది. కర్ణాటకలోని 'యక్షగానం'లో వచ్చిన మార్పు – పాత్రలు పాడకపోవడం. మరి వీధినాటక ప్రదర్శన భవిష్యత్తులో ఎలాంటి పరిణామానికి దారితీస్తుందో చూడాలి.

జానపద నాటకాల ప్రదర్శనలో శ్రుతి, హార్మోనియం, మద్దెల, తబలా, తాళాలు ప్రముఖంగా ఉంటాయి. కులవృత్తి కళాకారులు శ్రుతి, మద్దెల ఉపయోగించుకొంటుంటే, వృత్తి కళాకారులు హార్మోనియం, తబలా ఉపయోగించుకొంటున్నారు. తాళాలు ఇద్దరికీ ప్రధానమే. దరువులలో వేసే 'అడుగుల'కు ఉత్తేజం తబలా వాద్యం అయితే, రాగ నిర్దేశం హార్మోనియం.

జానపద నాటక ప్రదర్శనలలో మరో ముఖ్య అంశం 'విదూషక పాత్ర'. నాటక ప్రదర్శనకి ప్రేక్షకులకి మధ్య అనుసంధాన కర్త విదూషకపాత్ర. వేదిక మీదకు వస్తున్న, ఉన్న, పాత్ర స్వరూపాన్ని, స్వభావాన్ని ప్రేక్షకులకు అవసరమున్నచోట వారి దగ్గరికి తీసుకపోవడానికి ఉత్సుకత చూపే పాత్ర ఇది. పాత్రలు పాడే పాటని, మాటని శబ్దసామ్యంతో విరుస్తూ, విపరీతార్థం కల్పించి ప్రేక్షకుల్ని కడుపుబ్బ నవ్వించే పాత్ర ఇది. కరుణ శృంగార రసాలలో ఏదయినా మోతాదు మించిపోతే వాటిని సమతూకంలో పెట్టగల్గిన హాస్యాన్ని పండించే పాత్ర ఇది. స్వూనరిజానికి ప్రతీక అది. వేదిక మీద లేని పాత్రల్ని అవసరమయితే

పోషించే బాధ్యత కూడా ఈ పాత్రమీదే ఉంటుంది. అలాంటపుడు వేషధారణని పట్టించుకోకపోవడం అలాంటి పాత్రలు పోషిస్తున్నప్పుడు కూడా హాస్యోక్తులు విసరడం సాధారణం. మొత్తంమీద ప్రేక్షకులు నాటకాన్ని అర్థం చేసుకోవడానికి, వారిని నాటక ప్రదర్శనవైపు మళ్ళించడానికి విదూషక పాత్ర దోహదపడుతుంది. ఈ వీధినాటకాలు ద్రౌపది తిరణాల సందర్భంలో మాత్రమే గాకుండా ఇతరత్రా కూడా ప్రదర్శిస్తారు. ఒకప్పుడు చాలా గ్రామాల్లో వీధినాటక సమాజాలు ఏర్పడి నాటకాల్ని నేర్చుకొని ప్రదర్శించేవారు. వీటికి అనుష్ఠాన నేపథ్య సంప్రదాయం ఉండదు. ఇలా నేర్చుకొన్న ఔత్సాహిక కళాకారుల్లో కొంతమంది దీన్ని వృత్తిగా స్వీకరించి, వృత్తి కళాకారులయి ప్రదర్శనలు ఇస్తుంటారు. ప్రస్తుతం కొందరయితే ఉత్సవాల్లో భాగంగా ఒకేరోజు వేర్వేరు ప్రాంతాల్లో రెండు మూడు నాటకాలలో కూడా పాల్గొనటం విశేషం. ప్రతి నాటకంలోనూ ప్రధానపాత్రల్ని నాటకాన్ని బట్టి, ముగ్గురు నలుగురు పోషించడం ఇక్కడ ఆనవాయితీ.

వర్తమాన కాలంలో ''కథాసంప్రదాయాన్ని'' కొనసాగించిన కొన్ని కళారూపాలు 'నాటక సంప్రదాయం' వైపు మళ్లుతున్నాయి. అందులో ప్రధానంగా 'పటం' కథల్ని చెప్పుకోవాలి. డక్కలి, కాకిపడిగెల, కొర్రాజులు 'తమ కథాగాన ప్రదర్శనకు మెరుగులు దిద్ది, కళాకారులు వేషాలు ధరించి, నాటక ఫక్కీలో కథ చెప్పి, ప్రేక్షకుల్ని అలరిస్తున్నారు. కొంతమంది తమకున్న రాగపరిజ్ఞానంతో కథ మధ్యలో కొన్ని పాటల్ని చొప్పిస్తుంటే మరికొంతమంది పాత సినిమా పాటల బాణీని అనుసరిస్తున్నారు'. గౌడజెట్టీలు చెప్పే గౌడపురాణంలో చివరి భాగమయిన 'భక్తసురమాంబ' కథని మాత్రం వేషాలతో యక్షగాన రూపంలో ప్రదర్శిస్తున్నారు. శంకరుడు, పార్వతి, పడుచు బ్రాహ్మణుడు, ముసలి బ్రాహ్మణుడు, సురమాంబ, కంఠమగౌడు, హాస్యపాత్రలు వేషాల్ని ధరిస్తాడు.

ఈ ప్రదర్శన అయినాక కాటమయ్య పండగ చేస్తారు. ఏనోట్టివారు 'పటం' కథ అయిదురోజులు చెప్తారు. తరువాత కాటమయ్య పండగ చేస్తారు. 'గావు' పట్టటం, 'బలి' తిరగడం అయిపోయినాక ఆరురోజులు నాటకాలు వేస్తారు. వీరు వేసే నాటకాలు సత్యహరిశ్చంద్ర, భక్తప్రహ్లాద, గయోపాఖ్యానం, లవకుశ లాంటివి.

**ఆర్థిక వనరులు :**

ప్రజల సహకారం లేనిదే ఏ కళారూపం పదికాలాలపాటు మనజాలదు. ఆర్థికపరంగా తోడ్పాటు లేనిదే ఏ కళాకారుడూ తన ప్రదర్శన జీవితాన్ని కొనసాగించలేడు. తెలంగాణలో కళాకారుల్ని ఆదుకొనే 'త్యాగం' సంప్రదాయం ఉంది. ప్రతి కులం ఒక కులవృత్తి కళాకారుల్ని పోషిస్తుంది. 'త్యాగం' ఒక హక్కు. 'మిరాశి' హక్కు. కళాకారులకి అది పారంపర్య హక్కుగా సంక్రమించిన వైనం తెలంగాణలో ఉంది. ఆ హక్కుని పొందడానికి కొన్నికొన్ని గ్రామాలు అతని ఆస్తిగా ఉంటాయి. ఆ గ్రామాల్లో నిర్ణీత సమయంలో ప్రదర్శనలు జరిపి ధన, ధాన్య, వస్తువులని 'త్యాగం' తీసుకొచ్చుకుంటారు.

నాటక ప్రదర్శనలు ఇచ్చే చిందు మొదలయినవారికి 'త్యాగం' హక్కు ఉంది. మరికొంతమందికి 'త్యాగం' హక్కు లేకపోయినా ఆదరణ ఉంది. అందుకే కులవృత్తి కళాకారులు తెలంగాణలో ఎక్కువగా ఉన్నారు.

నాటక ప్రదర్శనలో భాగంగా కొన్ని సన్నివేశాలలో సందర్భోచితంగా 'అక్షయపాత్ర'ని ప్రేక్షకుల మధ్యకు తీసుకుపోతారు. సహృదయ ప్రేక్షకులు విధిగా స్పందించి ఎంతో కొంత అందులో వేస్తారు. ఈ రచయిత చిన్ననాటి అనుభవాలలో 'ఆట'కు పోయే ప్రతిసారి ఇంట్లోవారు డబ్బులిచ్చి అందులో వేయమని చెప్పడం ఇంకా గుర్తు. అలాగే ప్రేక్షకులు కళాకారుల నటనని, ప్రదర్శనని మెచ్చుకొని 'ఒసుగులు' లేదా 'చదివింపులు' సమర్పించుకోవడం ఉంది. అలాంటి సమయంలో ఇచ్చినవారు, వారి వంశం, పదికాలాలపాటు సంపదైశ్వర్యాలతో, పుత్ర పౌత్రాభివృద్ధితో కలకాలం కొనసాగాలని దీవెనార్థులు దీవించటం ప్రత్యేకంగా ఉంటుంది.

ప్రస్తుతం ద్రౌపది ఉత్సవాలలో ప్రదర్శించిన మొత్తం నాటకాలకు కలిపి ఒకరికి కాంట్రాక్ట్ ఇస్తే, అతను కళాకారుడి నైపుణ్యాన్ని, అనుభవాల్ని, వేయగల పాత్రల్ని దృష్టిలో పెట్టుకొని వారితో ఒప్పందం చేసుకొంటాడు. అడ్వాన్సులు ఇచ్చి ఒప్పందం కుదుర్చుకొంటాడు.

**ముగింపు**

వృత్తి కళాకారులలో కొంతమంది బాగా చదువుకొన్నవారు ఉన్నారు. చాలామందికి ఆ అవకాశం లేదు. అలాగే కులవృత్తి కళాకారుల్లో అధిక భాగం

విద్యాగంధం లేనివారే. వీరందరు చిన్నప్పటినుంచే పెద్దలతో కలిసి ప్రదర్శనలో పాల్గొంటూ, అనుకరిస్తూ, అభ్యసిస్తూ అనుభవాల్ని సంపాదించుకొంటారు. తాము నేర్చుకున్నదంతా వినికిడి జ్ఞానం ద్వారానే. ఏ తరంలో అయినా ఉచ్చారణా దోషాలు, తాళలయ తొట్రుపాటులు దొర్లితే అవి తరువాతి తరానికి మాతృకలుగా మారిపోయే ప్రమాదం ఉంది. అలాగే ప్రదర్శన క్రమం తప్పినా కూడా అదే ప్రమాదం.

వీధినాటకం వృత్తికళాకారులు గురుముఖతః నేర్చుకొన్నా, ఒక్కో ప్రాంతంలో ఒక్కో గ్రంథం ప్రచారంలో ఉంది. గ్రంథంలో ఉన్న రాగతాళాల్ని యథాతథంగా అందరూ అనుసరించడం లేదు. ప్రదర్శన పూర్తి చేయాల్సిన సమయాన్నిబట్టి ఇతర రచనలలోని దరువుల్ని, ద్విపదల్ని, కందార్థాలని వాడుకొంటారు. అలాగే వేషధారణలోనూ కొంత వెసులుపాటును కొంతమంది అనుసరిస్తున్నారు.

జానపద నాటకాలు సమజా అడుగుజాడల్లో నడుస్తాయన్నది నిర్వివాదం. అనుష్టాన నేపథ్యంలో నాటక ప్రదర్శన ఒక అంశం మాత్రమే. సహృదయ ప్రేక్షకులు కళాకారులు ఇతరత్రా చేసిన పొరబాట్లని పట్టించుకోకపోవచ్చు. కాని అవే కళారూపాలు అనుష్ఠానేతర సందర్భాలలో ప్రదర్శించవలసి వచ్చినప్పుడు మారవలసి ఉంది. ఉచ్చారణా దోషాలు, రాగ, తాళ జ్ఞానం, వేషధారణ, వేదిక మీద ఇతర పాత్రల మధ్య ఉండవలసిన సహకారంలాంటి వాటిమీద కళాకారులు దృష్టిపెట్టవలసిన అవసరం ఉంది. అలాగే వాటిమీద తగిన శిక్షణ ఇప్పించటానికి ప్రభుత్వ, ప్రభుత్వేతర సంస్థలు, కళాకారులు ముందుకు రావలసిన అవసరం ఉంది. అలాంటి శిక్షణ కూడా పొంది, వృత్తి కళాకారులు, కులవృత్తి కళాకారులు ప్రదర్శనలు ఇస్తే ప్రజల్ని అవి తమ వైవిధ్యంతో ఉర్రూతలూగించగలవు అన్న విషయంలో సందేహానికి తావులేదు.

(తెలుగు నాటక సాహిత్యం)


ప్రొ. రావినూతల సత్యనారాయణ

*తెలుగు భాషలో 'కేంద్ర సాహిత్య అకాదెమీ పురస్కారం' పొందిన వారి రచనలను, సమీక్షించాలని మిసిమి సంకల్పించింది. అందుకు తగినట్లు ప్రొ. రావినూతల సత్యనారాయణ గారు స్పందించారు.*

*ఇదొక బృహత్ కార్యం. ఇందులో రచయితల రచనలే కాకుండా ఒక్కొక్కప్పుడు వారి జీవితంలోకి తొంగిచూడవలసిన అవసరం రావచ్చు. కేవలం రచనలు చదివితే సరిపోదు. రచయిత స్వభావంపట్ల కూడా అవగాహన ఉండకపోతే సమీక్ష తేలిపోతుంది. రచయితలు తాము రాసే రాతకు, జీవించే జీవితానికి పొంతనే ఉండదు. వీటిని సమన్వయపరుస్తూ వారి రచనలను విశ్లేషించగలగాలి. కవిత్వమైనా, కథయైనా, నవల అయినా, నాటకమైనా, విధానమేదైనా అన్నీ వ్యక్తిత్వ సూచికలే. రచయిత అనుభూతి పరిసరాల వీచికలే.*

*ప్రతి రచయితా తన మనసులో ఒక కార్యాచరణ ప్రణాళిక తయారు చేసుకుంటాడు. ఆనందం, ఆవేశం, ఆవేదన, ఆర్తి – ఇవన్నీ తన రచనలలో ప్రతిబింబింపచేస్తాడు. రచయితలకు భావావేశం ఎక్కువ. దానికి భిన్నమైన తర్కం కూడా ఉంటుంది. అవన్నీ పాఠకులలో గందరగోళాన్ని సృష్టిస్తాయి. రచయితను, పాఠకుడిని ఎదురెదురగా నిలబెట్టి కరచాలనం చేయించగలిగినవాడే నిజమైన సాహితీ సమీక్షకుడు. ఆయన తన సమీక్షలో ఆయా రచయితలకు సంబంధించిన ఏ పుస్తకాన్నీ వదలలేదు.*




*తెలుగు భాషలో వెలుగు చూసి, పురస్కారం పొందిన రచనలన్నింటినీ, రచయితలెందర్నో సమీక్షించి, పరిచయం చేసి తెలుగు పాఠకులకు గ్రంథ రూపంలో అందిస్తున్నారు. ఇది విజ్ఞులైన పాఠకులకూ, పరిశోధనాశీలురైన విశ్వవిద్యాలయ విద్యార్థులకూ కరదీపికగా ఉండగలదని ఆశిస్తున్నాం.*

(ప్రతులకు *మిసిమి* కార్యాలయాన్ని సంప్రదించండి.)




# కవి ప్రదీప్‌కు నూరేళ్లు

– హెచ్. రమేష్ బాబు

పదిహేనేళ్ల ఆ పిల్లవాడు ఏదో తప్పు చేశాడని టీచర్ వంగి చెవులు పట్టుకొమ్మని (ముర్గాబనో) ఆదేశించాడు. ఆ టీచర్ నిర్ణయాన్ని తీవ్రంగా వ్యతిరేకించిన ఆ పిల్లవాడు ''మనిషిని జంతువుగా మారమనడం ఏ సమాజపు సంస్కారం? చదువు మానవత్వాన్ని నేర్పించాలి.. ఇలాంటి స్కూల్‌లో నేను చదవన"ని బయటికి వచ్చేశాడు.

మరో యాభై ఏండ్ల తరువాత 26 జనవరి, 1963 ఢిల్లీలో ఇండో – చైనా యుద్ధవీరుల స్మృత్యంజలి ఘటించే కార్యక్రమం అది. అప్పటి భారతప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ సభా వేదికపై ఆశీనులై ఉన్నారు. ఆ సభలో తొలుత 'అల్లా తేరోనామ్' (జైదేవ్ సంగీతం), 'ఆప్‌కి నజరోంనె సమ్జా' (మదన్‌మోహన్ సంగీతం) రెండు పాటలను లతా మంగేష్కర్ పాడింది. ఆ తరువాత సంగీత దర్శకుడు సి.రామచంద్ర వేదిక మీదికి వచ్చారు. లతకి అప్పటికే సి.రామచంద్రతో మనస్పర్థలేర్పడి దశాబ్దానికి పైగా ఆయన సంగీతంలో పాడటం లేదు. అయినా ఇప్పుడు పాడబోయే పాటకు వారిద్దరైతేనే న్యాయం చేయగలరని పెద్దలు ఒప్పించారు. వేదికపై నుండే వెనుక ఉన్న వాద్య బృందానికి సి.రామచంద్ర సైగ చేయగానే స్వరనాదం మొదలైంది. ఆ వెంటనే లతా యావన్మంది మంత్ర ముగ్ధులై వింటుండగా పాటందుకుంది. "ఏ మేరే వతన్ కే లోగో జరా ఆంఖ్‌మె భర్‌లో పానీ – జో షహీద్ హుయే హై ఉన్‌కీ జరయాద్ కరో ఖుర్బానీ'' ఒక్కసారిగా పాట ఆ ప్రకృతినంతా ఆవరించింది. అంతేకాదు, వేదికపైనున్న పండిట్ నెహ్రూతో సహా అంతా సజలనయనాలతో బరువెక్కి పోయారు. అంతలా కన్నీరు పెట్టించిన ఆ పాట రాసిన కవీ, ఆనాడు బడిలో టీచర్‌ని ధిక్కరించిన పిల్లవాడూ ఇద్దరూ ఒకరే. అతనే దేశభక్త సినీ కవి ప్రదీప్. ఇది కవి ప్రదీప్ శతజయంతి సంవత్సరం.

గత ఫిబ్రవరిలో కవి ప్రదీప్ నూరవ పుట్టినరోజు సమస్త భారతావనిలో ఎవరికీ పట్టకుండానే నిశ్శబ్దంగా వెళ్లిపోయింది. బొంబాయి సినీ పరిశ్రమ, భారత ప్రభుత్వం ఈ సందర్భంగా ఆయనను కనీసం స్మరించనైనా లేదు.

మధ్యప్రదేశ్‌లోని ఉజ్జయినీ జిల్లా ఇండోర్‌కి దగ్గరున్న బడ్‌నగర్ పట్టణంలోని ఓ మధ్యతరగతి బ్రాహ్మణ కుటుంబంలో 1915 ఫిబ్రవరి 6న జన్మించారు. పండిత కుటుంబం కావడంతో స్కూలు రోజుల్లోనే కవిత్వం అబ్బటం ఆయనకంత గొప్ప విషయం కాదు. కానీ స్వాతంత్ర్యోద్యమం ఉధృతంగా జరుగుతున్న కాలంలో తన కర్తవ్యాన్ని నిర్ణయించుకొని దేశభక్తి కవిత్వం రాసి చిన్ననాటనే మెప్పొందారు. అలహాబాదు, లక్నోల్లో చదువుకుని బీఏ డిగ్రీ పొందారు. ఆ కాలంలో డిగ్రీ చదువుకున్నవారు కలెక్టర్ ఉద్యోగాలు చేసేవారు. కానీ కవి ప్రదీప్ కవి సమ్మేళనాలు, ముషాయిరాల్లో పాల్గొని కవితాగానం చేయనారంభించారు. ఒకానొక కవి సమ్మేళనంలో పరిచయమైన రాధేశ్యామ్ అనే పెద్ద మనిషి కవి ప్రదీప్ కవిత్వానికి అబ్బురపడి తన వెంట మథురకు తీసుకువెళ్లాడు. మథురలోని గుజరాతీ చిత్రకారుడు, కవి అయిన రవిశంకర్ రవాల్ ప్రదీప్ కవితా వైభవాన్ని పసిగట్టి తన వెంట అహమ్మదాబాద్ తీసుకెళ్లారు. అహమ్మదాబాద్ నుండి అనుకొని కారణాల వల్ల వారిద్దరూ బొంబాయి వలస వెళ్ళవలసి వచ్చింది. ప్రదీప్ జీవితాన్ని మలుపు తిప్పిన సందర్భం బొంబాయిలో జరిగింది.

బొంబాయిలో జరిగిన ఒక సమ్మేళనంలో ప్రదీప్ కవితాగానం విన్న బాంబే టాకీస్ సంస్థ ప్రముఖుల్లో ఒకరైన ఆచార్య తనవెంట తీసుకువెళ్లి తన సహచర భాగస్వాములైన దేవికారాణి, ఎస్.ముఖర్జీ, అప్పట్లో వాళ్లు తీస్తున్న 'కంగన్' సినిమా హీరో హీరోయిన్లు అశోక్‌కుమార్, లీలాచిట్నిస్, సంగీతం చేస్తున్న సరస్వతీదేవిలకు పరిచయం చేశారు. వారంతా ప్రదీప్ కవితాధారకు ప్రశంసల జల్లు కురిపించడమే గాదు, అప్పటికి కంగన్‌లో మిగిలిన నాలుగు పాటలు మీరే రాయాలని, అది మాత్రమే గాదు మా తరువాతి సినిమాల్లోనూ మీరే గీత రచయిత అని, నెలకు రెండు వందల రూపాయల జీతంతో కాంట్రాక్టు కుదుర్చుకున్నారు. 'కంగన్'లో రాసిన 4 పాటల్లో మూడింటిని ప్రదీప్ చేతనే పాడించారు. 1939లో కంగన్ విడుదలైనపుడు ప్రదీప్ పూర్తి పేరు "రామచంద్ర నారాయణ్ ద్వివేది ప్రదీప్"ను తెరపై టైటిల్స్‌లో అంతపొడుగాడిపేరు చదివే సమయం ఉండదని, హిమాంశ్ రాయ్ 'ప్రదీప్' అని వేయించారు. అదే ఆ తరువాత 'కవి ప్రదీప్'గా దేశవ్యాప్తమైంది. 'ఏ మేరె వతన్‌కె లోగో', 'సూనీ పడీ రే సితార్', 'మైతో ఆర్‌తీ దీ' పాటలు కంగన్ చిత్ర విజయానికి కారణాలైనవి.

'కంగన్' తరువాత ఎస్.ముఖర్జీ నిర్మించిన 'బంధన్' (1940) ప్రదీప్ సినీ జీవితాన్ని మలుపు తిప్పింది. 'బంధన్'లో అన్ని పాటలూ ప్రదీప్ చేతనే రాయించారు. స్వాతంత్ర్యోద్యమం తీవ్ర స్థాయిలో ఉన్న ఆ రోజుల్లో ప్రదీప్ 'బంధన్'లో రాసిన 'చల్ చల్‌రె నౌ జవాన్' పాట స్వాతంత్ర్య ఉద్యమానికి మార్చ్‌సాంగ్‌గా వెలిగిపోయింది. ఇదే చిత్రంలోని 'చనా జోర్ గరమ్ బాబు', 'పియో పియో బోల్ ప్రాణ్ పపిహే, రుక్ న సకోతో జావో వంటి పాటలు అన్నీ హిట్ సాంగ్సే ఆ రోజుల్లో. 'చల్ చల్ రే..'' పాట పాఠశాలలో, ఊరేగింపుల్లో ప్రభాతభేరీల్లో పాడేవారు. థియేటర్లలోనైతే ఈ పాటను మరోసారి చూపండని ప్రేక్షకులు యజమానులను కోరేవారు. బహుషా సినిమాల్లో వన్స్‌మోర్ ఈ పాటతోనే మొదలైంది. ఈ పాటను జాతీయ గీతంగా ప్రకటించాలని నాటి యూత్ లీగ్ ఒక తీర్మానాన్ని ఆమోదించిందంటే ప్రదీప్ కవితాశక్తి ఎంతటిదో అంచనా వేయొచ్చు. కవి ప్రదీప్ బాంబే టాకీస్ వారికి ఆ తరువాత నాలుగు సినిమాలకు పని చేశారు. నయా సంసార్, అంజాన్, ఝూలా (1941) కిస్మత్ (1943), ఆ నాలుగు సినిమాలు. బాంబే టాకీస్ సంస్థకి హిందీ చిత్ర రంగంలో విలక్షణ స్థానం వుండేది అప్పట్లో. దేవికారాణి, లీలా చిట్నిస్, అశోక్‌కుమార్ వంటి అగ్రతారలు, సరస్వతీదేవి వంటి సంగీత దర్శకులు జ్ఞాన్ ముఖర్జీ వంటి దర్శకులతో ఒక టీమ్ వర్క్ జరిగేది. అందులో కవి ప్రదీప్ చేరడంతో ఆ సంస్థ పేరు ప్రఖ్యాతులు దశదిశలా వ్యాపించినవి. 'కిస్మత్'తో క్విట్ ఇండియా ఉద్యమ ప్రేరణతో ప్రదీప్ రాసిన "దూర్ హటో ఎ దునియా వాలో హిందుస్తాన్ హమారా హై" పాట దేశవ్యాప్తంగా మారుమోగింది. స్వాతంత్ర్య ఉద్యమానికి ఊతమిచ్చింది. "ధీరే ధీరే ఆరే బాదల్", "పపిహరే మెరె పియా సే", "ఘర్ ఘర్ మే దీవాలీ హై మేరె ఘర్ మే అంధేరా", "అబ్ తెరె సివాకౌన్ మెరా" వంటి హిట్ సాంగ్స్ కూడా కిస్మత్‌లో ప్రదీప్ కవి రాసినవే. 'కిస్మత్' సినిమా కలకత్తాలోని ఒకే థియేటర్‌లో మూడున్నరేళ్లుప్రదర్శనకు నోచుకుని రికార్డు సృష్టించింది.

ఇంతలో ఎస్.ముఖర్జీ బాంబే టాకీస్ సంస్థతో విభేదాలేర్పడి బయటికి వచ్చి ఫిల్మిస్తాన్ సంస్థను ఏర్పాటు చేసుకున్నారు. ఆయన వెంటనే బయటికి వచ్చిన ప్రదీప్ అయిదేళ్ల కాంట్రాక్టుతో ఫిల్మిస్తాన్ సినిమాలకు పాటలు రాశారు. ఫిల్మిస్తాన్ వారి తొలి సినిమా పేరు బంధన్‌లో ప్రదీప్ రాసిన పాట పల్లవిలోని తొలి అక్షరాలైన "చల్ చల్‌రే నౌ జవాన్". ఈ సినిమాలో హిందూ ముస్లింల సఖ్యతను చాటుతూ ప్రదీప్ రాసిన 'మంజిల్ సభీకి ఏక్ హై రహనా అలగ్ అలగ్, ఓ ఏక్ హై పర్ అప్‌నీ నిగాహే అలగ్, అలగ్, మందిర్ మే హై భగవాన్, వో మజ్జిద్ మే ఖుదా హై, కిస్నే కహా హిందూ సే ముసల్మాన్ జుదా హై, బోలో హర్ హర్ మహదేవ్ అల్లా హెూ అక్బర్" పాట జాతీయ సమైక్యతను చాటుతూ దేశమంతా మారుమోగింది. ఇంతలో చున్నిలాల్ దేశాయ్ (ఫిల్మిస్తాన్ మేనేజర్)తో ఏర్పడిన అభిప్రాయ భేదాల వల్ల ఫిల్మిస్తాన్‌లో నుండి బయటికి వచ్చేశారాయన.

ఇంతలో ఆయనకు 1942లో భద్రాభట్‌తో వివాహమైంది. అయితే మిగిలిన రెండున్నర ఏళ్లలో కాంట్రాక్టు ప్రకారం వేరెవరికీ పాటలు రాయకూడదని కవి ప్రదీప్ నిర్ణయించుకున్నారు. అయితే ఇంతలో లక్ష్మి ప్రొడక్షన్స్ అధినేత, హిందీ సినిమాల్లో ఫ్రీలాన్సింగ్ విధానానికి

పితామహునిగా చెప్పబడే చిమన్‌లాల్ త్రివేది తాను తీయబోయే నాలుగు సినిమాలకు మిస్ కమల్ బి.ఏ. పేరుతో పాటలు రాయించారు. ఆ సినిమాలు వరుసగా కాదంబరి (1944), ఆమ్రపాలి (1945), వీరాంగన, సతీతోరల్ (1947). ఈ చిత్రాల్లో శాంతాఆప్టే, సవితాదేవి, ప్రేమ్ అదీబ్, శోభనా సామర్థే వంటి నాటి స్టార్స్ నటించారు. అయితే యీయన పెట్టుకున్న కమల్ బి.ఏ. కలం పేరు చిత్రమైన వివాదాన్ని తెచ్చిపెట్టింది. న్యూథియేటర్స్‌కు చెందిన హీరోయిన్ లీలాదేశాయ్ చెల్లెలు కమల్ ఏదో కంపెనీలో సెక్రటరీగా పని చేస్తుండేది. ఈ సినిమాలోని పాటలు ఆమె పేరుతో ఉండడంతో అవివాహిత కూడా అయిన ఆమెకు పెళ్లి ప్రస్తావనతో కూడిన ఉత్తరాలు ఫ్యాన్స్ నుండి రావడం మొదలైంది. చివరికి ఆమె తాను ఆ సినిమాల్లో పాటలు రాయలేదని, వేరెవరో రాశారని తనకు సినిమాలకు సంబంధం లేదని ఒక పత్రికా ప్రకటన చేయవలసి వచ్చింది.

ఎస్.ముఖర్జీ బయటికి వచ్చాక బాంబే టాకీస్ సంస్థ మూతపడే పరిస్థితి వచ్చింది. అప్పుడు తనకు సినీ జీవితాన్ని ప్రసాదించిన సంస్థకు పునరుజ్జీవం పోయాలని హీరో అశోక్‌కుమార్ ముందుకు వచ్చి నితిన్‌బోస్ దర్శకత్వంలో 'మషాల్'(1950) సినిమా నిర్మాణానికి పూనుకున్నారు. సంగీతం చేసింది ఎస్.డి.బర్మన్. పాటలు రాయడానికి ప్రదీప్‌ని వెనక్కి రమ్మని అశోక్‌కుమార్ ఆహ్వానించారు. ప్రదీప్ రాసిన "ఊపర్‌గగన్ విషాల్" పాట మన్నాడే నోట చిత్ర జగత్తును, అభిమానులను వోలలాడించింది. అప్పుడే మళ్లీ ఫిల్మిస్తాన్ నుండి ఎస్.ముఖర్జీకి పిలుపురావడంతో వెళ్లి 'నాస్తిక్' (1954)లో, జాగృతి (1954)లో పాటలు రాశారు. ఈ రెండు చిత్రాలకు ముందు ఫిల్మిస్తాన్ 'అనార్కలి'(1953), 'నాగిన్' చిత్రాలు విజయవంతమే అయినా ప్రదీప్ పాటలతో వచ్చిన 'నాస్తిక్', 'జాగృతి' సంచలన విజయాలు నమోదు చేసుకున్నవి. 'దేఖ్ తెరే సంసార్‌కి హాలత్ క్యా హెూగయి భగ్‌వాన్, కిత్‌నా బదల్‌గయా ఇన్సాన్ (నాస్తిక్)' ఆవో బచ్చే తుమే దిఖాయే ఝూంకి హిందుస్తాన్‌కి, 'హమ్ లాయే హై తుఫాన్ సె కష్టి నికాల్‌కె', 'ఇన్‌సాన్‌కి డగర్‌పె', 'దేదీ హమే ఆజాది బినా ఖడగ్ బినాడాల్ సాబర్మతీకె సంత్ తునే కర్‌దియా కమాల్(జాగృతి) పాటలు దేశమంతా మారుమోగినవి. ఆయన పాటల కోసమే నాటి తరం ప్రేక్షకులు మళ్లీ మళ్లీ ఆయా సినిమాలను చూసేవారు. సరళమైన పదాలతో ఉదాత్తమైన అర్థాలు కనిపించే పాటలు రాయడం ప్రదీప్ కవిత్వంలోని ప్రత్యేకత.

ఈ 1950 దశకం చివరలో 'తలాక్' (1958), జెమినీ వారి 'పైగామ్' (1958) చిత్రాలు సి.రామచంద్రతో కలిసి పని చేయగా, హిట్‌సాంగ్స్ వచ్చాయి. 'బిగుల్ బజ్‌రహా ఆజాదీకా', 'మేరే జీవన్ మే కిరణ్ బన్‌కె' (తలాక్), 'ఇన్‌సాన్‌కా ఇన్‌సాన్‌సె హెూ భాయి చారా ఏహీపైగామ్ హమారా", "ఓ అమీరోంకి పరమేశ్వర్, 'జవానీ మే అకేలా పన్ (పైగామ్) పాటలు ప్రదీప్‌ని హిందీ సినీ సంగీత ప్రపంచంలో ఉన్నత శిఖరాలకు చేర్చింది. ఈ చిత్రాల కన్నా ముందు గరల్స్ స్కూల్ (1949), వామన్ అవతార్ (1955), చక్రధారి (1954), దశహరా, రామ్ నవమి (1956), నాగ్‌మణి, చండీపూజ (1957), స్కూల్‌మాస్టర్ (1959) చిత్రాల్లో కూడా కవి ప్రదీప్ పాటలు రాశారు.

1960లు వచ్చే నరికి అంతకుముందు దశాబ్దారంభంలో వచ్చిన సంగీత దర్శకులు బాగా స్థిరపడి వారి మోనోపలి ఒకటి మొదలైంది. దాంతో హిందీ సినీ సంగీతంలోకి పాశ్చాత్య పోకడలు చొచ్చుకువచ్చినవి. ఆ దశలో కవి ప్రదీప్ పాటలు వారికి అంటరానివైనవి. అయినా ఆయన తనదైన శైలిని వీడకుండానే పాటలు రాసి తనలోని కవితాశక్తిని నిరూపించుకున్నారు. అలా వచ్చినవే 'పైగామ్', 'తలాక్' చిత్రాల్లోని హిట్‌సాంగ్స్. ఆయన అడిగిన వారికి పాటలు రాశారు గాని ఏ దర్శక నిర్మాతనో, సంగీత దర్శకుడినో తనపాట తీసుకొమ్మని అడగలేదు. అదీ ప్రదీప్ వ్యక్తిత్వంలోని గొప్పతనం. 1961లో అప్పటి రాష్ట్రపతి బాబూ రాజేంద్రప్రసాద్ చేతుల మీదుగా సంగీత నాటక అకాడమి అవార్డుల్లో 'జాతీయకవి' పురస్కారం అందుకున్న సందర్భంలో ఆయన అన్నమాటలు "నేను ఏనాడూ అవార్డులను ఆశించలేదు. నా రచనలు భారతీయుల హృదయాలను స్పృశించి, వారిలో చైతన్యానికి కారణమైతే నా లక్ష్యం నెరవేరినట్లే. అదే గొప్ప అవార్డు".

ఈ నేపథ్యంలో కవి ప్రదీప్ 'సవరియారే అప్నీ మేరా కో భూల్ న జనా' (ఆంచల్), 'ఆజ్‌కె ఇస్ ఇన్సాన్ కో ఏ క్యాహెూగయా' (అమర్ రహే ఏ ప్యార్), 'టూట్ గయీ హై మాలా' (హరిశ్చంద్ర తారామతి), జన్మభూమి మా

(నేతాజి సుభాష్ చంద్రబోస్), సుఖ్‌దుఖ్ దోనో రహతే (కభీధూప్ కభీ ఛావ్), భారత్ కే లియే భగవాన్ కా ఏక్ వరదాన్ హై గంగా (హరహర గంగే), ఇంకా 'హరిదర్శన్' (1972), 'అగ్నిరేఖ' (1973) వంటి చిత్రాలకు పాటలు రాశారు.

అయితే హిందీ చిత్రరంగంలో టాకీల తొలి దశకం నుండి పాటలు రాస్తూ అన్ని తరాల టెక్నిషియన్లతో పని చేసిన ప్రదీప్ శంకర్ జై, లక్ష్మీప్యారే, కళ్యాణ్ - ఆనంద్ వంటి ఉధృతిలో గ్యాప్ వచ్చినా తనదైన ఉనికిని నిలబెట్టుకున్నారు. 1969లో తీసిన 'సంబంధ్'లో రాసి పాటలతో మళ్లీ ఒక్కసారిగా తిరుగులేని సినీ కవిగా పైకి లేచారు. "చల్ అకేలా చల్ అకేలా తేరా మేలా పీఛే ఛూటారాహీ చల్ అకేలా', 'తుమ్ కోతో కరోడోంసాల్ హువే", "జో దియా థా తుమ్‌నే ఎక్ దిన్', 'అంధేరేమే జో బాతే హెూ" పాటలు గొప్ప హిట్ సాంగ్స్. ఆ తరువాత 1975లో తనపాటల్లోని కవితా శక్తి ఎంతటిదో మరోసారి నిరూపించుకున్నారాయన.



నెహ్రూతో ప్రదీప్

1975లో బ్లాక్ బస్టర్ సినిమా "షోలే" భారతదేశాన్ని ఒక వూపు వూపుతున్న రోజుల్లో లో బడ్జెట్‌లో తయారైన 'జై సంతోషిమా' చిత్రంలో ప్రదీప్ పాటలు కనకవర్షం కురిపించినవి. 'షోలే'తో సమానంగా వసూలు చేయడం ప్రదీప్ పాటల వల్లనేనని నాటి సినీ పండితులు గొప్పగా రాశారు. థియేటర్ల వద్ద ఏర్పాటు చేసిన సంతోషిమా విగ్రహాల ముందు మహిళా ప్రేక్షకులు "మైతో ఆర్తీ ఉతారూంరే సంతోషిమాకి' ప్రదీప్ గీతం భక్తి పారవశ్యాలతో పాడి హారతులివ్వడం మొదలుపెట్టారు. ఇదే చిత్రంలో కవిప్రదీప్ స్వయంగా "వాహేవహ్ జహేతహ్ ' పాటకు బెంగాల్ ఫిలిం క్రిటిక్స్ అసోసియేషన్ వారి ఉత్తమ గాయకుని అవార్డు వచ్చింది. 'మత్‌రో మత్ రో ఆజ్', 'కర్‌తీ హూ తుమ్హా రా వ్రత్‌మై', 'మదద్ కరో సంతోషీమాత' పాటలు ఇందులోనివే. ఆయన చివరగా పాటలు రాసిన చిత్రాలు బజ్‌రంగ్ బలి (1976), ఆంఖోంకా తార (1977), శ్రావణ్‌కుమార్ (1984).

అరశతాబ్దానికిపైగా తన సినీ కెరీర్‌లో కవిప్రదీప్ పాటలు రాసిన చిత్రాలు 60కి మించవు. రాసిన పాటలు కూడా 1000కి మించవు. అయితే రాసిన ప్రతిపాట ఉన్నత జీవన విలువలను, ప్రబోధాన్ని, ఆదర్శాలను చాటి సాహిత్య గౌరవాన్ని పొందినవి. సరస్వతీదేవితో మొదలుకుని అనిల్‌బిశ్వాస్, గులాంహైదర్, సి.రామచంద్ర, ఎస్.డి.బర్మన్, హుస్నలాల్- భగత్‌రాయ్, రోషన్, మన్నాడే, హేమంతకుమార్, ఎన్.దత్తా, చిత్తగుప్త, వసంత్ దేశాయ్, దత్తారాం, సలీల్‌దా, ఎస్.ఎన్.త్రిపాఠి. ఒపి నయ్యర్, రవీంద్ర జైన్, భూపేన్‌దా, ఆర్డీబర్మన్, ఉషాఖన్నా, సోనిక్ ఓమిలతో సహా 70ల్లో వచ్చిన బప్పీలహరి సంగీత చిత్రాలకు పాటలు రాశారు కవి ప్రదీప్. ఆయన గేయ రచయితనే గాక స్వయంగా కొన్ని పాటలు కూడా పాడారు. వామన్ అవతార్ (1955), హర్ హర్ గంగే (1968), బాప్‌బేటి (1954), నాగిన్ ఔర్ సుహగన్ (1979), అగ్ని పరీక్ష (1981), హరిశ్చంద్ర తారామతి, దశహరా, ఛాట్‌మాయాకి మైయ్యా, అన్‌మోల్‌సితారె (1982), జై సంతోషిమా (1975) వంటివి ఆయన పాటలు పాడిన చిత్రాల్లో కొన్ని 40 ఏండ్ల క్రితమే హెచ్.ఎం.వి. వారు ప్రదీప్ రాసి పాడిన 13 పాటల ఆల్బం ఒక దానిని విడుదల చేశారు.

కవి ప్రదీప్ జీవితమెల్లా ఉన్నత ఆదర్శాలు, విలువలకు కట్టుబడి జీవించిన సాహిత్యకారుడు. తనకు దాదా ఫాల్కేఅవార్డు ప్రకటించారని తెలియగానే "అదేమిటి ప్రభుత్వాలు ఇటువంటి తప్పుడు పనులు కూడా చేస్తుంటాయా? నాకు ఫాల్కే ప్రకటించడం ఏమిటి? నేనేమీ తప్పుడు వార్తను వినలేదు కదా?" అని ఆశ్చర్యాన్ని ప్రకటించారు. ఆయనకన్నా చాలా మంది జూనియర్లకు 'ఫాల్కే' అవార్డు ఇచ్చాక గాని చివరలో ప్రకటించిన నేపథ్యంలో ఆయన వ్యాఖ్యలను మనం ఆ కోణంలో అర్థం చేసుకోవాలి.

పుంఖాను పుంఖాలుగా పాటలు రాయకపోయినా, తన పాటలు కావాలని దర్శక నిర్మాతలు రాకపోయినా

ఆయన ఏనాడు తనను తాను తక్కువ చేసుకోలేదు. ఇద్దరు ఆడపిల్లల సంతానంతో సంతృప్తిగా జీవించారు. బొంబైలోని విలెపార్లి ఎస్.వి.రోడ్‌లో 1950లోనే 700 గజాల స్థలంలో ఆ కాలంలోనే రూ.75,000/- ఖర్చుతో ఇల్లు కట్టుకున్నారు. 'నా జీవితంలో సంతోషంగా ఇల్లు కట్టుకోవడమే నా అత్యుత్తమ గేయంగా భావిస్తా'ననే వారు సన్నిహితులతో. అంత నిరాడంబరుడు గనుకనే తన పాటల ద్వారా వచ్చిన రాయల్టీని యుద్ధంలో ప్రాణాలు వీడిన అమరుల కుటుంబాలకు చెందాలని నిర్ణయం తీసుకున్నారు. ఈ కాలంలో ఈ మాటలు వినే వారికి నమ్మశక్యం కాకపోవచ్చు గానీ ఇది నిజం. ఇప్పటికీ హెచ్.ఎం.వి. సంస్థ అదే నిధికి ప్రదీప్ పాటల రాయల్టీని జమచేయడం గమనార్హం. ఆ మహాకవి 1998 డిసెంబర్ 11న బొంబాయిలో అంతిమశ్వాస విడిచి తన కవితా రచనకు ముగింపు పలికారు.

2013లో ఏ మేరె వతన్ పాటకు 50 ఏండ్లయిన సందర్భంగా ఒక ప్రత్యేక సంచిక 'స్వర్ణిక' పేరున వెలువడగా, 2011 డిసెంబర్ 11న ఆయన వర్ధంతి సందర్భంగా భారత తపాలశాఖ అయిదు రూపాయల స్టాంపును వెలువరించి స్మరించుకున్నది. ఏకాలంలోనైనా ప్రపంచంలోకి కొందరు మహనీయులు ఒక కర్తవ్య నిర్వహణ కోసం పుడతారు. సమాజ పరివర్తనలో, పరిణామక్రమంలో తమ బాధ్యతను నిర్వర్తించి, తమదైన ముద్రవేసి కర్తవ్య నిర్వహణ ముగిసాక నిశ్శబ్దంగా నిష్క్రమిస్తారు. అలాంటి వారి కోవలో నిలిచేవారు కవిప్రదీప్. భారతీయ చిత్రసీమలో హిందీ సినీ గీత హిమశిఖరంగా కవి ప్రదీప్ అచిరకాలం నిలిచే ఉంటారు.

**పండిట్ నెహ్రూ ప్రశంసలు - పురస్కారాలు :**

కవి ప్రదీప్ స్వాతంత్ర్యోద్యమ కాలంలో స్వతంత్ర భారతంలో ఆయా సందర్భాల్లో తన కర్తవ్యాన్ని బాధ్యతగా నిర్వర్తించాడు. గతంలో క్విట్ ఇండియా ప్రేరణతో "దూర్‌హటో దునియావాలో హిందుస్తాన్ హమారాహై' అని నినదించినట్లే, 1962 ఇండో చైనా యుద్ధంలో పోరాడి అసువులు వీడిన వీర జవాన్‌ల కోసం రాసిన 'ఏ మేరె వతన్‌కె లోగో' పాటతో గొప్ప నివాళి ఘటించారు. 1963లో నెహ్రూ సమక్షంలో లతా ఆ పాట పాడగా నెహ్రూ కంటతడి పెట్టి ఆ పాట రాసిన కవి ఎవరు అని వాకబు చేశారు. పక్కనే ఉన్న ప్రదీప్‌ను అభినందించారు. ఆ తరువాత రెండు వారాలకు బొంబాయి పర్యటనకు వచ్చిన నెహ్రూ కవి ప్రదీప్‌ను మరోసారి కలుసుకోవాలనుందనప్పుడు వై.బి. చవాన్ వారికి ఒక మీటింగ్ ఏర్పాటు చేశారు. 'చల్‌చల్‌రే నౌ జవాన్', 'దూర్ హటావో' పాటలు స్వాతంత్ర్య ఉద్యమ సందర్భంలో తానే రాశానని చెప్పగా 'ఆ రోజుల్లో తాను విని ప్రేరణ పొందానని ప్రశంసించారు నెహ్రూ. అలా నెహ్రూ మెప్పొందిన ప్రదీప్ భారతదేశంలో అత్యున్నత పురస్కారాలు, సన్మానాలు పొందారు.

సంగీత నాటక అకాడమి (1961)తో బాటు, 1969లో సినీ రచయిత పురస్కారం, మహాన్ కళాకార్ పురస్కార్ (1971), కేంద్ర ప్రభుత్వ సాంస్కృతిక శాఖ - సమాచార శాఖలు సంయుక్తంగా ఇచ్చిన "జాతీయ కవి" పురస్కారం (1995), హిందీ సాహిత్య సేవకు మధ్యప్రదేశ్ ప్రభుత్వ సత్కారాం (1995), రాజీవ్‌గాంధీ పురస్కారం (1995), పి.వి.నరసింహారావుచే సత్కారం (1995), సుర్‌సింగార్ పురస్కార్ (1996), రాష్ట్రీయ ఏకతాపురస్కార్ (1996), ఏ మేరే వతన్ పాట పాడించినందుకు లతా స్వయంగా లక్ష రూపాయలు బహూకరించి చేసిన సత్కారం (1997), రాష్ట్రీయ ఏకతా పురస్కార్ (1997-రెండోసారి), సంత్ జ్ఞానేశ్వర్ పురస్కార్ (1997), హిందీ సాహిత్య పరివార్ పురస్కార్ (1997), బొంబాయి రాష్ట్ర హిందీ సాహిత్య అకాడమి వారి ఛత్రపతి శివాజీ పురస్కార్ (1997), కేంద్ర ప్రభుత్వ ప్రతిష్టాత్మక దాదాసాహెబ్ ఫాల్కే అవార్డు (1997), సహయోగ్ ఫౌండేషన్ పురస్కార్ (1998), స్వతంత్ర సేనాని పురస్కార్ (1998) ఆయనను వరించి తమ గౌరవాన్ని పెంచుకున్నవి.

మి



హెచ్. రమేష్ బాబు
నాగర్‌కర్నూల్, మహబూబ్ నగర్ జిల్లా,
ఫోన్ : 94409 25814

# రాగరంజితం – రాగాల పల్లకి

– ఇంద్రగంటి జానకీబాల

**తె**లుగు సినిమా పాటకి సుదీర్ఘమైన, సుసంపన్నమైన చరిత్ర వుంది. సాహిత్యపరంగా, సంగీతపరంగా, వాద్యసముదాయాన్ని ప్రయోగించిన తీరు పరంగా, గాయనీగాయకుల ప్రతిభాపాటవాల పరంగా అద్భుతంగా, ఎన్నో ఘట్టాలను తనలో ఇముడ్చుకున్న తెలుగు సినిమా పాట చరిత్ర, ఎన్నిసార్లు తల్చుకున్నా ఆనందంగానూ, ఆహ్లాదంగానూ వుంటుంది.

భారతీయ చలనచిత్ర పరిశ్రమ మూకీల నుండి టాకీలోకి అడుగుపెట్టిన సంవత్సరం 1931. అదే సంవత్సరం తెలుగు సినిమా పెద్దలు కూడా మొట్టమొదటగా మాట్లాడే తెలుగు సినిమా ప్రేక్షకుల ముందుంచాలని ప్రయత్నించి సఫలీకృతులయ్యారు. దాని ఫలితమే 'భక్తప్రహ్లాద'. భారతీయ సినిమాకి మొదటి టాకీ *ఆలం అరా* అయితే తెలుగువారు నిర్మించిన *భక్తప్రహ్లాద* మన మొదటి సినిమా 1931.

అప్పట్లో సినిమా అంటే రంగస్థల నాటకమే. నాటకమంటే మూడొంతులు పౌరాణికమే. పౌరాణిక నాటకమంటే పాటలు, పద్యాలే – భారతీయ చలనచిత్రానికి సంగీతంతో అల్లుకుపోయి భాసిల్లే స్వభావం సహజంగా ఏర్పడిపోయి వుంది. మన ప్రేక్షకులు సినిమాను సంగీతం, అంటే పాటలు, పద్యాలు లేకుండా ఊహించలేరు. ఆనందించలేరు. చూడలేరు. అందుచేత మన తెలుగు సినిమాకి కూడా పాట అనేది ఆరోప్రాణం.



ఘంటసాల వెంకటేశ్వరరావు

మొదట్లో నాటక రచయితలే సినిమాలకి పనిచేసి వాటిని తెరకెక్కించే ప్రయత్నంలో పాలుపంచుకున్నారు. అప్పటి ప్రసిద్ధ నాటక రచయితలు బలిజేపల్లి లక్ష్మీకాంత కవి (హరిశ్చంద్ర), చందాల కేశవదాసు (కనకతార), కొప్పరపు సుబ్బారావు (తారాశశాంకం), పానుగంటి లక్ష్మీనర్సింహరావు (పాదుకా పట్టాభిషేకం – విప్రనారాయణ), ధర్మవరపు కృష్ణమాచార్యులు (చిత్రనళీయం), చిలకమర్తి లక్ష్మీనరసింహం (గయోపాఖ్యానం), ముత్తరాజు సుబ్బారావు (శ్రీకృష్ణతులాభారం), తాపీ ధర్మారావు (విలాసార్జు), శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి (బొబ్బిలి యుద్ధం), కణ్వశ్రీ (బాలనాగమ్మ) మొదలైన నాటకాలు తెలుగు ప్రేక్షకుల్ని ఉర్రూతలూగిస్తున్న కాలమది.

ఈ నాటక రచయితలో కొందరు మాత్రమే సినిమా రంగ ప్రవేశం చేసి, కొంత కృషి చేశారు. ఆయా నాటకానికి అనువైన కొన్ని పాటలు చేర్చటం, కూర్చటం సినిమాకి కావలసిన అనేక హంగుల్ని సమకూర్చి పెట్టటం చేసేవారు. ఆ నాటకాల్లో పాటలు బాగా ఆదరణ పొంది ఇప్పటి సినిమా పాటల్లాగే ప్రజల నాలుకలమీద తారట్లాడేవి.

దైతాగోపాలం రచించగా శ్రీకృష్ణతులాభారంలోవున్న 'భలే మంచి చౌక బేరము' – స్థానం నరసింహరావు సత్యభామగా వేషం వేయడమే కాకుండా 'మీర జాలగలడా! నాయానతి' రచించి శాశ్వతంగా సినిమా పాటల చరిత్రలలో నిలిచిపోయారు.

పౌరాణిక నాటకమంటే పద్యాలతో, పాటలతో నిండివుండాలి. ఆ పద్యాలలో సంభాషణలు, సంవాదాలు, సాధింపులు ఎత్తిపొడుపులు – ఎకసెక్కాలు అన్నీ వుండాలి. అదే అంతం ఆ సంప్రదాయ పరిమళం కొనసాగింపువల్లనే, ఈనాటికీ తెలుగు సినిమా పాటలతో

విరాజిల్లుతోంది. భక్తప్రహ్లాద, పాదుకాపట్టాభిషేకం, శకుంతల, చింతామణి రామదాసు, సావిత్రి, అనసూయ, శ్రీకృష్ణలీలలు, సక్కుబాయి, హరిశ్చంద్ర ఇలా ఎన్నో రంగస్థల నాటకాలు సినిమాలుగా రూపాంతరం చెందాయి. కొన్ని రెండు, మూడు సార్లు కూడా సినిమాలు తీసిన సందర్భాలున్నాయి. పదేళ్ళు, పదిహేనేళ్ళు గడిస్తే మళ్ళీ అదే పౌరాణిక గాథను చిన్నచిన్న మార్పులు, మెరుగులుచేసి, సినిమాగా తీసిన సందర్భాలున్నాయి.

సావిత్రి, లవకుశ, హరిశ్చంద్ర, అనసూయ, సక్కుబాయి శ్రీకృష్ణతులాభారం, మాయాబజార్, సంపూర్ణ రామాయణం విప్రనారాయణ, సారంగధర, శ్రీ వేంకటేశ్వర మహాత్మ్యం లాంటివి రెండు, మూడుసార్లు నిర్మించి ఘనవిజయాలు సాధించిన చరిత్ర వుంది. ఈ మధ్య (2012 మరియు 2013 లలో) లవకుశ కథాంశంతో శ్రీరామరాజ్యంగా రూపొందింపబడి పెద్దల మన్ననలు పొందింది. అయితే మొట్టమొదట నాటకం పాటలే సినిమాల్లోనూ పెట్టి రూపొందించారు. రానురాను కాలంతోబాటుగా ప్రేక్షకుల అభిరుచులు కూరడంతో కొత్తరకం సంగీతం అందులో కూర్చటం మొదలుపెట్టారు.


భానుమతి

ముప్ఫైల చివరికి సినీ నిర్మాతలకి సాంఘిక చిత్రాలు కూడా రూపొందించాలనే భావం బలపడటం మొదలైంది. 1939లో కాళ్ళకూరి నారాయణరావుగారి 'వరవిక్రయం' నాటకం వరవిక్రయం పేరుమీదనే సినిమా వచ్చింది. ఇందులో మొదటగా పి. భానుమతి వెండితెరకి నటగాయనిగా పరిచయమైంది. అయితే అందులోనూ చెప్పుకోదగ్గ పాటలు కనిపించవు. మొట్టమొదటిసారిగా భానుమతి త్యాగరాజ కీర్తన పాడారు.

1940లకి కాస్త అటూయిటూగా జానపద చిత్రాలవైపు దృష్టి మళ్ళింది. సాంఘిక చిత్రాలు కూడా రూపొందించాలనే అభిలాష కూడా తక్కువేం లేదు. అయితే జానపద చిత్రానికి, సాంఘిక చిత్రానికీ కథ, మాటలు, పాటలు, సినిమా అనుకరణ మొదలైన ఎన్నో హంగులు సమకూర్చుకోవలసిన అవసరం వుండేది. అది చాలా పెద్ద పని. ఒకపక్క జానపదాలు సాంఘికాలు తీసే పని చేస్తూనే పౌరాణికాలు నిర్మిస్తూనే వున్నారు. కొత్త కథలు, కొత్త ప్రయోగాల ననుసరించి తెలుగు సినిమా పాట తన రూపురేఖల్ని దిద్దుకోవడం మొదలుపెట్టింది. అంతవరకు నాటకం పాటలే సినిమా పాటలుగా చెలామణీ అవుతూ వస్తూవున్నాయి.

మాలపిల్ల, రైతుబిడ్డ, మళ్ళీపెళ్ళి, తహసిల్దార్, గృహలక్ష్మి, స్వర్గసీమ, వందేమాతరం, గృహప్రవేశం లాంటి కొన్ని సాంఘిక సినిమాలు ప్రేక్షకుల్ని అలరిస్తూ వచ్చాయి. అయితే సాంఘిక సినిమాల్లోని పాటలు కూడా మరీ ఆకర్షణీయంగా వుండేవి కాదు. పాత మరాఠీ మట్ల పోకడలోనే సాగేవి. స్వర్గసీమలోని 'ఓహోహో పావురమా' అనే భానుమతి పాడిన పాట జనాల్ని ఎంతగానో ఆకర్షించింది.

అలాగే 'రాదే చెలీ! నమ్మరాదే చెలీ' కూడా కొత్త ఆలోచనలకి ఉత్సాహాన్నిచ్చింది.

నాటకాలకి సంగీతం కూర్చిన కొందరు సంగీత దర్శకులు సహజంగానే సినీరంగ ప్రవేశం చేశారు. వారు కొత్త పోకడలతో వస్తున్న సినిమాలకి కొత్తరకమైన బాణీలను సినిమా పాటకోసం ఆలోచించటం మొదలుపెట్టారు. సంగీత దర్శకత్వంలో గాలిపెంచల నరసింహారావు, భీమవరపు నరసింహారావు, అద్దేపల్లి రామారావు, నాగయ్య, బాలాంత్రపు రజనీకాంతరావు, సి.ఆర్. సుబ్బరామన్, సాలూరి రాజేశ్వరరావు, ఘంటసాల వెంకటేశ్వరరావు, పెండ్యాల నాగేశ్వరరావు, సుసర్ల దక్షిణామూర్తి, ఓగిరాల రామచంద్రరావు, ఆదినారాయణరావు, టి.వి. రాజు, గోవర్ధనం & సుదర్శనం, సాలూరి హనుమంతరావు, అశ్వత్థామ, విశ్వనాథన్ & రామ్మూర్తి, ఎస్.పి. కోదండపాణి, కె.వి. మహదేవన్, సుబ్బయ్య నాయుడు, రమేష్ నాయుడు – ఎంతో కొత్తదనంతో గొప్పగొప్ప పాటలు కంపోజ్ చేసి పాడించారు.

అప్పుడప్పుడు సంగీతం కూర్చినా, ఆ తర్వాత వారసత్వం అందిపుచ్చుకున్న జాన్సన్ & కృష్ణమూర్తి – జి.కె. వెంకటేష్ – రాజన్ నాగేంద్ర – చక్రవర్తి ఇంకా ఎందరో తెలుగు సినిమా పాటకి ఎన్నో అందచందాలు

చేకూర్చిపెట్టారు. ఇక్కడ ముఖ్యంగా చెప్పుకోవలసిన విషయమేమంటే వీరంతా (పైన చెప్పిన సంగీత దర్శకులంతా) కర్ణాటక శాస్త్రీయ సంగీతంలో మంచి ప్రావీణ్యం వున్నవారు. హిందూస్థానీ సంగీతంపట్ల గొప్ప ఆకర్షణ, అవగాహన వున్నవారు. కృషి చేసినవారు. అటు బెంగాలీ, ఇటు తమిళ బాణీలతో సన్నిహిత సంబంధాలున్నవారు. మద్రాసు ఉమ్మడి రాష్ట్రంగా వున్న కాలమవటంవల్ల దక్షిణాది భాషలకు సంగీత పరమైన భేదాలుండేవికావు. ముఖ్యంగా తమిళ – తెలుగు సంగీత దర్శకులు కలగలిసిపోయి వుండేవారు. పాశ్చాత్య సంగీతాన్ని, వాద్యప్రయోగాల్ని తమ బాణీల్లోకి అందంగా ఇముడ్చుకోగల నేర్పూ, తెలివి గలవారు. అన్నింటినీ కలుపుతూ గొప్ప సృజనాత్మకత (Creativity) తేగల నేర్పు వున్నవారు.

అందువల్ల 1950 నుండి (ఒక సంవత్సరం అటూయిటుగా భావించాలి) తెలుగు సినిమా పాట సంగీతపరంగా ఉన్నత శిఖరాలను అధిరోహించిందని చెప్పుకోవాలి. అలాగే 1950 కి కొత్త ఊహలతో, ఎంతో కొత్త భావ ప్రకటనతో పాటలు వ్రాసే కవులు కూడా వచ్చి చేరారు. అంతవరకు నాటకాలకు పనిచేసిన కవులే సినిమా పాటకి రూపురేఖలు దిద్దారు. 50 లకి ముందే వచ్చి స్థిరపడిన సముద్రాల రాఘవాచార్య, పింగళి నాగేంద్రరావు, రావూరి సత్యనారాయణ వున్నప్పటికీ, వారి ప్రతిభ కూడా అనువైన సినిమాలు సందర్భపడినప్పుడు మాత్రమే ఉజ్జ్వలంగా వెలిగాయి. దేవులపల్లి కృష్ణశాస్త్రి, మల్లాది రామకృష్ణశాస్త్రి, శ్రీశ్రీ, ఆత్రేయ, ఆరుద్ర, సదాశివబ్రహ్మం, అనిసెట్టి, పినిసెట్టి, వీటూరి లాంటి కవుల వెల్లువ సినిమా పాటకి మరింత నూతనత్వాన్ని చేకూర్చిపెట్టింది. అప్పట్నించి తెలుగు సినిమా సంగీతం, సాహిత్యం చెట్టాపట్టాలేసుకుని సినిమా పాట విషయంలో అద్భుతాలే చేశాయి. ఒక పాట అందంగా వుండాలంటే అందులోని భావం, మాటలు – పదబంధాలు బాగుండాలి. అవి నూటిగా శ్రోత హృదయంలో జొరబడాలంటే సున్నితంగా, సులువుగా గ్రహించగలిగే బాణీ వుండాలి. ఆ బాణీతో పాటలోని మాటల అందాలు పోకుండా పాడగలిగే గాయనీ గాయకులుండాలి. గొంతును మింగేసే వాద్యాల హోరు లేకుండా సున్నితమైన వీణ మీటులాంటి ఆర్కెస్ట్రా వుండాలి. అది అందమైన పాటగా అందరి మనసులోనూ ఆనందం నింపుతుంది. వారి పెదాలపైన శాశ్వతంగా కదలాడుతూ, వారి గళాలలో మోగుతూ వుంటుంది. అలాంటి గొప్ప పాటలు మనకి తెలుగు సినిమా పాటల్లో వున్నాయి. ఆ పాటలను కంపోజ్ చేసిన సంగీత దర్శకులంతా జీనియస్సులు. పాశ్చాత్య సంగీతాన్ని తమ బాణీల్లోకి, అవసరమొస్తే, అందంగా ఇముడ్చుకోగల నేర్పూ, తెలివీగలవారు. అన్నింటినీ కలుపుతూ గొప్ప సృజనాత్మకత (Creativity) రూపొందించగల ప్రజ్ఞ గలవారు మన సంగీత దర్శకులు. అందువల్ల 1950 నుండి 1980ల వరకు (ఒకటి రెండు సంవత్సరాలు అటూ యిటూ వుండచ్చని భావించగలరు) తెలుగు సినిమా పాట సంగీతపరంగా సాహిత్యపరంగా ఉన్నత శిఖరాలను అధిరోహించిందన్న మాట అక్షరాలా నిజం.

మనకి శాస్త్రీయ సంగీతంలో ఎన్నో అందమైన రాగాలు వున్నాయి. విద్వాంసుని శక్తిమేరకు అవి విస్తరించగల వైశాల్యంగల రాగాలవి. రాగాల్నీ, రాగలక్షణాల్నీ వదిలిపెట్టకుండా, సినిమా సన్నివేశానికి చక్కగా అమరేట్లుగా ఆనాటి సంగీత దర్శకులు సినిమా పాటల్ని కూర్చారు.

ఏ రాగాన్నైనా, అన్యస్వర ప్రయోగంవల్ల ఒక కొత్త అందాన్ని తీసుకువచ్చే ప్రయత్నం సినిమా సంగీతానికి బాణీ కూర్చటంలో సహజం. అది అనుమతింపబడిన అంశమే. అయినప్పటికీ ఒకే రాగంలో మొత్తం పాటనంతటినీ నడిపించి అత్యంత అద్భుతంగా రక్తికట్టించిన సందర్భాలెన్నో – కొన్ని పాటలు, రాగాల పరిధిలోనే మలచబడి జనాల్ని ఉర్రూతలూగించిన సందర్భాలు మనకెన్నో వున్నాయి. వాటిలో కొన్నిటిని ప్రస్తావించుకోవటమే 'ఈ రాగరంజితం' ఉద్దేశం. ఇది చదివి, ఆయా పాటలు విని అందరూ ఆనందించగలరని ఆశిస్తున్నాను.



ఇంద్రగంటి జానకీబాల
సైనిక్‌పురి, సికింద్రాబాద్.
ఫోన్ : 9640052509



# 'బడా' వెంగళరెడ్డి

– కోడూరు పుల్లారెడ్డి

ఆంధ్రదేశంలో దానకర్ణులుగా ప్రఖ్యాతి గాంచిన వారు రాయలసీమలో బుడ్డా వెంగళరెడ్డి, యాదాళ్ళ నాగమ్మ, నెల్లూరు మండలంలో కోడూరి బాలకోటారెడ్డి, గోదావరి మండలంలో డొక్కా సీతమ్మ, గుంటూరు మండలంలో వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు సుప్రసిద్ధులు. 'వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు తులాభారం తూగితే, కరెడ్ల కామమ్మ వంకాయల భారం తూగిందట' అనే సామెత ఈనాటికీ ప్రచారంలో ఉంది.

నేటి కడప, కర్నూలు జిల్లాలో కుందు (కుముద్వతి) నదీపరీవాహక ప్రాంతాన్ని 'రేనాడు' అంటారు. కర్నూలు జిల్లా కోవెలకుంట్ల ప్రాంతంలో పేరువడసిన గ్రామం ఉయ్యాలవాడ. ఆ గ్రామంలో మద్దెల ఈశ్వరరెడ్డి పెద్ద భూస్వామి, భార్య వెంకటమ్మ. వారి కుమారుడు నల్లపరెడ్డి, అతని భార్య అక్కమ్మ. ఈ పుణ్యదంపతుల సంతు వరుసగా వెంగళరెడ్డి, తిమ్మమ్మ, ఈశ్వరరెడ్డి, సుబ్బమ్మ. వెంగళరెడ్డి భార్య నాగమ్మ. ఈమె నిస్సంతుగా గతించింది. అందువల్ల ఆ ఊరిలోని పోచావారి ఆడబిడ్డ వెంకటమ్మ, బోడెమ్మనూరులోని బాచిరెడ్డివారి ఆడబిడ్డ చెన్నమ్మలతో ఒకేరోజు ద్వితీయ వివాహం వెంగళరెడ్డికి జరిగింది. వెంగళరెడ్డి పెద్ద చెల్లెలు తిమ్మమ్మ కూడా నిస్సంతే. ఈశ్వరరెడ్డి భార్య అక్కమ్మ. వీరికి ముగ్గురు కుమారులు – రామిరెడ్డి, నల్లపరెడ్డి, తిమ్మారెడ్డి. వెంగళరెడ్డి కనిష్ఠ సోదరి సుబ్బమ్మ దుబ్బావారి కోడలు. నిస్సంతైన వెంగళరెడ్డి తన తమ్ముడు ఈశ్వరరెడ్డి మూడవ కుమారుడు తిమ్మారెడ్డిని దత్తత చేసుకున్నాడు. వెంగళరెడ్డి పెద్ద చెల్లెలు తిమ్మమ్మ కూడా నిస్సంతు కావడంవల్ల తన చెల్లెలు సుబ్బమ్మ మనుమడైన చినరామిరెడ్డిని దత్తుకు తీసుకుంది. సుబ్బమ్మ మరో కుమారుడు పెదలింగారెడ్డి (భార్య సాలమ్మ) మనుమడు (భార్య గోవిందమ్మ) రామిరెడ్డికి ప్రఖ్యాత ఇరిగేషన్ ఇంజనీరు వెంకట్రామరెడ్డి జన్మించాడు. అంటే ఈ వెంకటరామరెడ్డి ఇంజనీరు దుబ్బా సుబ్బమ్మకు మునిమనుమడు. మద్దెల వెంగళరెడ్డి క్రీ.శ. 1822లో జన్మించాడు. ఈయన అటు పొట్టి ఇటు పొడవు కాని ఎత్తు, గుండ్రని ముఖం, గౌరవర్ణంతో దృఢమైన శరీరం కలవాడు. ముఖంలో స్ఫోటకపు మచ్చలున్నా ఆకర్షణీయమైన విగ్రహం. ఈయన పుట్టుకతోనే దయాగుణం వునికి పుచ్చుకున్నవాడు. బాల్యంలోనే పేద పిల్లలకు తినుబండారాలు పంచిపెట్టేవాడు. వయస్సుతోపాటు ఈ దానగుణం 'మూడుపూవులు, ఆరుకాయలు'గా వర్ధిల్లి మహాదాతయై కీర్తి గడించిన తర్వాత 'గొప్పవాడు' అనే అర్థంలో 'బడా' వెంగళరెడ్డి అని పేరు పొందాడు. ఆ 'బడా' శబ్దమే 'బుడ్డా'గా మారిందని చెబుతారు. అలా 'మద్దెల' అనే ఇంటిపేరు గల వెంగళరెడ్డి బుడ్డా వెంగళరెడ్డిగా చెలామణీ అయ్యాడు. ఆయన చిన్నచెల్లెలు సుబ్బమ్మ 'దుబ్బా' వారి కోడలైనా తన ఇంటిపేరు 'బుడ్డా'గా మార్చుకోవటం కారణంగా మన ఇరిగేషన్ ఇంజనీరు దుబ్బా వెంకటరామిరెడ్డి కూడా బుడ్డా వెంకటరామిరెడ్డి అయ్యాడు.

వెంగళరెడ్డి గొప్పగా చదువుకున్నవాడు కాదు. కానీ చదువుల ప్రాధాన్యత నెరిగినవాడు. భారత, భాగవత, రామాయణాదులు చదివి బాగా అర్థం చేసుకున్నవాడు. బుడ్డా వెంగళరెడ్డి దానగుణాలను కొన్నింటిని తెలుసుకుందాం – వెంగళరెడ్డి పండితపోషణ చేయాలనే గాఢమైన కోరిక కలవాడు. పైగా తమ్ముడు ఈశ్వరరెడ్డికి సంస్కృతం నేర్పించాలనే తపనతో ఒక సంస్కృత పాఠశాలను స్థాపించి, దానిని అప్రతిహతంగా పది సంవత్సరాలు నడిపించాడు. తన ఇంట్లో పనిచేసే గ్రాసగాళ్ళకు, చిన్న పిల్లలు, ముదుసలులు ఉంటే వారందరికి కూడా నివాస, భోజన సదుపాయాలు ఏర్పాటు చేసేవాడు.

వెంగళరెడ్డి ప్రతియేడు ఉగాదినాడు అన్నదానం చేసేవాడు. ఆ సంతర్పణలో ఎవరెంత నెయ్యి త్రాగినా లేదనకుండా సమకూర్చేవాడు. ఆ రోజులలో 12 సేర్ల (తూకం) నెయ్యి త్రాగేవారుండేవారట. ఈ సంప్రదాయాన్ని ఆయన వంశీకులు నేటికీ కొనసాగిస్తున్నారు. తనతోపాటు ప్రతిరోజు కనీసం పదిమంది అతిథులు లేకుండా భోజనం చేసేవాడు కాడట. వెంగళరెడ్డి తనకు ఏది వడ్డిస్తే అతిథులకు కూడా అదే వడ్డించాలి. తేడావస్తే ఒప్పుకొనేవాడు కాడట.

ఆయన ఒకరోజు రాత్రి ప్రయాణం చేస్తుండగా నలుగురు దొంగలు ఆయనను చంపి ధనం అపహరించాలని ప్రయత్నిస్తే వాళ్ళను ఇంటికి తీసుకొనిపోయి కడుపునిండుగా భోజనం పెట్టి 'ఇంక నన్ను చంపండి' అనగానే ఆ దొంగలు పశ్చాత్తాపంతో ఆయన కాళ్ళమీద పడ్డారట. తర్వాత ఆ దొంగలకు నాలుగు బియ్యం మూటలు ఇచ్చి పంపిన కరుణాసముద్రుడు వెంగళరెడ్డి. వెంగళరెడ్డి దగ్గర ఒక అపురూపమైన పచ్చని జాతిగుర్రం ఉండేది. ఆయన ఎక్కడికి వెళ్ళినా దానిమీదే ప్రయాణం చేసేవాడు. ఒక శెట్టి ఈ గుర్రానికి దినానికి మేతకు కావలసిన ముంతెడు ఉలవలు యిస్తూ పద్దు వ్రాసుకొనేవాడు. సంవత్సరాంతాన రెడ్డిగారు ఆ ఉలవల బాకీ తీర్చేవాడు. తర్వాత కొన్నాళ్ళకు వెంగళరెడ్డి ఆ గుర్రాన్ని తన గురువు ధరణి సీతారామయ్యకు దానం చేశాడు. సంవత్సరం కాగానే శెట్టి బాకీ చెల్లించమని రెడ్డికి పట్టీ పంపించాడు. విషయం తెలిసికూడా వెంగళరెడ్డి చిరునవ్వుతో ఉలవల ఖర్చు వ్యాపారికి చెల్లించాడట.

వెంగళరెడ్డి తండ్రి స్వగ్రామంలో ఆగస్త్యేశ్వరాలయం కట్టించాడు. ప్రతి శివరాత్రి ఉత్సవానికి ముందు పదిరోజుల నుండి 20 రోజుల వరకు ఆ దేవాలయంలో ఉత్సవానికి వచ్చిన వాళ్ళందరికీ వెంగళరెడ్డి సంతర్పణ చేసే ఆచారం 25 సంవత్సరాలు నడిపించాడట. ఒకసారి ఒక ఫకీరు స్త్రీ ఒక పాత కోక యిమ్మని వెంగళరెడ్డి ఆడవాళ్ళను అడిగింది. వెంగళరెడ్డి భార్యల్లో ఒకామె "పాతకోక ఎందుకు? నీకోసమే కొత్త కోక నేయించి పెట్టాను. తీసుకొని పోదువులే!" అని పరాచకమాడింది. ఈ మాట విన్న వెంగళరెడ్డి లోపలికి వెళ్ళి చిలుక కొయ్యకు తగిలించిన ఒక కొత్త కోక ఆ బిచ్చగత్తెకు తెచ్చి యిచ్చాడట. "అది మా పుట్టింటి వాళ్ళు పెట్టిన కోక'' అని గోలపెట్టిందా భార్యామణి. ''నీవే యిస్తానన్నావుగా. మరి నీ మాట చెల్లుబాటు కావద్దా?" అన్నాడు రెడ్డి చిరునవ్వుతో.

ఉయ్యాలవాడ సమీప గ్రామం 'పాంపల్లె'లో ఇద్దరు బ్రాహ్మణ సోదరులు ఉండేవారు. వాళ్ళ యింట్లో ఒక వివాహానికి ఒక బంగారు మొలతాడు (వడ్డాణం) అవసరమై వెంగళరెడ్డిని అరువిమ్మని, పెండ్లి అయిపోయిన వెంటనే తిరిగి యిస్తామనీ అర్థించారు. సేరు (తూకం) బరువుగల మొలతాడు వాళ్ళకిచ్చాడు రెడ్డి. కార్యం ముగియగానే ఆ బ్రాహ్మణులు వస్తువును తిరిగి ఇవ్వబోగా దానిని వాళ్ళకే బహూకరించిన కలియుగ దానకర్ణుడు వెంగళరెడ్డి. వెంగళరెడ్డికి నిత్యమూ వ్యాయామం చేయటం అలవాటు. సాముగరిడీలు చేసేవాడు. చిన్నకమ్ము, పెద్దకమ్ము అనే వస్తాదులను పోషించేవాడాయన. రెడ్డి ఈ యిద్దరితో మల్లయుద్ధం, కర్రసాము, ఖడ్గచాలనం చేయటమే కాకుండా గ్రామయువకులకు వాటిలో శిక్షణ ఇప్పించేవాడు.

చెన్నంపల్లె గ్రామంలో వెంగళరెడ్డిని చంపటానికి కొందరు మాటువేసిన విషయం ఆ హంతకుల యింట్లోవున్న ఒక మాలవాడు (హరిజనుడు) ఉయ్యాలవాడకు వచ్చి రెడ్డికి తెలియజేశాడు. ఆ హరిజనునికి తనపై గల భక్తి విశ్వాసాలకు ప్రతిఫలంగా అతనిని తన దగ్గరే ఉంచుకొని వైభవోపేతంగా పెండ్లి చేయించిన మానవతావాది వెంగళరెడ్డి. వెంగళరెడ్డి దానగుణ కీర్తి దేశమంతా ప్రాకిపోవడంవల్ల ఆయన దర్శనం చేసుకోవటానికి ఒకరోజు కొందరు ఉయ్యాలవాడకు వస్తున్నారు. దారిలో జొన్నమూటలతో ఒక బండి వెళుతూ వుంది. దానివెనుక ఒక ప్రాయం మీరిన పెద్దమనిషి జారి క్రింద పడుతున్న జొన్నగింజలను ఏరుకుంటూ వస్తున్నాడు. ఆయనను నిమ్నదృక్కులతో ఆ బండిలోనివారు పరికించారు. ఆయనే బుడ్డా వెంగళరెడ్డి అని వారికి తెలియదు. ఆయన వెంబడే ఉయ్యాలవాడ చేరుకున్నారు వారు. రెడ్డి దర్శనం కోసం వేచిన వారికి భోజన సదుపాయం ఏర్పాటుచేసి విస్తర్లలో రూపాయలు పోసి వాళ్ళను తినమన్నారు. "ఎవరైనా రూపాయలు తింటారా?" అని అడిగారు వారు. అప్పుడు వెంగళరెడ్డి వాళ్ళతో "రాలిపోయే గింజలను నేనెందుకు ఏరినానో ఇప్పటికైనా మీకు తెలిసిందా? ప్రాణం నిలబెట్టేది అన్నంకాని రూపాయలు కావు" అన్నాడు. తర్వాత వాళ్ళందరికి షడ్రసోపేతంగా భోజనంపెట్టి పంపించాడురెడ్డి.

వెంగళరెడ్డి తల్లి అక్కమ్మ అమాయకురాలు. ఉదార

స్వభావం కలది. ఆ గ్రామంలో పాణ్యం సంజీవబొట్లు అనే బీదబ్రాహ్మణునికి ఆమె రోజూ కావలసిన భత్యం (ధాన్యం, పాలు, పెరుగు తదితరాలు) ఇస్తూ ఉండేది. ఒకసారి ఆ బాపడు నెలరోజుల తర్వాత వచ్చాడు. అప్పుడామె "ఇన్నాళ్ళూ ఎక్కడికి పోయావు స్వామీ!" అని పలకరించింది. ఈతి బాధలతో సతమతమవుతున్న ఆ బాపడు వేసరికతో "చచ్చి స్వర్గానికి పోయొచ్చాను తల్లీ!" అన్నాడు. అది నిజమేనని నమ్మిన ఆ అమాయకురాలు 'స్వామీ! స్వర్గంలో మా రెడ్డి ఏమైనా కనిపించాడా?'' అని అడిగింది. "కనపడినాడమ్మా మీ అందరి కుశల సమాచారాలన్నీ అడిగి యిక్కడ చలి ఎక్కువగా ఉంది, ఒక దుప్పటి తెమ్మన్నాడని" అన్నాడు ఆ బాపడు. ఆ మాటలు నమ్మిన ఆమె ఒక కొత్త దుప్పటి నేయించి తన భర్తకిమ్మని చెప్పింది. ఈ విషయం వెంగళరెడ్డికి తెలిసి ఆయనను పిలిపించి "ఏమయ్యా స్వామీ! స్వర్గానికి వెళ్ళి మా తండ్రికి దుప్పటి ఇచ్చి వచ్చావా?" అని అడిగాడు. బాపడు తన మోసం రట్టయిందని కలవరపడుతూ "రెడ్డీ! నేను కప్పుకుంటే మీ తండ్రికి చేరినట్లేకదా!" అని భయభక్తులతో జవాబిచ్చాడు. అతని సమయస్ఫూర్తికి రెడ్డి ఎంతో ఆనందించి ఆయనకు మరో ఆరుదుప్పట్లు దయచేశాడు.

ఉయ్యాలవాడకు సమీపంలో 'సర్వాయిపల్లె' అనే గ్రామంలో ఒక ధనికుడు మేనా, పగటిదివిటీలతో ఒక పాలెగానిగా చెలామణీ అవుతుండేవాడు. వెంగళరెడ్డికి దానకర్ణునిగా పేరు రావటం ఓర్చుకోలేక తానుకూడా దానపరుడనని చాటుకోవటానికి ఒక ఉగాది పండుగరోజు తన గ్రామం గుండా సాగిపోయే బిచ్చగాళ్లకందరికి సంతృప్తిగా భోజనం పెట్టి తలకొక రూపాయ కానుక ఇస్తానని చాటించాడు. కానీ ఒక్కడూ అతని ఆతిథ్యం స్వీకరించక అందరూ వెంగళరెడ్డి దగ్గరికే పరుగులు తీశారు. క్రీ.శ. 1866లో పెద్ద కరువు వచ్చింది. తినటానికి తిండిలేదు. బళ్ళారి (అప్పుడది ఉమ్మడి మద్రాసురాష్ట్రంలో ఉంది), అనంతపురం, కడప, కర్నూలులోని కొన్ని తాలూకాల్లోని ప్రజలు అనేక బాధలు పడ్డారు. తండోపతండాలుగా ప్రజలు గ్రామాలను వదిలి ఎన్నో తిప్పలు పడ్డారు. ఆకలి బాధకు ఓర్చుకోలేక స్త్రీలు అడవుల్లో ఆకులు, అలములు తినేవారు. పశువులపాటు చెప్ప పనిలేదు. మగలు భార్యాపిల్లలను సముదాయించేవాళ్ళు. ఇలా తండోపతండాలుగా వచ్చిన అన్నార్తులకు బుడ్డా వెంగళరెడ్డి లేదనకుండా తన 12 పాతర్ల ధాన్యం – అంటే 1440 బస్తాలు వెచ్చించి, అవి చాలక ఇంకా అప్పు చేసి పూటకు 8000 మందికి తక్కువ కాకుండా క్షామపీడితులను 3 నెలలు పోషించాడు. బనగానపల్లెకు వచ్చిన మద్రాసు రాష్ట్ర గవర్నరు యీ విషయం విని ఉయ్యాలవాడకు వచ్చి, విషయమంతా తెలుసుకొని యీ ఉదంతాన్ని ఢిల్లీలోని వైస్రాయికి విన్నవించగా, వైస్రాయి ఇంగ్లండులోవున్న విక్టోరియా మహారాణికి తెలియబరచాడు. అప్పుడు మహారాణి వెంగళరెడ్డి కరవు బాధితులను ఆదుకున్న తీరుకు సంతోషించి 20 తులాలు తూగే ఒక బంగారు కంకణం బహూకరించింది. వెంగళరెడ్డి బయటి ఊర్లకు వెళ్ళేటప్పుడు ఆ కంకణం తొడుక్కొని వెళ్ళేవాడు. అలా వెళ్ళినప్పుడు ఒకసారి ఆ కంకణాన్ని ఎవరో దొంగిలించారు. ఈ విషయం కర్నూలు కలెక్టర్‌కు తెలిసి రాణిగారి నుండి మరో పసిడి కంకణం (బరువు 10 తులాలు) తెప్పించాడు. ఇప్పుడు వెంగళరెడ్డి వంశీకుల దగ్గరున్న కంకణం ఇదే! ఈ కరువును 'డొక్కల/ఎరగాలి' కరువంటారు. అన్నమే కానని వాళ్ళు ఆకలిమంటలకు తాళలేక ఎవరైనా కడుపునిండా అన్నం తిన్నవారు కనబడితే వాళ్ల డొక్కలు చీల్చి పొట్టలోని అన్నం తినేవారట. అందుకని ఈ కరువుకు 'డొక్కలకరువు' అని పేరొచ్చింది. ఈ కరువు కాలంలోనే విపరీతమైన ఎర్రగాలి ప్రభంజనంలా వీచి గ్రామాలను చీకాకు పరిచింది. అందువల్ల ఈ కరువును 'ఎరగాలికరువు' అనికూడా పిలుస్తారు. ఆ తర్వాత వర్షాలు పడగానే ప్రజలకు విత్తడానికి ధాన్యం పంపించాడు వెంగళరెడ్డి. వీరందరినీ ఆ కరువుకాలంలో పోషించటానికి చేసిన అప్పు తీర్చటానికి ఆళ్లగడ్డ తాలూకాలో కె.సి.కెనాల్ (కర్నూలు–కడపకాలువ) ఆయకట్టులో వుండే తమ 500 ఎకరాల భూమిని అమ్మేశాడు. ఇంకా మిగిలిపోయిన అప్పులు ఆయన అనంతరం వారి వంశీకులు తీర్చారు.

వెంగళరెడ్డి ఇంటికి వచ్చిన వారందరికి మజ్జిగ లేదనకుండా పోసేవారు. ఒకసారి ఒక బీద బ్రాహ్మణ స్త్రీ మజ్జిగకోసం వస్తే ఆయన భార్య చెన్నమ్మ లేదని చెప్పటం వసారాలోవున్న రెడ్డికి వినిపించి, బ్రాహ్మణ స్త్రీని కాస్త ఆగమని చెప్పి లోపలికి వెళ్ళి చూశాడు. కుండలన్నీ మజ్జిగతో నిండుగా వున్నాయి. లేదన్న తర్వాత మళ్ళీ యిస్తే భార్య

పరువుపోతుందని ఆలోచించి ఒక ఆవుపడ్డను శాశ్వతంగా ఆ పేదరాలికి తోలించి పంపిన దయార్ద్ర హృదయుడు వెంగళరెడ్డి.

కడపజిల్లా పులివెందుల తాలూకాలో వేంపల్లె ఇప్పుడొక మేజర్ పంచాయితి గ్రామం. పాపాఘ్ని నదికి పడమటి తీరంలో వుంది. నదికి ఆవలిగట్టున అంటే తూర్పున ఒకపెద్ద గుట్టపై 'వృషభాచలేంద్ర స్వామి' దేవాలయముంది. ఆ స్వామిని 'ఎద్దులకొండ్రాయుడు' అని కూడా పిలుస్తారు. ఆ స్వామివారి నిత్య పూజ కోసం వేంపల్లెలో చిన్న దేవాలయముంది. ఆ దేవాలయానికి మాన్యం భూములు విస్తారంగా వుండేవి. ఈ వేంపల్లె గ్రామానికి వెంగళరెడ్డిగారు ఒక పంచాయతీకి రావలసివచ్చింది. వృషభాచలేంద్ర స్వామివారికి ప్రతియేటా ఉత్సవం జరిపేవారు. ఉత్సవ ప్రారంభం రోజు ఆ గ్రామం రెడ్డి (మునసబు) స్వామివారిని మొదట పూలమాలతో అలంకరించిన తర్వాతనే ఉత్సవం ప్రారంభించటం ఆనవాయితి. ఆ సంవత్సరం ఉత్సవానికి ముందే మునసబు గతించాడు. అందువల్ల మునసబు భార్య స్వామివారికి పూలమాల వేసి ఉత్సవాన్ని ఆరంభించబోతే ఆగ్రామంలో సంఖ్యాబలం గల వైశ్యులు తామే తొలుదొల్త స్వామివారికి పూలదండ వేయాలని అడ్డగించారట. ఆనాటికి కీర్తిప్రతిష్ఠలు గడించిన బుడ్డా వెంగళరెడ్డికి వేంపల్లెకు వచ్చి తనకు న్యాయం చేయమని వార్త పంపిందామె. వెంగళరెడ్డి తన ప్రయాణమార్గంలో పదిమైళ్ళ కొకచోట పదిబస్తాల బియ్యం వుంచితే తాను వచ్చి వ్యవహారాన్ని న్యాయంగా పరిష్కరిస్తానని చెప్పి పంపాడు. ఆమె దానికి అంగీకరించి తగిన ఏర్పాట్లు చేసింది. వెంగళరెడ్డి ఎడ్లబండిలో ప్రయాణిస్తూ చేతిలో ఒకశేరు (ఆనాటి కొలమానం) పట్టుకొని దారి పొడవునా బియ్యం దానం చేస్తూ వేంపల్లె చేరాడు. ఎద్దులకొండ్రాయుని ఉత్సవ ప్రారంభానికి ముందు స్వామివారికి పూలమాలవేసే హక్కు అధికారం మునసబు భార్యకే వుందని తీర్పు ఇచ్చాడు. ఇది క్రీ.శ. 1866–1900 ల మధ్యకాలంలో జరిగివుండవచ్చు.

వెంగళరెడ్డి తన బీదరికంలో కూడా – అప్పటికి తమ్మునికి, చెల్లెంద్రకు రావలసిన ఆస్తి వాళ్ళకు పంచి ఇచ్చాడు. అయినా దానధర్మాలు చేయడం మానలేదు. దానధర్మాలు చేయటం మానలేదు. అట్టి తరుణంలో ఒక బాపడు తన కుమారునికి ఉపనయనం చేయటానికి ఆర్థికసాయం కోరాడు. రెడ్డి రెండు రూపాయిలిచ్చాడు. అర్థ నూట పదహార్లయినా ఇస్తాడనుకున్న ఆ బాపడు రెండు రూపాయలు స్వీకరించలేదు. "ఎక్కువ ఇచ్చే కాలం చెల్లిపోయింది. ఇప్పటి నా పరిస్థితికి భగవంతుడు ఇదే కల్పించాడు" అన్నాడు వెంగళరెడ్డి. అయినా బాపడు ఒప్పుకోకుండా మొండిపట్టు పట్టాడు. అప్పుడు వెంగళరెడ్డి జొన్నలు రెండు రాశులుగా పోసి ఒకదాంట్లో రెండురూపాయలు, మరొకదాంట్లో యాభైరూపాయల విలువగల బంగారు నగ రహస్యంగా వుంచి అతడిని ఏదోఒకటి ఎంచుకోమన్నాడు. అతడు ఎంచుకున్న కుప్పలో రెండురూపాయలే వున్నాయి. అప్పటికీ ఆ బాపడు రెండవ కుప్పలోకూడా రెండు రూపాయలే ఉంటాయని వాదించాడు. అప్పుడు వెంగళరెడ్డి రెండవకుప్ప నుండి బంగారు నగ తీసి చూపించగానే బాపడు సిగ్గుతో తల వంచుకొని తన ప్రాప్తం రెండు రూపాయలేనని తీసుకొని వెళ్ళిపోయాడు.

అది క్రీ.శ. 1900 డిసెంబర్ 31వ తేదీ వెంగళరెడ్డి ఆనాడు పిల్లలకు మశూచి టీకాలు వేయించే పనిమీద ఊరిలోకి వెళ్ళి, ఇంటికి వచ్చి భోజనం చేసి మధ్యాహ్నం 12 గంటలకు అనాయాస మరణం పొందాడు. ఆనాడు బాలుడుగా వున్న బ్రహ్మశ్రీ పాణ్యం లక్ష్మీ నరసింహం వెంగళరెడ్డి మరణం గురించి ఇలా చెప్పాడు. "టీకాలు వేయించటానికి వెంగళరెడ్డి మాయింటికి రాగానే నేను భయపడి పారిపోతుంటే బలవంతంగా పట్టి తెప్పించి, మిఠాయి తినిపించి, తన జేబులో వున్న రూపాయి నాలుగణాలు నాకిచ్చి, టీకాలు వేయించి, ఇంటికి వెళ్ళి మధ్యాహ్నం 12 గంటలకు అకస్మాత్తుగా మరణించారు. రెడ్డితో కడపటి దానం గ్రహించిన వాడిని నేనే!" రెడ్డి మృతదేహాన్ని వారి సొంత వామిదొడ్డిలో సమాధి చేశారు. ఆ సమాధి దగ్గర ఇప్పటికీ ప్రతి సంవత్సరం సమారాధన చేస్తున్నారు. సమారాధనకు వచ్చిన వాళ్ళందరికీ సంతర్పణ చేస్తారు. వెంగళరెడ్డి చనిపోవటానికి కొన్ని రోజుల ముందు ఒక పేద బ్రాహ్మణుడు తన కుమారుని ఉపనయనం కోసం కొంత ధనం యాచించాడు. రెడ్డి ఆ ధనాన్నివ్వగా దాన్ని రెడ్డి దగ్గరే వుంచి ఉపనయనానికి ముందురోజు వచ్చి తీసుకుంటానన్నాడు ఆ బాపడు. నెలరోజుల తర్వాత అతడు ఉయ్యాలవాడకు పడిగపాడు దారిగుండా వస్తూ ఆ దారిలో రెడ్డి తన పచ్చ గుర్రాన్ని ఎక్కి ఎదురుగా వస్తుండటం చూసి ఆయనకు నమస్కరించాడు. "స్వామీ! మీ ధనం

పసుపుగుడ్డలో చుట్టి వెదురు కొమ్ములో వుంచి గాటిపట్టున (ఎద్దులు పడుకొనే చోటు) దంతులో పెట్టాను. మా వాళ్ళనడిగి తీసుకోండి" అన్నాడు వెంగళరెడ్డి. ఆ బాపడు ఉయ్యాలవాడ చేరుకొని "రెడ్డి తనకు దారిలో కనిపించాడనీ, తనకు ఇస్తానన్న ధనం ఎక్కడుంచిందీ చెప్పాడనీ, మిమ్మల్నడిగి తీసుకోమన్నాడని" చెప్పాడు. అప్పటికి రెడ్డి శివసాయుజ్యం చెంది పది దినాలయ్యింది. ఆశ్చర్యం! రెడ్డి చెప్పినచోటే ఆ ధనముంది.

అవి నేను కర్నూలు ఎలెక్ట్రికల్ డివిజన్ ఇంజనీరు ఆఫీసులో జూనియర్ ఇంజనీర్ (కమర్షియల్)గా పనిచేస్తున్న దినాలు. 1964 డిసెంబరులో ఒకరోజు ఒక నడివయస్సు వ్యక్తి - పొడవూ కాదు, పొట్టీకాదు - గౌరవర్ణ శరీరంతో 'ఆఫారం' (పొట్టిచేతుల కంటే కొంచెం పొడవు చేతులుగల చొక్కా) పైజమా కాదు, ప్యాంటు కాదు (రెండూ ఖద్దరువే) వేసుకొని నా దగ్గరకు వచ్చి "అన్నగారూ! (ఆయన అందర్నీ అలాగే సంబోధిస్తాడని ఆ తర్వాత తెలిసింది) నా పేరు బుడ్డా వెంకటరామిరెడ్డి, ఎక్సిక్యూటివ్ ఇంజనీర్, ఇరిగేషన్ డిపార్ట్‌మెంట్, నంద్యాల నువ్వు నాకొక సహాయం చేయాలి" అన్నాడు. నేను లేచి నమస్కరించి, ఆయనను కూర్చోబెట్టి "మీరు కీ.శే. ఉయ్యాలవాడ బుడ్డా వెంగళరెడ్డికేమైనా బంధువులా?" అన్నాను. అవునన్నా నేను ఆయన చిన్న చెల్లెలు సుబ్బమ్మ మునిమనవడిని, మా గ్రామం ఉయ్యాలవాడకు కరెంటు శాంక్షన్ చేయించుకోవటానికి వచ్చాను" అన్నాడు. మా డివిజనల్ ఇంజనీరు వద్దకు ఆయనను తీసుకెళ్ళి విషయం వివరించగా ఆయన ఎస్టిమేషన్ వేసి శాంక్షనుకు అనంతపురం సూపరింటెండింగ్ ఇంజనీరుకు (ఎస్.ఇ.) ఆఫీసుకు పంపమన్నాను. 1964 ఆఖరుకంతా ఎస్టిమేట్ అనంతపురం పంపాను. ఆ లోపల నాకు ఎ.ఇ. (నేటి ఎ.డి.ఇ.) గా ప్రమోషన్ రావడం అనంతపురం (నాల్గు రాయలసీమ జిల్లాలకు కేంద్రం) ఎస్.ఇ. ఆఫీసులో కమర్షియల్ ఎ.ఇ.గా పోస్టు చేశారు. నేను జనవరి 1965లో అక్కడ ఛార్జి తీసుకున్నాను. వెంకట్రామిరెడ్డి మళ్ళీ నన్ను అనంతపురంలో కలిశాడు. వెంకట్రామిరెడ్డిని ఎస్.ఇ. (జి.పి.నాయుడు) దగ్గరకు తీసుకెళ్ళి విషయం వివరించగా ఎస్టిమేట్ శాంక్షను చేసి బడ్జెట్ కూడా కేటాయించి ఉయ్యాలవాడ గ్రామం విద్యుదీకరణ చేయమని ఉత్తర్వులు జారీ చేశాడు. ఉయ్యాలవాడ గ్రామం విద్యుదీకరణ ఒక నెలలో జరిగిపోయింది. కడప, కర్నూలు కరువు పీడిత ప్రాంతాలను సుభిక్షం చేయటానికి కె.సి.కెనాల్ వెంగళరెడ్డి కోరికపైన కార్యరూపం దాల్చిందంటారు. ఈ కాలువ క్రింద ఆళ్ళగడ్డ తాలూకా (ఆనాడు సిరివెళ్ళ)లో వెంగళరెడ్డికి 500 ఎకరాల భూవసతి వుండేది. ఆ తాలూకాలోని భూములకు నీరందించే పిల్లకాల్వలకు బుడ్డా వెంగళరెడ్డి కాల్వ నెం.1, నెం.2 అనిపేర్లు ఈనాటికీ వున్నాయి. ఈ భూమినంతా డొక్కల కరువు కాలంలో చేసిన అప్పులు తీర్చటానికి ఆయన కాలంలోనే అమ్మడం జరిగింది.

ఉయ్యాలవాడకు కె.సి.కెనాల్ నీటి సౌకర్యం వుండేది కాదు. తన గ్రామానికి కూడా ఆ కెనాల్‌ను తెప్పించాలనే కోరిక వారి బంధువుల ప్రతికూలతవల్ల అప్పటికి కోరికగానే మిగిలిపోయింది. వెంగళరెడ్డి అంతరంగికుడు తలారి నరసింహన్న ఇంజనీరు వెంకటరామిరెడ్డిని చిన్నతనంలో ఎత్తుకొని తిరిగేటప్పుడు బుడ్డా వెంగళరెడ్డి గొప్పతనం వివరిస్తూ ఈ కాలువ విషయం చెప్పేవాడట. వెంగళరెడ్డి కోరిక నెరవేర్చటానికి వెంకటరామిరెడ్డి ఇంజనీరై నంద్యాల ఎగ్జిక్యూటివ్ ఇంజనీరుగా పనిచేసేటప్పుడు నిలిచిపోయిన కాలువను 1963-66 మధ్యలో ఉయ్యాలవాడ వరకు త్రవ్వించి ఆ పొలాలకు నీరందేటట్లు చేశాడు. వెంగళరెడ్డిని కలియటంకోసం పెద్ద పెద్ద ప్రభుత్వోద్యోగులు, తదితర ప్రముఖులు వచ్చేవారట.

ఉయ్యాలవాడ కుందూనదికి ఎడమగట్టున ఉంది. ప్రధాన రహదారి నదికి కుడిగట్టున ఉంది. ప్రభుత్వోద్యోగులెవరు వచ్చినా ప్రధానరహదారి వెంటే రావల్సి ఉంది. ఉయ్యాల వాడకు వెళ్ళాలంటే నది దాటవలసి వచ్చేది. అందువల్ల నదిపైన ఒక వంతెన కట్టించాలని అనుకుంటూ అర్థాంతరంగా గతించాడు వెంగళరెడ్డి. వెంగళరెడ్డి గతించిన 60-65 ఏళ్లకు వెంకటరామిరెడ్డి ఆ వంతెన నిర్మించి ప్రజల కోరికపై దానికి 'బుడ్డా వెంగళరెడ్డి వంతెన' అని పేరు పెట్టాడు. వెంకటరామిరెడ్డి ఛీఫ్ ఇంజనీరుగా రిటైరయి 88 ఏళ్ళ పండు వయస్సులో 13-05-2015న దైవసన్నిధి చేరుకున్నారు. బుడ్డా వెంగళరెడ్డి నిస్సందేహంగా 'బడా' వెంగళరెడ్డి!

మి



కోడూరు పుల్లారెడ్డి
ఫోన్ : 9550818495

# ఒక వివరణ – ఒక స్పందన, మరొక మనవి

*– ఆచార్య యార్లగడ్డ బాలగంగాధరరావు*

పై శీర్షికలో మూడు భాగాలున్నాయి. ఒక వివరణ ఒకటి స్పందన. మరొకటి మనవి. ముందుగా వివరణ స్పందనలను పాఠకుల దృష్టికి తెచ్చి, మనవిని తరువాత మనవి చేస్తాను. స్పందన దేనిపైన అంటే – శ్రీ వి.వి.న. మూర్తి గారి వ్యాసం వెల్చేరు వారి 'కన్యాశుల్కంలో గురజాడ గతి' అన్న దానిపై. అంటే – వెల్చేరు నారాయణరావు గారు, గురజాడ వారి కన్యాశుల్కాన్ని ఆంగ్లంలోనికి అనువదించి, దానిపై వారు వారి అభిప్రాయాలను కూడా అందులోనే ప్రకటించారు. ఆ ప్రకటించటం ఆ అనువాద గ్రంథం ముందు పేజీలోగాని, చివరి పేజీలలోగాని గాక మధ్యలో ప్రకటించారు. ఇదేమి పద్ధతి అనేది కూడా వి.వి.న. మూర్తిగారి ఒక అక్షేపణ. నిజమే. ముందో వెనుకో ప్రకటించవచ్చును. మధ్యలో ప్రకటించటానికి కారణాలేమో వెల్చేరువారే చెప్పాలి. అయితే ఒకటి ఊహించటానికి అవకాశం వుంది. ముందు వెనుకలలో అయితే, పాఠకులు దానిపై దృష్టి పెట్టకపోవచ్చుననేది కావచ్చును. దానినొక పెద్ద విషయంగా భావింపనవసరంలేదు. పరిగణనలోనికి తీసుకోవలసింది అందులో చెప్పబడిన విషయాలను మాత్రమే.

విషయంలోనికి వెళ్ళబోయే ముందు, రెండు మూడు విషయాలు ఈ సందర్భంగా పాఠకులకు మనవి చేయవలసివుంది. మొదలు ఆ కారణాలే, నా యీ స్పందనకు మూలం. వెల్చేరు వారి కన్యాశుల్కం ఆంగ్లంలోనికి 'Girls for Sale' అన్న పేరులో అనువదింపబడి ప్రచురింపబడిందన్న విషయం నాకు మొదటిసారిగా తెలియవచ్చింది శ్రీయుత ఆచార్య సోమంచి కృష్ణ శర్మ గారి వలన. వీరు నావలెనే నాగార్జున విశ్వవిద్యాలయంలో ఆంగ్ల శాఖలో ఆచార్యులుగా పనిచేసి రిటైరయినారు. వారు ఒక ఉదయం ఆ పుస్తకం తెచ్చి, ఈ అనువాదకుడు మీకు పరిచయమేనా? గురజాడ వారి కన్యాశుల్కం మీరు చదివేవుంటారు కదా. దానితో ఈ అనువాదాన్ని పోల్చి, సమంగా వుందో లేదో చెప్పండి అని పుస్తకం ఇచ్చి వెళ్ళారు. ఆ మీదట దానిని నేను అక్కడక్కడ మాత్రమే చదవటం జరిగింది. కారణం నేను అప్పట్లో భాగవత దశమ స్కంధం పూర్వ భాగాన్ని వచనంలోనికి తెచ్చే ప్రయత్నంలో వుండటం.

కొద్దిరోజుల తర్వాత శ్రీ శర్మగారు నా వద్దకు రాగా, ఆ పుస్తకాన్ని వారికి తిరిగి ఇస్తూ ఇలా చెప్పాను : గురజాడ వారి కన్యాశుల్కం ఇతివృత్తం ఆంధ్రదేశానికి అందులోనూ ఒక ప్రాంతంలోని ఒక సామాజిక వర్గానికి చెందినది. దానిని మరో భాషాసమాజం వారికి, వారిదైన భాషలో మూలగ్రంథంలోని భాగాన్ని స్థూలంగా చెప్పగలమేమో కాని 'నేటివిటి'ని చొప్పించటం సాధ్యం కానిది. దానికనువైన భాష పదజాలాన్ని (Vocabulary) ఎన్నుకోవటం కూడా అంత తేలిక కాదు. ఏమంటే, ఇతివృత్తం ఏ విధంగా కూడా ఆంగ్ల భాషా సమాజానికి పరిచయమైనది కాదు గనుక కన్యాశుల్కం ఇతివృత్తాన్ని నవలగా వ్రాయవచ్చునేమోగాని (అప్పుడు కూడా చాలా వివరణలు ఇచ్చుకుంటూ) నాటకంగా అనువదించడం కుదరదు. అలా చేసి తగిన అనుభూతినీ పొందలేము అని చెప్పగా తాను కూడా అదే అభిప్రాయంలో వున్నామని చెప్పారు. ఆ మీదట నేను, మొదలు 'Girls for Sale' అనే Title కూడా కన్యాశుల్కమన్నదానికి నప్పదు. పైగా విపరీతమైన అర్థాన్నిస్తుంది. దానివలన ఆ పుస్తకం చదివినవారికి, భారతదేశంలో – పోనీ ఆంధ్రదేశంలో, ఆడపిల్లలు అమ్మకానికి దొరుకుతారు కాబోలుననే భావన కలిగించే అవకాశం వుంది. కన్యాశుల్కం అనేది కన్యను పొందటానికి, ఆమె తలిదండ్రులకు చెల్లించే శుల్కం మాత్రమే. వివాహ విధానంలో ఇదొక విధి. వరునిపరంగా తప్పనిసరి అయినది. అంతే తప్ప తల్లిదండ్రులు కన్యను అమ్మజూపితే వరుడు కొనుక్కోవడం కాదు. దానిని అనంతర కాలంలో, బ్రాహ్మణ సామాజిక వర్గం అమ్మకంగా పరిణమింప చేసుకుంది తప్ప ఇతర సామాజిక వర్గాలలో అది విధివిధానంలో భాగంగానే చెల్లుబాటు అవుతోంది. కనుక Title అలా వుండటం బాగులేదు. ఆంగ్లేయులకు అనుభవంలో లేని విషయం గనుక వారి భాషలో దానికి సమమైన పదం వుండే అవకాశం లేదు. అయితే Bridal Price అనవచ్చునేమో ఆలోచించండి

అనగా వారు, Bridal Price అనే దానిని నేను ఏ అర్థంలో అంటున్నానో వివరించమని అడిగారు. ఎందుకంటే ఆ పదం సరిపోలుతుందేమో ఆలోచించమని గదా మీరు అన్నారు. అంటే మరేదో భావంలోని పదాన్ని మీరు చెపుతున్నారు. ఆ భావమేదో చెప్పండి అన్నారు. ఆ మీదట, అయ్యా Bridal Price అనే పదబంధం ఆంగ్లంలో – అంటే ఆ భాషాసమాజంలో వుందో లేదో నాకు తెలియదు. కాని నేను దానిని ఉపయోగిస్తున్నది కొంగు బంగారానికి మారుగా, అంటే భర్త భార్యతోడి ప్రథమ సమాగమ సందర్భంలో ఆమె కొంగుకు కట్టే ఒక నవరసు బంగారం. మరి దానిని కన్యాశుల్కానికి అంటే వివాహ విధిలో భాగంగా కన్య తలిదండ్రులకు చెల్లించేదానికి ఉపయోగింపవచ్చునా? అన్న సందేహంతో తమను ఆలోచించమన్నాను అని చెప్పాను.

తరువాత మా సంభాషణ కన్యాశుల్కం అనువర్తనీయత పైకి మళ్ళింది. దానికి కారణం కన్యాశుల్కమనేది ఏదో ఒక పేరుతో పురాణ కాలం నుండి వున్నదని నేను అనటం! దానిపై నా వివరణ ఇలా సాగింది (ఈ విషయాలను ఫోనుమీద శ్రీ వి.వి.న. మూర్తిగారికి కూడా చెప్పాను) : వరకట్నం కన్యాశుల్కాలు ఎప్పుడూ వున్నాయి. వరునికి అత్తగారిచ్చే అరణం వరకట్నం (ఇప్పుడు కొన్ని సామాజిక వర్గాల్లో ముఖ్యంగా కలిగిన కమ్మవారిలో అరణమూ కట్నమూ రెండూ వున్నాయి). వధువుకు పుట్టింటివారు, ఆమె బంధువులూ ఇచ్చేది స్త్రీ ధనం. దీనిని ఆమె భర్తగాని అతడి కుటుంబం గాని ఉపయోగించుకునే వీలు లేదు. అంటే హక్కే లేదు. పైగా అలా ఉపయోగించుకోవటం పరువు తక్కువగా భావింప బడుతుంది. ఒకవేళ ఉపయోగింపక తప్పని పరిస్థితులు ఏర్పడితే, తిరిగి దానిని వడ్డీతో జమ చేయాలి. ఇక వరుడు అరణంగా ఇచ్చిన దానిని, కట్నంగా ఇచ్చిన దానిని కూడా వరుని సమష్టి కుటుంబానికి ఉపయోగించటానికి వీలు లేదు. అరణం వరుడు తన స్వంతానికి ఉపయోగించుకోవచ్చును. కట్నపు సొమ్మును వరుని తండ్రి వృద్ధి చేసి, ఆ దంపతులు సమష్టి కుటుంబం నుండి విడిపోయిన సందర్భంలో వారికి ఇవ్వాలి. ఇది కమ్మవారిలో నేడు కూడా పాటింపబడుతోంది (కాని కొన్ని సామాజిక వర్గాల్లో ముఖ్యంగా బ్రాహ్మణుల్లో కట్నపు సొమ్మును సమష్టి కుటుంబ అవసరాలకు ఉపయోగిస్తారు) కనుకనే కట్నం ఇవ్వటాన్ని కమ్మవారిలో ఒక సమస్యగా పరిగణించరు. అది కుమార్తె భాగంగానే పరిగణిస్తారు. కట్నం ఇవ్వలేని కమ్మవాడు కూతురుని ఎందుకు కనాలి అనేది సామెత. అయితే కమ్మవారిలో కూడా కట్నం సమస్యగా పరిణమించింది 1950 తరువాత. దానికి గల ఏకైక కారణం, మగపిల్లలు చదువులకు మళ్ళటం. ఉద్యోగాలకు వెళ్ళటం. అమ్మాయి సుఖపడుతుందని, తమ అంతస్తును మరచి వధువు తల్లిదండ్రులు కట్నాలు ఇవ్వబూనటం. ఇది ఎంతవరకూ వెళ్ళిందంటే మీ అబ్బాయికి చదువు మేము చెప్పించుకుంటాము. లేదా చదువుకు అయిన ఖర్చు ఇస్తాము అన్నంతవరకు. అంతేకాదు, పెళ్ళిఖర్చులు కూడా ఇస్తామనేంత వరకు. చివరకు అది వరుని వైపువారి డిమాండుగా మారింది. అంతస్తులు మరిచి పోనంతవరకూ కట్నం ఇవ్వటం అనేది ఒక సమస్యగా లేదు. రామాయణ భారతాల్లో అరణం ఎంతెంత ఘనంగా ఇచ్చారో చూస్తే తెలుస్తోంది.

ఇక కన్యాశుల్కం విషయం రామాయణంలో రాముడు చేసిన శివ ధనుర్భంగం సీతనిస్తున్నందుకు జనకునికి చెల్లించిన కన్యాశుల్కం. శ్రీ మహాభారతంలో అర్జునుడు చేసిన మత్స్య యంత్ర భేదనం ద్రౌపది కొరకు ద్రుపదునికి చెల్లించిన కన్యాశుల్కం. ఇక భాగవతంలో రుక్మిణి, 'నీ శౌర్యమే ఉంకువ చేసి' తనను కొనిపొమ్మని శ్రీకృష్ణునికి రాయబారమంపిన విషయం విదితమే. పల్నాటి యుద్ధ సమయంలో బాలచంద్రుడు తన సాని సబ్బాయితో, ఒకవేళ తాను యుద్ధంలో మరణిస్తే ఆమెను సహగమనం చేయమనగా అలా చేయటానికి నాకేమి పని? నేను నీ ఉంపుడుగత్తెను మాత్రమేగాని నీ భార్యను కాదు. నీవేమీ మా వారికి ఓలి చెల్లించి నన్ను గ్రహించలేరుగదా అని ఆమె అనగా, అప్పుడు బాలచంద్రుడు ఆమె తల్లికి ఓలి చెల్లించాడు. కన్యాశుల్కమనే సంస్కృత పదానికి ఉంకువ. ఓలి అనేవి తెనుగులో సమానార్థక పదాలు. అయితే ఆ పదాలు భావం, అనువర్తనీయత ఒకటే అయినపుడు రెండు పదాలు ఎందుకు వాడుకలోనికి వచ్చాయి? అని అనిపిస్తుంది. ఒక భాషలో ఒక భావం చెప్పటానికి ఒక పదం మాత్రమే వుంటుందన్న భాషాసూత్రానికి విరుద్ధం కదా అని అనిపిస్తుంది. అయితే స్థూలంగా ఆ రెండు పదాల అనువర్తనీయత ఒకటే. అది కన్యకు చెల్లించే శుల్కం – అయినా, సూక్ష్మమైన భేదం వుంది. ఉంకువ, ద్వితీయ వివాహానికి అవకాశం లేని సామాజిక వర్గాల్లోను, ఓలి

అలాంటి దానికి అనుమతిగల సామాజిక వర్గాల్లోను వుంది. అందువలన రెండు పదాల వాడుకలో వున్నాయి. ఈ రెండూగాక మరో పదం క్రంత అనేది కూడా (ఇతర సామాజిక వర్గాలలో వుందో లేదో నాకు తెలియదు. కమ్మ సామాజిక వర్గంలో కొన్ని కుటుంబాలలో) వుంది. వ్యవహారంలో ఇది కంత. నిజానికిది ఘనత. ఎందువల్లనో క్రంతగా వ్యవహరింపబడుతోంది. ఇది వివాహ సమయంలో వధువు ఇంటివారికి, ఆమెకు దగ్గరి బంధువులకు వరుని ఇంటివారు పంపే బహుమతులతో కూడిన సారె. ఇది కూడా కన్యాశుల్కమే. ఇందులో ధనప్రసక్తి లేదు. కాగా ఓలి ఆయా సామాజిక వర్గాలలో నిర్ణీతమై వుంటుంది. గురజాడ వారి కన్యాశుల్కం నాటి సమాజంలోని బ్రాహ్మణ కుటుంబాలలోవలె బేరసారాలుండవు. క్రంతను, ఉంకువను బట్టి వరుని కుటుంబపు స్థోమతను, ఇలు వరుసను, కుటుంబ గౌరవాన్ని వధువు తరపు బంధువులు అంచనా వేస్తారు. అందువలన ఆ విషయంలో వరుని ఇంటివారు చాలా జాగ్రత్తగా ఎక్కడా ఎలాంటి లోపం – తమ స్థోమతకు తగ్గకుండా, రానీకుండా చూసుకుంటారు. శ్రీ మహాభారతంలో ఉత్తరాభిమన్యుల వివాహ సందర్భంలో అభిమన్యుని మేనమామగా శ్రీకృష్ణుడు క్రంతకు ముందు నడిచిన సమాచారం వుంది.

ఇప్పుడు ఈ విషయాలను ఇక్కడ ఇంత వివరంగా చెప్పటానికిగల కారణం, కన్యాశుల్కం, వరకట్నం (అరణం రూపంలో) అనేవి అనాదిగా వున్నాయని తెలుపటానికే అయినపుడు ఇది బ్రాహ్మణ సామాజిక వర్గంలో అనిష్ట పూర్వకమైన ఆచారంగా, వ్యవహారంగా ఎందుకు పరిణమించింది. గురజాడవారు కన్యాశుల్కం నాటకాన్ని, కాళ్ళకూరి వారు 'వరకట్నా'న్ని పనిగట్టుకొని, వాటిని దురాచారాలుగా ఎత్తిచూపుతూ వ్రాయవలసి రావటానికి గల నాటి కారణాలేమిటి? అవి బ్రాహ్మణ సమాజ సంబంధులు మాత్రమే ఎందుకు అయినాయి? ఈ విషయాలను తెలుసుకుందాము.

అష్టవర్షాభవేత్కన్యా అని మాత్రమే. అది వివాహ యుక్త వయసని కాదుగదా! పురాణాల్లో, ఇతిహాసాల్లో అంతటా ప్రముఖంగా రజస్వలానంతర వివాహాలే దర్శనమిస్తున్నాయి. బ్రాహ్మణేతర సమాజంలోనూ దానికే అనువర్తనీయత వుంది. మరి బ్రాహ్మణుల్లో రజస్వలాత్పూర్వక వివాహాలు ఎందుకు చోటుచేసుకున్నాయో తెలియాలి. కన్యావరణం విషయంలో (వివాహ విషయంలో) ఎన్ని పద్ధతులున్నాయో కూడా స్మృతి చెప్పింది. వానిలో కూడా కన్యాశుల్కం విషయం వుంది. అదే సందర్భంలో తలిదండ్రులు కన్యను ధనానికి అమ్ముకోవటం, అమ్మజూపటం ఘోరమైన పాపంగా దోషంగా చెప్పింది.

రజస్వలాత్పూర్వపు వివాహాలకు ముఖ్య కారణం మహమ్మదీయుల పాలన అని చెపుతారు. పెళ్ళీడుకొచ్చిన యుక్త వయసులోని ఆడపిల్లలను వారు బలవంతంగా ఎత్తుకుపోయి వివాహాలు చేసుకోవటం, వివాహితల జోలికి వారు వెళ్ళకపోవటం – ఆ కారణంగా బాల్యవివాహాలు వచ్చాయని తెలియవచ్చిన విషయం. ఆ పిదప శారదా చట్టం అమలులోనికి వచ్చిన కారణంగా, బ్రాహ్మణులు చట్టం బెడద నుండి తప్పుకోవటానికి కృష్ణా ప్రాంతం వారు మచిలీపట్నం పరాసుపేటకు, గోదావరి జిల్లాల వారు యానాముకు వెళ్ళి తమ పిల్లలకు వివాహాలు గావించారు. ఇతర సామాజిక వర్గాలలో ఉన్నవి రజస్వలానంతర వివాహాలే గనుక వారిలో ఇది తలెత్తలేదు. మహమ్మదీయుల పాలనా కాలంలోని బెడద వలన వచ్చిన విధానం అనంతర కాలంలో విధిగా అనుసరించవలసిన ఆచారంగా పరిణమించింది. ఒకవేళ ఎవరైనా రజస్వల అయితే, ఇక ఆమెకు పెండ్లి కాదేమోనన్న భయంతో దానిని దాచిపెట్టి, వరుని తరపువారిని వధువు రజస్వల కాలేదని నమ్మించి వివాహం జరిపించిన ఘటనలు కూడా వున్నాయి. అలాంటి ఒక సంఘటన మా గ్రామం పెదప్రోలులో నా చిన్నతనంలో జరిగిన సంగతి నాకు తెలుసు.

కాగా కన్యాశుల్కం ఎలా అమలులోనికి వచ్చిందో తెలుసుకుందాము. బాల్యవివాహాలలో వధూవరులిద్దరూ బాలలే. క్రమంగా వారికి యుక్త వయసు వచ్చిన పిదప, కన్యను కాపురానికి పంపేవారు. ఇంతవరకూ బాగానే వుంది. మునుపటి తరాలలో ప్రసూతి వైద్య సౌకర్యాలు లేక బాలింతల, శిశు మరణాలు చాలా అధికంగా వుండేవి. అలా మగవారికి ద్వితీయ, తృతీయ, చతుర్థ వివాహాలు కూడా జరిగాయి. వయసు పైబడిన కొలదీ, వారికి బాలికలు దొరకటం కష్టమైంది. ఆడతోడు లేక బ్రతుకు వెళ్ళమార్చుకోవటం కుదిరే పని కాదు. లైంగికావసరం మరొకటి. అయితే బాలిక వలన ఆ అవసరం తీరదు. దానికి వారివారి ఏర్పాట్లు వేరుగా వున్నాయి. ముఖ్యంగా సానివాడలు. మరి వివాహం ఎందుకంటే ఉత్తరోత్తరా బాలిక

ఈడేరుతుందిగదా! అలాగా వంశాకురాన్ని పొందవచ్చు. ఇక్కడ ముఖ్యమైన అంశం తన ఆస్తిని జ్ఞాతులకు అందిరానీయకపోవటం, ఇలా వయసుమీరి లైంగిక సామర్థ్యం కలిగినవారికి ఆడపిల్లలు దొరకటం కష్టమైంది. అలాగే బాగా వయసుమీరిన వారు కూడా, సంఘం ఎక్కడ తమను లైంగిక సామర్థ్యం కొరవడిన వయోవృద్ధులుగా పరిగణిస్తుందోనన్న భావనలో వయసును తగ్గించి చెప్పుకొని, అలా జాతకాలు సృష్టించి, పెళ్ళిళ్ళ పేరయ్యలను కూడగట్టుకొని, అలా సంఘంలో గౌరవ ప్రతిపత్తులను పొందే దిశగా, వివాహాలకు సిద్ధమైనారు. ఇలా ఈ రెండు తరహాల వరుల కారణంగా ఆడపిల్ల ఒక 'డిమాండు'గల వస్తువుగా మారింది. మార్కెట్టులో పోటీ పెరిగింది. ధనహీనుడైన వధువు తండ్రిని ప్రలోభానికి గురిచేశారు. ఉభయ ఖర్చులూ తామే పెట్టుకుంటామన్నారు. దానికితోడు వధువు తండ్రి స్వార్థం చోటుచేసుకుంది. అంతే! వరుని వయసుతో నిమిత్తం లేకుండా తమ బిడ్డలను కట్టబెట్టారు. వరుని వైపునుండి గౌరవప్రదంగా, లాంఛనంగానున్న కన్యాశుల్కం, వధువు తండ్రి ఆమెను అమ్మజూపిన వెలగా పరిణమించింది. ఇది చివరకు స్వార్థంగా ఎంతగా ఎలా పరిణమించిందంటే, వరుడు ఎంత పెద్ద వయసువాడైతే అంత మంచిదని, అంత ఎక్కువకు కూతురుని అమ్ముకోవచ్చుననేటంతవరకు. అంతేకాదు, వరుడు తొందరగా పరలోక గతుడైతే, అతని ఆస్తి కుమార్తె ద్వారా తనకు లభిస్తుంది. విధవరాలైన కుమార్తె తన పంచన చేరి తనకు సేవలు చేస్తుందన్న ఆలోచన కూడా అందులో చోటుచేసుకుంది. ఎంత నైచ్యం? ఎంత కర్కశత్వం? వీటినే గురజాడ తన కన్యాశుల్కంలో చెప్పారు. ఇక్కడ గుర్తుపెట్టుకోవలసిన అంశం ఇది బ్రాహ్మణ సమాజానికి మాత్రమే పరిమితం. అది కూడా కోస్తాలో పూర్వాంధ్ర ప్రాంతంలోనే అధికం. బాల్యవివాహాలు కోస్తా అంతటా వున్నాయో లేదో తెలియదుగాని కృష్ణా మండలంలో మాత్రం వుండేవి. వయసుమీరిన వరులు పరలోక గతులు కాగా, అప్పుడప్పుడే యుక్త వయసులోనికి వచ్చిన వివాహిత యువతులకు శిరోముండనం చేయించటం, పువ్వులు ముడుచుకోవటం పై ఆంక్షలు, శ్వేత వస్త్ర ధారణ తప్పనిసరి చేసి పుట్టుకుంకలుగా ఇంట్లో పరిచారికలుగా మార్చారు. ఇలా వైధవ్యం పొందినవారిలో కొందరు వీరేశలింగం పంచన చేరారు. ఆ ముచ్చట తరువాత.

ఆ పరిస్థితులను ప్రతిబింబింపచేస్తూ గురజాడ కన్యాశుల్కంలో నాటకాన్ని వ్రాశారు (రెండవది). మొదట మొదట గురజాడ విజయనగరం మహారాజా వారి ఆజ్ఞపై, వారి పాలనా పరధిలో అతి బాల్య వివాహాలు ఎన్ని జరిగాయో లెక్కలు తీయమనగా ఆ పని చేసి దాని ఫలితంగా కన్యాశుల్కం వ్రాశారు. మహారాజు వారు ఆ పని ఎందుకు చేశారంటే మద్రాసు ప్రభుత్వంలో వారు కౌన్సిలు మెంబరు. ప్రభుత్వం వారు తేనున్న సంస్కరణలకు ఊతంగా వారిని మెప్పించే నిమిత్తం ఆ పని చేయించారట. అందులోని ఇతివృత్త గమనానికి ఈ మహారాజావారి మరణం తరువాత లభించిన స్వాతంత్ర్యంలో, వెనుకటి వ్యవస్థపై మమకారంగాని, మరేమైనాగాని గమనాన్ని మార్చి కన్యాశుల్కం తిరుగవ్రాశాడు. ఈ రెండు సందర్భాలను పురస్కరించుకొని వెల్చేరు నారాయణరావు గారు కన్యాశుల్కాన్ని ఆంగ్లీకరిస్తూ, వాటి వెనుకగల చారిత్రక నేపథ్యాన్ని ఎత్తిచూపారు. దానిని వి.వి.న. మూర్తి గారు ఆక్షేపిస్తూ నవంబరు 2015 నెల మిసిమిలో వ్రాశారు. దాని శీర్షిక పైన చూశారు.

దానిని ప్రచురిస్తూ మిసిమి సంపాదకులు తమదైన వ్యాఖ్యలు మూడు జోడించారు. వాటితోపాటు మూడు ప్రశ్నలు కూడా జోడించారు. వ్యాఖ్యలు 1. వి.వి.న. మూర్తి గారు వ్రాసిన విమర్శ ఒదిగి ఒదిగి వ్రాశారు. 2. వెల్చేరు వారు తమ ఆంగ్లానువాద కన్యాశుల్కానికి ప్రకటించిన ముఖచిత్రం, మిసిమి జులై 2010లో పెండ్లికూతురు పేరుతో తాము ప్రచురించిన దామెర్ల వారి వర్ణ చిత్రం. 3. 'సమీప చరిత్రలు' అని వెల్చేరువారు ఉపయోగించిన పదబంధానికి స్ఫూర్తి తాము అదే పేరుతో ప్రకటించిన వ్యాసాలు కావచ్చునా అని. ఇక సంధింపబడిన ప్రశ్నలు. గురజాడకు మహాకవి అని కితాబు ఎవరు ఇచ్చారు? ఆయన రాసిన కవిత్వం ఏమిటి? నాటకం రాస్తే మహాకవి అంటారా?

వి.వి.న. మూర్తి గారు ఒదిగి ఒదిగి వ్యాసం వ్రాసారనటానికి తగు సాక్ష్యాలు ఎక్కడున్నాయో (ముందు – మధ్య – చివర) వారి వ్యాసం కడముట్ట చదివిన వారికి ఎలాగూ తెలియవస్తుంది కనుక వాటిని ఎత్తిచూపటం చర్విత చర్వణమవుతుంది. అయితే వారు వ్రాసిన ఒక మాటకు వారి నుండి వివరణ అవసరమవుతోంది. వారు ఇలా వ్రాశారు : 'వారి (శ్రీ వెల్చేరు వారి) పరిశోధనాగ్రంథం

తెలుగులో అత్యుత్తమ పరిశోధనా గ్రంథాలలో తొలి అయిదింటిలో ఒకటని చెపుతారు. తొలి మూడింటిలో ఒకటని నేను (వి.వి.న. మూర్తి) భావించేవాడిని' అని. ఆ తొలి అయిదు ఏవి. అలా వాటిని నిర్ణయించిందెవరు? ఆ అయిదింటిలో మూర్తిగారు భావించిన మూడు ఏవి? 'భావించే వాడిని' అని వ్రాయటం వలన ఇప్పుడు అలా అనుకోవటంలేదనే భావన కలుగుతోంది. ఎందువలన? వెల్చేరువారు ఆంగ్లీకరించిన కన్యాశుల్కంలో వెలువరించిన అభిప్రాయాల వలనా? ఈ విషయాలను తెలియచెప్పమని వారిని కోరుతున్నాను.

ఇక్కడ రెండు మాటలు. వి.వి.న. మూర్తి గారిని రచయితగా ఎరుగుదును. ప్రత్యక్ష పరిచయం లేదు. వారు తమ వ్యాసం మిసిమిలో ప్రకటించిన తర్వాత వారితో ఫోనులో మాట్లాడాను. అంతమాత్రము. కాగా వెల్చేరు వారిని నేను ఎరుగుదును. నేను ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఎం.ఏ. తెలుగు చదువుకున్న (1969-71) కాలంలో వారు పరిశోధనగావిస్తున్నారు. అంతకు పూర్వం వారు సి.ఆర్. రెడ్డి కళాశాల ఏలూరులో పనిచేశారట. మాకు ముందు సంవత్సరం ఎం.ఏ. చదివారట. వారు మొదట పి.హెచ్.డి. కొరకు ఎన్నుకున్న అంశం వేరట. పిదప మార్చుకున్నారని తెలిసింది. అదే సందర్భంలో వారు విస్కాన్సిన్ విశ్వవిద్యాలయానికి యు.ఎస్.ఎ. వెళ్ళారు. వారి సిద్ధాంత గ్రంథానికి శ్రీశ్రీ ఒక నిర్ణేత. అది ఆ రోజుల్లో పెద్ద వివాద చర్చనీయాంశమైనది. అది ఎలాగో సమసిపోయింది. వారి సిద్ధాంత గ్రంథానికి బంగారు పతకం కూడా లభించినట్లు గుర్తు. అప్పట్లో పోడియాలో వారి సిద్ధాంత గ్రంథానికి - విశేష ప్రాచుర్యం లభించింది. వారికి కూడా విశేష గౌరవ మర్యాదలు లభించాయి. వారు అమెరికా నుండి వచ్చి వెళ్ళిన అన్ని సందర్భాల్లోను పత్రికలు వారికి బ్రహ్మరథం పట్టాయి. వారి మాటకు పట్టంగట్టాయి. అప్పట్లో వారు కమ్యూనిస్టు 'భావజాలం'లో వున్నారు. మూర్తిగారి వ్రాతను బట్టి ఇప్పుడు వారి వైఖరిలో మార్పు వచ్చినట్లుగా బోధపడుతుంది. మూర్తిగారు మార్పు సహజమంటూనే వారిని తప్పుపట్టారు. ఎందువల్లనో? తాము నెత్తిన పెట్టుకుంటున్న గురజాడను అలా విమర్శిస్తారా? ఆయన (వెల్చేరు) అనేది కావచ్చును. తాము అభిమానిస్తున్న గురజాడను అలా విమర్శిస్తారా ఆయన (వేల్చేరు వారు) అనేది కావచ్చును.

ఇక మూర్తిగారు వ్రాసినదానినిబట్టి ఈ క్రింది ఆక్షేపణలను గురజాడపై తమ ఆంగ్లీకరణ గ్రంథంలో వెల్చేరు వారు చేసినట్లు బోధపడుతుంది. ఇలా ఎందుకు వ్రాయవలసి వచ్చిందంటే, మూర్తిగారి వ్రాతలో కొంత స్పష్టత లోపించింది. కనీసం నా వరకు)

1. వంద ఏళ్ళకు పైబడి ప్రజలు తెలుగు సాహిత్య లోకం ఈ గ్రంథాన్ని (కన్యాశుల్కం) అపార్థం చేసుకుంది.

2. మార్క్సిస్టులనబడే ఒక గుంపు తెలుగు సాహిత్యంలో చర్చను చంపేసి అభిప్రాయాల రుద్దుడు అనే ఎజెండాను అమలు చేశారు.

3. (భారతదేశంలో) ఆధునికత ఆంగ్లేయుల వలస పాలనతో ఆరంభమైందని, అప్పటికి భారతీయులు నైతికంగా పతనమైనారని చాలమంది నమ్ముతారు. సామాజిక పునరుద్ధరణ వలస పాలనలోనే ఆరంభమైందని భారతీయ మేధోవర్గం నమ్మింది. భారతీయులు మూఢ విశ్వాసాలలో అనైతికతలో కూరుకుపోయి, మానవ విలువలకు స్పందించే శక్తిని కోల్పోయారని వారు నమ్మారు. వంగదేశంలో వలస పాలకులు ఈ భావాలను విత్తారు. వారికి ప్రతినిధులు రాజారామ్‌మోహన్‌రాయ్, దేవేంద్రనాథ ఠాకూరులు. వారు బ్రహ్మ సామాజికులు. వారి ప్రభావంలోని రవీంద్రనాథ ఠాగూరు భారతీయ సాహిత్యంలో వలస ఆధునికతకు కారకుడు. పాలకుల మద్ధతువలన ఆయన ప్రభావం భారతదేశమంతటా వ్యాపించింది. తెలుగు సాహిత్యం ఆయన ప్రభావంలో నడిచింది. నవ్య - ఆధునిక అనే పదాలతో కవులు తమ కవిత్వాన్ని గుర్తించటానికి ఇష్టపడ్డారు. గురజాడతో ఆరంభించి, కవులు తమను తాము వైతాళికులుగా చీకటి ముగిసి, నూతన భావాలతో ఉదయించిన వెలుగు రేఖలను గానంచేసేవారిగా అభివర్ణించుకున్నారు.

4. బ్రహ్మసమాజ ప్రభావంతో నడిచిన తెలుగు సమాజానికి నాయకుడు కందుకూరి. ఈయన సాహిత్యాన్ని తన భావాలకు ప్రచార సాధనంగా వాడుకున్నారు. బ్రాహ్మణ కులంలోని స్త్రీల వితంతు వివాహాలు, యాంటీనాచ్ పేరిట వేశ్య కులం స్త్రీల వ్యతిరేకత అనే రెండు చిన్న సైజు కుల సంస్కరణలకు సాంఘిక సంస్కరణలు అనే పెద్ద పేరు పెట్టుకున్నారు. ప్రజల్లో వస్తున్న మార్పులను గమనించిన వలస ప్రభుత్వం తనకు (కందుకూరికి) ఇస్తున్న ప్రోత్సాహంతో తన పుస్తకాలను పెద్ద ఎత్తున

అమ్ముకోగలిగాడు. అలా సాహిత్యాన్ని శాసించాడు. మద్రాసులోని సాహిత్య వాతావరణం పూర్తిగా ఆయన ప్రభావంలో నడిచింది.

5. గురజాడ ఈ సంస్కరణలకు బద్ధ వ్యతిరేకి. ఈయన వలస ఆధునికతకు చెందినవాడు కాదు. ఆయన కన్యాశుల్కంలోని పాత్రలు ఆనాటి సమాజపు ఆత్మవిశ్వాసానికి ప్రతినిధులు.

6. గురజాడ వలస పూర్వ ఆధునికతకి వారసుడు. ఆ ఆధునికతకు కేంద్రం కాముకత్వం. అప్పారావు అలా పూర్వ వలస అనంతర ఆధునికుడు కావడానికి విజయనగర పరిస్థితులు కారణం (నాటి విజయనగర ప్రభువుల) లేజిస్లేటల్ కౌన్సిలు సభ్యునిగా బాల్యవివాహాల రద్దు చట్టాన్ని స్పాన్సర్ చేశాడు. ఆయన సంస్కరణాభిలాష ఆంగ్ల పాలకుల కోసం ఏర్పడింది. వారిని మెప్పించటానికి రాజు (కన్యాశుల్కం) రాయించాడు. రాజు ముందు తల ఎత్తి నించోటం కూడా చెయ్యని, లౌక్యంలో ఆరితేరిన గురజాడ రాజాజ్ఞపై కన్యాశుల్కం 1892లో రాసారు. 1897లో రాజు మరణించిన తర్వాత గురజాడకి స్వతంత్రం లభించింది. రాజుగారి వితంతు సోదరి తనకంటె 14 ఏళ్ళు పెద్దదైన అప్పలకొండనూంబతో సేవకులందరూ వెళ్ళిపోయిన తరువాత గురజాడ రాత్రిళ్ళు వైన్ త్రాగడంతో, మాంసం తినటంతో గడిచాయి. శారీరకంగా తాను బలహీనుడు కావటంవలన సంభోగించలేదని, సానుల ఇళ్ళల్లో గడిపినా వారిని పరిశీలించటానికి మాత్రమే వెళ్ళానని స్నేహితులతో చెప్పుకున్నాడు. క్రొత్త స్వాతంత్ర్యంతో రెండవ కన్యాశుల్కం రాసారు.

వలస పూర్వ ఆధునికతకు, వలస అనంతర ఆధునికతల నిర్వచనాలు, ఉదాహరణలు, సూత్రీకరణలు సవివరంగా మూర్తిగారి వ్యాసంలో ఉన్నాయి గనుక ఇక్కడ అవసరంలేదు. అయినపుడు పైన ఇచ్చిన ఆక్షేపణలు కూడా వారి వ్యాసంలో ఉన్నాయిగదా! మరి ఎందుకు ఇచ్చారనే ప్రశ్న తలెత్తుతుంది. కేవలం తక్షణ జ్ఞప్తికొరకేనని మనవి. టూకీగా చెప్పాలంటే వలస పూర్వ ఆధునికతకు ప్రధాన లక్షణం కాముకతగా వెల్చేరువారు నిర్ధారించి, దానికి తన అభిరుచికి అనుగుణంగా గురజాడ రెండవసారి కన్యాశుల్కం రచించారు. ఇదే మూర్తిగారి ప్రధాన ఆక్షేపణ. కాముకత విషయమైన చర్చ ఏమంటే, విక్టోరియన్ నీతి వచ్చేవరకు, భారతదేశంలో దానిపై స్వతంత్రత వుందని, దాని తరువాత హద్దులు ఏర్పడ్డాయని, తత్ఫలితమే రాధికా సాంత్వన విషయమై కందుకూరి నిషేధం అమలు చేయించాడని వెల్చేరు వారు అనగా, దానిని పాక్షికంగా ఒప్పుకుంటూనే మూర్తిగారు, మానవ సమాజంలో ఎక్కడైనా ఎప్పుడైనా కామానికి కొన్ని హద్దులు పాటిస్తూనే వుంటుంది గనుక, కేవలం విక్టోరియన్ నీతే మన ఆధునికతను శాసించిందని, అది అంతకు ముందే పుట్టిన ఆధునికతను చంపేసిందని వెల్చేరువారు చేసిన సూత్రీకరణ చెల్లదని చెప్పారు. ఇంకా వెల్చేరు వారి వ్రాతపై మూర్తిగారు తేల్చి చెప్పిన మాట ఏమంటే, వారు అలా వ్రాయటం వారు (వెల్చేరు) వదిలేసిన మార్క్సిజంపై అసహనం కావచ్చు లేదా అమెరికాలో కేంద్రీకృతమైన ప్రపంచ వ్యాపార వర్గపు స్వప్రయోజనాల ఎజెండా తాలూకు ప్రత్యక్ష (అమెరికా వాసులవటంవల్ల) లేదా పరోక్ష (మేధావులు సైతం ప్రపంచంలో ప్రాంతాలకు, మతాలకు, గతాలకు అతుక్కుపోయేటట్టు చేయటంవల్ల) ఫలితం కావచ్చు అని వ్రాస్తూ, 'మతములన్నియు మాసిపోవును, జ్ఞానమొక్కటే నిలిచి వెలుగును' అన్న ఆనాటి ప్రపంచ స్వప్నాన్ని తెలుగు అనే ప్రాంతీయ భాషలో పలవరించిన ప్రపంచ మానవుడు గురజాడను, ఆయన సామాజికోద్ధరణ లక్ష్యం ప్రకటించే ఆంగ్ల భాషలోని ముందు మాటలను ప్రపంచానికి అందకుండా చేసిన వెల్చేరు వారిని, వారి వెనుక మేధావులను, వారి వెనుక అమెరికా పాలకులను, దాని వెనక ప్రపంచ వ్యాపారి పథకాలనూ వారి తెలివితేటలను ప్రస్తుతానికి అభినందిద్దాం అంటూ ఇది వెల్చేరువారు తెలియక చేస్తే, వారికి సానుభూతి ప్రకటిద్దాం, మనముత్తి వెధవాయలమోయ్ అని తెలుగులో అనిపించి మొట్టికాయ మొత్తిన గురజాడ అప్పారావుగారనే ప్రపంచ పౌరుడి మాట మార్చి 'మేమొత్తి వెధవాయలమే' అని చేతులు కట్టుకు ప్రకటించిన వెల్చేరు వారి వెనుక ప్రస్తుతానికి భారత దేశపు భారతీయులెవరూ లేకపోవటానికి సంతోషిద్దాం అంటూ మూర్తిగారు తమ వ్యాసం ముగించారు.

ఇంకా మూర్తిగారు గురజాడను నూతన భావాలకు వైతాళికుడని శ్లాఘిస్తూ, అలా ఆయనను పరిగణిస్తున్న వందేళ్ళ ఆలోచనాపరులపట్ల ఎలాంటి మర్యాదలూ పాటించకుండా చీల్చి చెండాడి కొట్టిపారేసి వెల్చేరువారు ఆనంద తాండవం చేశారని వ్రాశారు. బాగుంది. వాఙ్మయంలో (సాహిత్యంలో కాదు. నేను ఈ రెండు

పదాలను నిర్దిష్టమైన భావనలో ఉపయోగిస్తాను) వచ్చిన ఆ యా విషయాలపైన వర్తమానంలోను, అనంతర కాలంలోను విమర్శలు, తదనుగుణంగా సూత్రీకరణలు రావటం సహజం. ఇది అవి చేసే వ్యక్తుల అవగాహనాపటిమ, భావనాశక్తి, అన్వయ సమర్థతలపై ఆధారపడి వుంటాయి. దానితో ఏకీభవించటం, ఏకీభవించకపోవటంపై పాఠకులను స్వాతంత్ర్యం వుంది. అలాగే తన అభిప్రాయాన్ని వెలువరించే స్వతంత్రమూ వుంది. అయితే మనం ప్రేమించాము, ఆరాధించాము గనుక ఇతరులందరూ ఆ బాటలోనే వుండాలని నియంత్రించటం ఏదో ఒక 'ఇజం' క్రిందకు వస్తుంది. దీనిని ఏ రచయితా, విమర్శకుడూ అంగీకరించడు. అలాంటి దానినుండే గ్లాన్‌నోస్త్ పెరిస్త్రాయికాలాంటివి పుట్టుకువస్తాయి. మూర్తిగారు, తాము గురజాడను, వీరేశలింగాన్ని ఆరాధించవచ్చు. ఇతరులను కూడా ఆరాధించమని శాసించలేరుగదా! ఇక ఇచ్చట నా మనవిని పాఠకులు ఆలకించండి. దీనిని మూర్తిగారు లేక ఇతరులెవరైనా స్వీకరించి తగు స్పందనను తెలియపరిస్తే కృతజ్ఞుడను. ముందు నేను, వరకట్నాన్ని గూర్చి, కన్యాశుల్కాన్ని (ఉంకువ, ఓలి) గూర్చి, వ్రాసిన వాటిని మనసులో ఉంచుకొని స్పందింప ప్రార్థన.

1. సంప్రదాయమైన కన్యాశుల్కాన్ని అడ్డంపెట్టుకుని, కన్యను అదికూడా యుక్త వయసు రాని బాలికలను అమ్మకపు వస్తువులుగా చేసి, ముదుసలులైన కొండొకచో చావటానికి సిద్ధమైన వరులకిచ్చి పెళ్ళిచేసిందెవరు? బ్రాహ్మణులు. అది కూడా ఒక ప్రాంతంవారు తప్ప మిగిలిన సమాజంలో ఒక్క ఉదాహరణను చూపగలరా? మొత్తం సమాజంలో బ్రాహ్మణులు ఒక వర్గం. వారిలోని ఒక సమస్యపై ఒక బ్రాహ్మణుడు వ్రాస్తే, అది సాంఘిక సంస్కరణ అవుతుందా? ఎందుకు వంద ఏళ్ళుగా పై విధంగా నమ్మించారు? నమ్మించిందెవరు? కమ్యూనిస్టులు కారా! గురజాడను సంఘసంస్కర్త అని ప్రచారం చేసిందెవరు? వారు కారా? ఎవరిని ఉద్ధరించటానికి గురజాడ అది వ్రాసారో, ఆ సమాజం ఎప్పుడైనా ఆయనను పట్టించుకుందా? కమ్యూనిస్టులు ప్రచారం ప్రారంభించిన తరువాతనేగదా, కొందరు బ్రాహ్మణులు పట్టించుకుంది. పట్టించుకున్న బ్రాహ్మణులు తమ వ్యక్తి నిష్ఠమైన పేరుప్రఖ్యాతులకు దానిని అలంబనం చేసుకున్నారుతప్ప అందులో త్రికరణశుద్ధిగా కమ్యూనిజాన్ని అలవరచుకున్న బ్రాహ్మణులెందరు? 2. మొదట ఆ నాటకానికి ప్రదర్శనపూర్వక ప్రచారాన్ని తెచ్చింది కమ్యూనిస్టులు కాదా? ఇతరులు ఎందరు దానిని ప్రదర్శించారు? ప్రదర్శించింది సంఘ సంస్కరణ కోరి చేశారా? లేదా హాస్య నాటకంగా భావించి ప్రదర్శించారా? దానికి విస్తృతమైన ప్రచారం సమకూర్చేనాటికే బాల్యవివాహాలు అంతరించిపోలేదా? మొదట బాల్యవివాహాలు అంతరించిపోవటానికి కాలంలో వచ్చిన మార్పు, తదనుగుణంగా సమాజంలో వచ్చిన మార్పు తప్ప, ఆ నాటకం ఏమైనా దోహదం చేసిందా?

3. ఎక్కడి కన్యాశుల్కం? ఏ కాలంనాటి ఇతివృత్తం? బట్టతలకు మోకాలికి ముడిపెట్టినట్లు, వెల్చేరువారి సూత్రీకరణను మార్క్సిజంపై అసహనంగాను, అమెరికా వ్యాపార వర్గ ప్రయోజనాలకు అనుగుణమైనదిగాను పడికట్టు పదాలలో చిత్రీకరింపవచ్చునా? ఇలా మూర్తిగారు వ్రాయటం ఎవరి నుండి ఏ ఉపయోగాలను ఆశించి వ్రాసినట్లు? వారే అన్నట్లు కాలంలో అభిప్రాయాలు మారవచ్చుగదా. మారినట్లు స్పష్టంగా వెలిబుచ్చటం వ్యక్తి నిష్ఠమైన మానసిక ఆరోగ్యానికి మేలు కాదా? ఆ మాట మనకు అంగీకారమా కాదా అన్నది వేరే ప్రశ్న? మూర్తిగారు, ఎందుకింత అసహనానికి లోనైనట్లు? మార్పు తనలో కలిగి, దానిని వెలిబుచ్చలేకపోతే దానంత దౌర్భాగ్యం మరొకటి లేదు. పైగా మానసిక ఘర్షణకు దారితీసి మానసిక సమతుల్యతను పోగొడుతుంది. నాకు తెలిసి తన జీవితకాలమంతా చివరివరకు కమ్యూనిస్టులుగా వున్నవారు ఇద్దరు వున్నారు. అందులో ఒకరు చాలా ప్రముఖులు. వారిలో చివరి దశలో కమ్యూనిజంపై పునరాలోచన చోటుచేసుకుంది. ఆ దశలో నేను వారిని నా భారతం ప్రచురించుకోవాలి. డబ్బు ఇవ్వమని అడిగాను. వారి దగ్గర, డిమాండ్ చేసి అడిగేటంతటి స్వతంత్రం నాకుంది. దానికి వారు అన్నమాట ఇవ్వాలనే వుందిరా? కాని ఇంత కాలమూ కమ్యూనిస్టుగా వుండి, భారత ప్రచురణకు నీకు డబ్బిస్తే పార్టీ నన్ను వేరుగా అంచనా వేస్తుంది. నేను ఇవ్వనుగాని, నా కుటుంబంలో మరొకరి ద్వారా ఇప్పిస్తాను అన్నారు. వారు ఆ మాటంటే నాకు దుఃఖం కలిగింది. అలా వద్దులెమ్మన్నాను. మరి ఈ విషయంలో వారి అభిప్రాయాన్ని మనం అంగీకరించకపోయినా, వారిదైన ఋజుత్వానికి వెల్చేరు వారిని అభినందించవద్దా!

ఇక మూర్తిగారు వెల్చేరు వారి ఒక్క సూత్రీకరణపైనే

దృష్టి నిలిపారు. మిగతా విషయాలను (వెల్చేరు వారు చేప్పినవి) వదిలేశారేమి? వారు సంధించిన ప్రశ్నల్లో ఏది అబద్ధం? వాటితోపాటు నాకు గల ఈ సందేహాలకు (ప్రశ్నలకు) ఎవరైనా సమాధానం యిస్తే కృతజ్ఞుడను.

1. కన్యాశుల్కం నాటకాన్ని గురజాడ (బ్రాహ్మణుడు) గాక మరో సామాజిక వర్గీయుడు వ్రాసి వుంటే బ్రాహ్మణ సమాజం ఆమోదించేదా? పోనీ గురజాడ వ్రాసిన దానిని నాటి బ్రాహ్మణ్యం ఆమోదించిందా? మౌనం వహించిందా?
2. శారదా చట్టాన్ని ఉల్లంఘించి బందరు ఫ్రెంచి పేటలో, యానాములో బాల్య వివాహాలు జరిపించిందెవరు?
3. వీరేశలింగం వితంతు వివాహాలు చేయించింది బ్రాహ్మణులకేనా? ఇతరులకు కూడానా? మొదలు ఎవరైనా ఇతర సామాజిక వితంతువులు ఆయనను ఆశ్రయించారా?

ఇతర సామాజిక వర్గాలలో వితంతు వివాహాలపై విధినిషేధాలు లేవు. వైధవ్యాన్ని పాటించటం ఐచ్ఛికంగా, కొన్ని సందర్భాలలో కుటుంబ గౌరవ మర్యాదలను (నాటి) బట్టి జరిగేది. నాకు తెలిసిన ఒక వృత్తాంతం. వివాహం నిశ్చయమయింది (యుక్త వయసులోని వారే సుమా) తాంబూలాలు పుచ్చుకున్నారు. అంటే వరుని తరఫువారు వధువును తమ కుటుంబ సభ్యురాలిగా స్వీకరించారు. ఇక జరుగవలసింది పందిట్లో అయినవారి అందరిముందు మంగళసూత్ర ధారణము, ఇతర వేడుకలు. అయితే ఆ ముహూర్తానికి ముందే వరుడు పాముకాటువలన మరణించాడు. రెండు కుటుంబాలలోనూ విషాదం అలముకుంది. వివాహం రద్దు అయినట్లే కదా! కాని అత్యంత ఆశ్చర్యకరంగా ఆ వధువు వైధవ్యాన్ని స్వీకరించింది. ఎందరో చెప్పిచూశారు. ఆమెది ఒక్కటే మాట. తాను మానసికంగా ఉద్దేశించిన వరునికి భార్యనైనానని. నిశ్చయ తాంబూలాలు అయినాయి. అత్తవారిచ్చిన చీర, గాజులు ధరించాను. కనుక నాకు వివాహమైనట్లే. ఇదీ ఆమె మాట. మరణ పర్యంతమూ అత్తమామల ఇంటనే వుంది. వారు కూడా ఆదరించారు. ఆస్తిలో వాటా ఇచ్చారు. మరది కుమారుని దగ్గరకు తీసింది. అలా జీవితాన్ని వెళ్ళబుచ్చింది. కనుక కొన్ని సందర్భాల్లోనైనా అది ఐచ్ఛికం. అలాగే మరో వివాహం చోటుచేసుకోవటం కూడా అంతే ఐచ్ఛికం. అయితే అవి ఎక్కువగా చోటు చేసుకోలేదు. కారణం తెచ్చిపెట్టుకున్న కుటుంబ గౌరవ మర్యాదలు. సంఘంపట్లగల వెరపు. అయితే శిరోముండనం, కుటుంబంలో ఒక పనిమనిషిగా మార్చటంలాంటివి బ్రాహ్మణేతర సమాజాల్లో లేవు. ఇక గురజాడవారు తమ కుమార్తెను అతి బాల్యవివాహం చేసిన మాట అబద్ధమా? కామాసక్తి పై ఎవరి బలహీనతలు వారికుంటాయి. అవి అత్యంత సహజం. అయితే మూర్తిగారే అన్నట్లు దానికి కొంత మరుగు వుంటుంది. నిజమే. అయినపుడు అప్పల కొండాయమ్మ గారితో గల చనవును గురజాడ బహిర్గతం చేయటం ఎలాంటి సంస్కారమవుతుంది? వీరేశలింగం విషయానికి వస్తే బ్రాహ్మణ వితంతువులకేగదా ఆయన వివాహాలు చేసింది. ఇక్కడ మరోవిషయం నేనడగాలని అనుకుంటున్నాను. వీరేశలింగం గారికి వారి భార్య రాజ్యలక్ష్మమ్మగారికి పొరపొచ్చాలు రావటానికి ప్రధాన కారణమేమిటి? అదేదో నాకు తెలుసు. ఎలాగంటే కీ.శే. కుప్పా ఆంజనేయశాస్త్రి గారు క్లాసులో (1958-89) చెప్పారు. ఆయన తన పలుకుబడితో కాదా రాధికాసాంత్వనాన్ని నిషేధింపచేసింది. అందులో వారు సంబంధించినవిగా చూపే పద్యాల్లో బూతు వుందా? నిజంగా ఒకవేళ బూతును బూతనుకోగల పద్యాన్ని ఆయన గుర్తించాడా?

ఏమైనా ఒక సామాజిక వర్గంలో అవి కూడా తాము కోరి అనుసరించిన వానివి, ఆ సమాజంలోనివారే సంస్కరించుకుంటే, వాటిని సాంఘిక సంస్కరణలుగాను, వారిని సంఘ సంస్కర్తలుగాను ప్రచారం చేయటం, విగ్రహాలు పెట్టటం! ఏమిటది? రాయల సీమలో, తెలంగాణంలో ఆ ఇద్దరి పేర్లు ఇప్పటి ఏభై ఏండ్లకు ముందు ఎరిగినవారెందరు? ఇప్పుడైనా ఆ ప్రాంతాల్లో వారికి గల ప్రచారమెంత? కోస్తాలో, అదికూడా కృష్ణా, గుంటూరు జిల్లాల్లో తప్ప ఇతర ప్రాంతాల్లో వారి పరిచయమెంత? కమ్యూనిస్టులు ప్రచారం కల్పించక పూర్వం, వారిని పట్టించుకున్న బ్రాహ్మణులెందరు? అవునూ! వారు సంఘసంస్కర్తలే అయితే సతీసహగమనాన్ని పట్టించుకోలేదేమి? కారణం అది బ్రాహ్మణుల్లో లేదు గనుకనే కదా? కమ్మవారికి, యాదవులకు మాత్రమే అది పరిమితం కావటం కాదా? నా యీ ప్రశ్నలకు, సందేహాలకు ఎవరైనా సమాధానమిచ్చి నివృత్తి చేయగలరని కోరుతూ

మి



ఆచార్య యార్లగడ్డ బాలగంగాధరరావు
విజయవాడ. ఫోన్ : 9849499169



# చదవండి...

– ఎన్నార్కె

✦ **నేను మలాల :** నోబుల్ బహుమతి పొందిన మలాల ఆత్మకథ యొక్క తెలుగు అనువాదం. అనువాదకులు కె. సత్యరంజన్. ఐద్వా వారి ప్రచురణ.

*పేజీలు : 320, వెల : ₹ 200/–, ప్రతులకు – ఐద్వా స్టేట్ ఇష్యూ, కృష్ణలంక, విజయవాడ – 520013.*



✦ **మనిషి కతలు :** బహుముఖమైన రచనలు సాగించిన దేవరాజుమహారాజు వ్రాసిన చిన్న కథల సమాహారం. సామాజిక, మానవతా ధృక్పథాలను కల్పనతో రంగరించి వ్రాసి తనదైన ముద్రను సూచించాడు.

*పేజీలు : 82, వెల : ₹ 60/–, ప్రతులు అన్ని పుస్తకాల షాపులలో లభించును.*

✦ **దార్శనికుడు గురజాడ :** గురజాడ రచనలలో మహిళల ఔన్నత్యాన్ని విశ్లేషిస్తూ తెలకపల్లి రవి, ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ, కాత్యాయనీ విద్మహే, మృణాళిని, జగద్ధాత్రి, కాళిదాసు పురుషోత్తమ్ వ్రాసిన వ్యాస సంపుటి. ప్రజాశక్తి ప్రచురణ.



*పేజీలు : 80, వెల : ₹ 30/– ప్రతులకు ప్రజాశక్తి అన్ని బ్రాంచిలలో లభ్యం.*

✦ **రైతు రాజకీయంలో విజయకుమార్ నరిశెట్టి :** ఆయన గురించిన విషయాలు చరిత్రలో మరుగుపడకూడదని వారి సోదరులు ఇన్నయ్య, ఇతర కుటుంబ సభ్యులు వ్రాసిన వ్యాసాల సంకలనం. సావనీర్ సైజు పుస్తకం.

*పేజీలు : 148, వెల : అమూల్యం, ప్రతులకు : పల్లవి పబ్లికేషన్స్, అశోక్ నగర్, విజయవాడ – 520010.*



✦ **శివారెడ్డి కవిత్వ తత్త్వదర్శనం :** నాలుగు దశాబ్దాలుగా నడుస్తున్న శివారెడ్డి కవిత్వం పై డా॥ ఎ.వి. వీరభద్రాచారి చేసిన కవిత్వ తత్త్వదర్శనం. శివారెడ్డి రచనలను మూడు దశలుగా, 5 అధ్యాయములుగా విభజించారు. రక్తం సూర్యుడు నుంచి, భారమతి (మొదటి దశ), మోహనా ఓ మోహనా నుంచి అంతర్జనం వరకూ (రెండవ దశ), వృత్తలేఖిని నుంచి గాథ వరకూ (మూడవ దశ)గా, వాటిలోని క్రమ గతిని, కవితా స్వరూపాలను విపులంగా విశదీకరించారు రచయిత. క్రౌన్ సైజ్.

*పేజీలు : 350, వెల : ₹ 400/–, ప్రతులు* అన్ని పుస్తకాల షాపులలో లభ్యం.



✦ **వరంగల్లు నాటక కళా సౌందర్యము :** వరంగల్లులో పేరుగాంచిన 23 నాటకాలు. వాటి కథ వాటి రచయితలు, పాత్రల స్వభావం, పాపులారిటీ మున్నగు వాటిని సమగ్రంగా విశ్లేషించిన రచన. నాటక ప్రియులకు ఉపయుక్తం.

*పేజీలు : 250, వెల : ₹ 250/–, ప్రతులకు –* ఫోన్ : 0870–2562477

✦ **ది ఎడిటర్ :** రచయిత అర్నాద్. 1988లో రచించబడిన నవల. 1990లో స్వాతి మాసపత్రికలో ప్రచురించబడింది. సాహితీ రంగంలో నేటి జుగుప్సాకరకమైన రచనలను కథారూపంలో ఎదుర్కొనటం జరిగింది.



*పేజీలు : 107, వెల : ₹ 100/–, ప్రతులు అన్ని పుస్తకాల షాపులలో లభ్యం.*

✦ **కాకి ముద్ద :** కవిత్వం. ఈతకోట సుబ్బారావు 2011 సం॥లో వ్రాసిన 'చీలిన మనిషి' తరువాత వచ్చిన నవకవితా సంపుటి. ఇందులో కొన్ని పత్రికలలో ఇదివరకు వచ్చినవి. ఒకటి రెండు బహుమతులందుకున్నవి. పూలదొరువు ప్రస్తుత కాలానికి, దీర్ఘ దృష్టి లేమికి అద్దం పడుతుంది.

*పేజీలు : 142, వెల : ₹ 100/–, ప్రతులకు – ఫోన్ : 9940529785*

✦ **కథారామం :** చినుకు, తెలుగు విద్యార్థి లాంటి పత్రికలలో ప్రచురితమైన కథలతో మరికొన్ని కథలను కలిపి రచయిత మహీధర రామశాస్త్రిగారు ప్రచురించిన 18 కథల సంపుటి. కథలు పరిణతిలో చిన్నవయినా ఆలోచింప జేస్తాయి.

*పేజీలు : 77, వెల : ₹ 75/-, ప్రతులకు - మహీధర రామశాస్త్రి, డోర్ నెం. 2.51-10, శంభునగర్, ఫస్ట్ లేన్, ఐ.ఎల్.టి.డి. వద్ద, రైల్వేగౌడ్ రాజమహేంద్రవరం.*



✦ **శతక సాహిత్యం నైతిక విలువలు :** అన్న ప్రధాన అంశంపై వరంగల్లులో నిర్వహించబడిన జాతీయ సదస్సులో పండితులైన ఉపన్యాసకులందరు వివిధ దృక్కోణాలను తమ తమ ప్రసంగాల్లో పేర్కొన్నారు. సోదర భాషలైన కన్నడ, తమిళ భాషల్లో దీని విస్తృతినీ, ఆవశ్యకతనూ, ఔన్నత్యాన్నీ చర్చించారు. సావనీర్ సైజ్‌లో వీటన్నిటినీ ఏరి కూర్చి ప్రచురించిన వ్యాసాల సంపుటి ఈ పుస్తకం.

*పేజీలు : 160, వెల : ₹ 200/-, ప్రతులకు - ఫోన్ : 9949013448*



✦ **కథకు శతమానం :** కథానిక సాహిత్య వ్యాసాలు. సంపాదకుడు గిరిజా మనోహర బాబు. సాహిత్య ప్రక్రియల్లోని అన్ని విశేషాలను తనలో ఇముడ్చుకోగల కథాసాహిత్య ప్రక్రియ లోతు పాతులను సమగ్రంగా విశ్లేషించిన వ్యాస సంపుటి. ఇందులో మొత్తం 43 వ్యాసాలున్నాయి.

*పేజీలు : 424, వెల : ₹ 200/-, ప్రతులకు - ఫోన్ : 9949013448*




✦ **యువజన విజ్ఞానము :** గ్రంథకర్త నూతన గవేషణా బద్ధులైన పరిశోధకులు సురవరం ప్రతాపరెడ్డి. ఇందులో నున్న 14 వ్యాసాలు సామాజిక పరమైనవి. విషయ సాంద్రత, భాషాసరళత పుష్కలంగా ఉన్న రచనలు. ప్రజాసేవలో మోక్షము గలదు అన్న మాటతో సురవరం వారు యువజన విజ్ఞానము అన్న గ్రంథానికి ముగింపు పలకటం ఆయన ఆలోచన ధోరణికి అద్దం పడుతుంది.

*పేజీలు : 238, వెల : ₹ 250/-, ప్రతులకు - సురవరం పుష్పలతా రెడ్డి. సాహితి వైజయంతి ట్రస్ట్ - బి - 6. డి.డి. కాలనీ, హైదరాబాద్ - 500007.*




✦ **ప్రశ్నోత్తరాల్లో దివ్యజ్ఞానం :** Theosophy Explained in Questions and Answers. రచన పి. పావ్రి. స్వేచ్ఛానువాదం. డా॥ పి.ఎల్.ఎన్. ప్రసాద్. ఎందరో ప్రముఖులు, సి.డబ్ల్యూ లెడ్ బీటర్, అనిబీసెంట్ వారి రచనలను ఈ గ్రంథానికి ఆధారంగా స్వీకరించారు రచయిత. దివ్యజ్ఞానాన్ని సుస్పష్టం చేసిన రచనిది. క్రౌన్ సైజ్ బౌండ్ పుస్తకం.

*పేజీలు : 350, వెల : ₹ 250/-, ప్రతులకు - ఫోన్ : 9866565863.*




✦ **దృశ్య - అదృశ్య మానవుడు :** మూలం సి.డబ్ల్యూ లెడ్ బీటర్. స్వేచ్ఛాను వాదం డా॥ పి.ఎల్.ఎన్. ప్రసాద్. మానవుని భౌతిక దృష్టికి ఒక లోకమే కనిపిస్తున్నప్పటికీ, ఇంకా ఆరులోకాలు ప్రకృతిలో భిన్న స్థాయిలో, భిన్న ద్రవ్యరాశులతో నెలకొని ఉన్నాయి. ఇటువంటి ఆధ్యాత్మిక ప్రస్థానంలో ఈ రచనలు కొనసాగాయి. వర్ణచిత్రాలు సందర్భోచితంగా ఉన్నాయి.

*పేజీలు : 109, వెల : పేర్కొన బడలేదు. ప్రతులకు - ఫోన్ : 9866565863*




✦ **అన్వేషణ :** శ్రీమతి సుందరమ్మ గారి స్మారక సంచిక. రచయిత వెలమాటి సత్యానారాయణ. మనసును తాకే రచనా శైలి మనల్ని చదివింప జేస్తుంది. మరణానంతరం చేసే నేత్ర దానం. శరీర దానం ప్రాశస్త్యాన్ని మన ముందుంచారు రచయిత.

*పేజీలు : 32, వెల : పేర్కొన బడలేదు. ప్రతులకు - ఫోన్ : 0883 - 2441265*

✦ **నీరాజనం :** ముందు ప్రస్తావించిన పుస్తకంలానే. ఇది కూడ వెలమాటి సుందరమ్మ గారి స్మారక సంచిక మిగతా వివరాలు మామూలే.

*పేజీలు : 50, వెల : అమూల్యం, ప్రతులకు - ఫోన్ : 0883 - 2441265*

MISIMI / **మిసిమి** / RNI Regd.No.45042/90 Telugu Monthly, Hyderabad - 500 020
Postal Regd.No.H/SD/191/2015-17
Date of Posting: On 29th & 30th of every month.
Date of Publication: 25.12.2015



**Guinevere**
(జార్జి లూకాస్ ఆర్ట్ గాలరీ – చికాగో)